# జయదేవ్ కథలు

ఆచార్య మర్రెబోయిన జయదేవ్
ఎం.ఏ., పిహెచ్.డి., డి.లిట్.
విశ్రాంతాచార్యులు

ఈ గ్రంథం
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
వారి ఆర్థిక సాయంతో ముద్రితం

**జయదేవ్ కథలు**
రచన, ప్రచురణ
ఆచార్య మర్రెబోయిన జయదేవ్

**Jayadev Kathalu**
Written & published
by ***Prof. M. Jayadev***

ముఖ చిత్రం & పేజినేషన్
శ్రీమతి పెనగంటి విజయలక్ష్మి

**ప్రథమ ముద్రణ**
సెప్టెంబరు, 2022
ప్రతులు : 500

**ప్రతులకు**
ఆచార్య ఎం. జయదేవ్,
ఫ్లాట్ నెంబర్- 402,
దేవాస్ ఈస్ట్ వెస్ట్ రెసిడెన్సి,
ప్రభుపాద టౌన్ షిప్, మసీద్ బండ,
కొండాపూర్, హైదరాబాదు - 500084,
సెల్: 9290102364.

నవోదయ బుక్ హౌస్,
కాచిగూడ, హైదరాబాదు
తెలుగు బుక్ హౌస్,
కాచిగూడ, హైదరాబాదు

పద్మిని - సెల్ నెం : 85588 99478

వెల : రూ. 100

# అంకితం

తల్లి నెరుగువాడు దైవంబు నెరుగును - వేమన



మా అమ్మ **మర్రెబోయిన వెంకటమ్మ** గారికి

మా నాన్న **మర్రెబోయిన పుల్లన్న** గారికి

గౌరవాభిమానాలతో..

# నా మాట

చిన్నప్పటి నుంచి కథలంటే నాకు చాలా ఇష్టం. బాల్యంలో చందమామ, బాలమిత్ర మొదలైన కథల పత్రికలను బాగా చదవేవాన్ని. జానపద కథలు కూడా బాగా చదివే వాన్ని. అందువల్లనే కాబోలు ఆధునిక సాహిత్యంలో నాకు కథల మీద మంచి ఆసక్తి ఏర్పడింది. ఈ ఆసక్తితో తెలుగులో వచ్చిన కథలను, అనువాద కథలను బాగా చదివాను. ఇలా కథలు చదవడం వల్ల నాకు గూడా కథలు రాయాలన్న కోరిక కలుగుతూ వచ్చింది. కాలం గడిచే కొద్దీ ఆ కోరిక ఎక్కువయింది. అయితే నేను ఉద్యోగం చేస్తున్న సమయంలో కథలు రాసే ప్రయత్నం చేయలేదు. ఉద్యోగ విరమణ తర్వాత కథలు రాయాలని గట్టిగా ఆలోచించాను. నాకు మంచి మిత్రుడు కథలు రాయడంలో చేయి తిరిగిన గొప్ప కథకుడు వి.ఆర్. రాసాని గారికి కథలు రాయాలన్న నాకోరిక గురించి చెప్పాను. ఆయన "మీరు రాయగలరు బాగా రాయండి" అని నన్ను ప్రోత్సహించారు. ఆ ఉత్సాహంతో కథలు రాయాలని నిర్ణయించుకున్నాను.

ఎలాంటి కథలు రాయాలి అనే విషయం మీద నాకు స్పష్టమైన అభిప్రాయముంది. మానవ మనస్తత్వంలో విభిన్నమైన కోణాలున్నాయి. మనుషులు ఒక్కొక్కరు ఒక్కొక్క భిన్నమైన మనస్తత్వాన్ని కలిగి ఉంటారు. ఏ ఇద్దరు మనుషులు ఒకే విధంగా ఉండనట్లే ఏ ఇద్దరు వ్యక్తులు ఒకే విధమైన మనస్తత్వాన్ని కలిగి ఉండరు. ఎంతో కొంత ప్రత్యేకత ప్రతి మనిషి లోనూ వుంటుంది. అలాంటి ప్రత్యేకతలతో కూడిన భిన్నమైన మనస్తత్వాలను నేను రాసే కథల్లో ప్రతిఫలింప జేయాలన్నది నా ఆలోచన. దీనికి ప్రధానంగా లోకాన్ని ముఖ్యంగా మనుషులను బాగా పరిశీలించాలి. లోకంలో అనేక సంఘటనలు జరుగుతూ ఉంటాయి. ఆ సంఘటనలు ప్రధానంగా భిన్నమైన వ్యక్తుల మనస్తత్వం ఆధారంగా జరుగుతాయి. అలాంటి సంఘటనల్లో దాగి ఉన్న మనుషుల మనస్తత్వాన్ని కేంద్రంగా చేసుకొని కథలు రాయాలన్నది నా ఆలోచన. కేవలం ఊహించి కల్పించి కథలు రాయడం కంటే జరిగిన సంఘటనల ఆధారంగా కథలు రాస్తే వాస్తవానికి చాలా దగ్గరగా వుంటాయనేది నా అభిప్రాయం.

ఈ దృష్టితో నా అనుభవాన్ని పురస్కరించుకుని "రైలు ప్రేమ" అనే కథను మొదట రాశాను. దీన్ని రాసాని గారికి పంపించాను. రాసాని గారు కథ బాగుంది

అని చెబుతూ కొన్ని విలువైన సూచనలు చేశారు. ఆ సూచనల ఆధారంగా కథలో మార్పులు చేశాను. ప్రతి మనిషి జీవితంలోని కొన్ని అనుభవాలను, సంఘటనలను కథలుగా మలచవచ్చు. అలాగే నాజీవితంలోని అనుభవాలను, సంఘటనలను కథలుగా రాశాను.

ఆ తరువాత నేను కన్న, విన్న సంఘటనలను ఆధారంగా చేసుకుని కొన్ని కథలను రాశాను. నేను రాసిన కథలనన్నింటినీ రాసాని గారికి పంపించాను. తన రచనలతో తీరిక లేకుండా ఉన్నప్పటికీ వారు నేను పంపిన ప్రతి కథను ఓపిగ్గా చదివి అనేక విలువైన సూచనలు చేశారు. కొన్ని కథలకు చక్కటి ముగింపును సూచించారు. వారి సూచనలు పాటించి కథల్లో మార్పులు చేశాను. నా యీ కథా రచనలో రాసాని గారు చేసిన సాయం నేను మరువలేనిది. వారికి వేనవేల ధన్యవాదాలు, నమస్కారాలు.

మహాకవి, ప్రజాకవి వేమన నాకు చాలా ఇష్టం. నా ఈ కథల్లో సముచితం అనుకున్న చోట్ల వేమన పద్యాలను చేర్చాను. ఈ కథా సంపుటిలో నా అనుభవాలకు సంబంధించిన కథలు ఉండడం చేత ఈ కథా సంపుటికి "జయదేవ్ కథలు" అనే పేరు పెట్టాను

"అభినందన" అనే పేరుతో క్లుప్తంగా చక్కగా అభిప్రాయాన్ని తెలియజేసిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ ఆచార్య తంగెడ కిషన్‌రావు గారికి, "కొన్ని అనుభవాలు అక్షరాల్లో" అనే పేరుతో నా ఈ కథల మీద చక్కటి అభిప్రాయాన్ని రాసిన ఎల్.ఆర్. స్వామి గారికి, "మధ్యతరగతి బతుకుల చిత్రణ" అనే పేరుతో విలువైన అభిప్రాయాన్ని రాసిన వి.ఆర్. రాసాని గారికి నా ప్రత్యేక ధన్యవాదాలు. ఈ గ్రంథ ముద్రణలో నాకు సహాయం చేయడమే గాకుండా "ఆణిముత్యాల్లాంటి కథలు" అనే పేరుతో చక్కటి అభిప్రాయాన్ని రాసిన కాలువ మల్లయ్య గారికి నా ధన్యవాదాలు.

ఈ గ్రంథముద్రణకు పదివేల రూపాయలు ఆర్థిక సాయం చేసిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారికి నా ధన్యవాదాలు.

ఈ గ్రంథానికి చాలా అందంగా ముఖచిత్రాన్ని తయారు చేయడమే గాకుండా పేజినేషన్ కూడా చేసిన శ్రీమతి పెనగంటి విజయలక్ష్మి గారికి నా ధన్యవాదాలు.

ఇంత కాలానికి కథలు రాయాలన్న నాకోరిక ఫలించినందుకు, నా యీ కథల పుస్తకాన్ని సాహితీలోకానికి పరిచయం చేస్తున్నందుకు నాకు చాలా సంతోషంగా ఉంది.

**జయదేవ్**



ఫోన్ : 040-23234815
సెల్ : 7702414100
ఈ-మెయిల్ : vc@teluguuniversity.ac.in

# పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

POTTI SREERAMULU TELUGU UNIVERSITY
(Accredited by NAAC)

**ఆచార్య తంగెడ కిషన్ రావు**
ఉపాధ్యక్షులు

లలిత కళాక్షేత్రం పబ్లిక్ గార్డెన్స్
హైదరాబాద్ - 5300004

---

## అభినందన

జానపద కథాగేయాలను క్షేత్ర పర్యటన ద్వారా సేకరించి, జానపద విజ్ఞాన పరిశోధనను ఇతోధికంగా చేసిన ప్రొ. జయదేవ్ ఉద్యోగ విరమణ తర్వాత కథా రచనకు పూనుకోవడం చాలా సంతోషింపదగిన విషయం. ' జయదేవ్ కథలు' అనే పేరుతో వీరు రాసిన ఈ పుస్తకంలో 20 కథలున్నాయి. తాను విన్న కన్న సంఘటనలను తన స్వానుభవాలను ఇలా కథల రూపంలో జయదేవ్ గారు మలిచారు. ఇది కొంతవరకు కొత్త పద్ధతి. ఈ కథలన్నీ సులభ శైలిలో, వైవిధ్యభరితంగా ఉన్నాయి. చివరి ఏడు కథలు జయదేవ్ గారి అనుభవాలకు సంబంధించిన ఆత్మాశ్రయ కథలు. మొదటి 13 కథల్లో ప్రధానంగా మధ్యతరగతి బతుకుల చిత్రణ కనిపిస్తుంది. జయదేవ్ గారు ఈ కథల్లో అవసరమైన చోట్ల తమకు ఇష్టమైన వేమన పద్యాలను ప్రవేశపెట్టి, తమ ఆత్మీయతా ముద్రను ప్రదర్శించారు. జయదేవ్ గారు ఇంకా ఇలాంటి మంచి కథలను రాయాలని మనస్ఫూర్తిగా ఆకాంక్షిస్తున్నాను.

***(తంగెడ కిషన్ రావు)***
సెల్ నెం: 77024 14100

# ఆణిముత్యాల్లాంటి కథలు

**డా. కాలువ మల్లయ్య**
ప్రముఖ కథా నవలా రచయిత
హైదరాబాదు
సెల్: 91829 18567

తెలుగు సమాజంలోని ప్రతి ఇంటి లోగిలి ఓకథా లోగిలే. నులక మంచాల్లో కూర్చుని చుట్టలు తాగుతూ కతలు చెప్పుకుంటూ హాస్యసంభాషణలు చేసేవారెంతోమంది. రచ్చబండల మీద కూర్చొని పంచాయతీలు చేస్తూ మధ్య మధ్య పిట్టకథలు చెప్పేవాళ్లూ చాలామందే ఉన్నారు. పిల్లలను నిద్రపుచ్చుతూ కతలు చెప్పే తల్లిదండ్రులూ ఉన్నారు. ఇలా మనకు అతి ప్రాచీన సంబంధిత కథాపూర్వ రంగముంది. ఇదంతా మౌఖికం. ఈ మౌఖిక, జానపద సాహిత్య, వృత్తి సంబంధిత కళాకారుల పరిశోధనలో ఆరితేరిన గొప్ప పరిశోధకులు ప్రొఫెసర్ జయదేవ్ గారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో ఆచార్యులుగ శాఖాధ్యక్షులుగా పనిచేసి, తాను పర్యవేక్షకులుగా విలువైన పరిశోధనలనెన్నింటినో చేయించిన సుపరిశోదకాచార్యులు. యాదవుల జానపద ప్రదర్శన కళల మీద అద్భుతమైన పరిశోధనా గ్రంథాన్ని రాసి డి.లిట్. పట్టా పొందారు. మహాభారతంలోని జానపద కథాంశ కథల మీద వినూత్నమైన పరిశోధన చేశారు. ఇలా జయదేవ్ గారు విశ్వవిద్యాలయంలో జరిగే అరుదైన పరిశోధనల ద్వారా ఉత్తమ ప్రామాణిక పరిశోధనలకు ద్వారాలు తెరిచారు. భవిష్యత్తరాలకు మార్గదర్శకులయ్యారు. జయదేవ్ గారిలో ఉత్తమ పరిశోధకుడు ,విశ్వవిద్యాలయాచార్యులు, జానపద పరిశోధకుడు మాత్రమే కాదు మంచి కథా రచయిత కూడా ఉన్నాడనడానికి "జయదేవ్ కథల" పేరుతో వెలువడుతున్న ఈ కథాసంపుటమే చక్కని ఉదాహరణ.

చిన్నప్పటినుంచి జానపద కథలు చందమామ బాలమిత్ర లాంటి పిల్లల కథలపై ఆసక్తి ఉన్న జయదేవ్ గారు విశ్వవిద్యాలయ ఆచార్య బాధ్యతల్లో, పరిశోధనలో

తలమునుకలుగా వుండి ఎన్నో పుస్తకాలు రాసినా కథలు మాత్రం రాయలేదు. విశ్వవిద్యాలయ బాధ్యతల నుండి విశ్రాంత జీవనం గడుపుతున్న సమయంలో తనలోని కథకున్ని నిద్ర లేపారు. తాను విన్న మౌఖిక కథలకు చదివిన ఆధునిక కథలకు గల తారతమ్యాన్ని గుర్తించారు. తన అనుభవాల సారాన్ని జోడించారు. జీవితానుభవాలను కలబోసుకున్నాడు. ఎలాంటి కథలు రాయాలన్న విషయంలో స్పష్టత ఏర్పరచుకున్నాడు. సాహిత్యమంటే జీవిత వృక్షానికి పూసే పువ్వు లాంటిది తప్ప కాల్పనిక భ్రమల్లో ముంచెత్తేది కాదన్న కొడవటిగంటి కుటుంబరావు మాటలు ఈ సంపుటంలోని కథలకు వర్తిస్తాయి. మానవ జీవితంలోని విభిన్న కోణాలను, మనస్తత్వాలను ఆవిష్కరిస్తూ రాయబడిన ఇందులోని ప్రతి కథా ఈ రచయిత అనుభవసారం.

విషయం ఏదైనా రాయలసీమ ప్రాంతీయ ముద్రతో రాయబడిన ఇందులోని ప్రతి కథ ఓ సందేశాన్నిస్తుంది. ప్రభుత్వ న్యాయవాది కథలో భార్యాభర్తల మధ్య తగాదాలను కౌన్సిలింగ్ ద్వారా పరిష్కరించిన న్యాయవాది, కృషి కథలో ఇంగ్లీషు మాధ్యమం చదువుల అవసరం ప్రాముఖ్యత, పరువు కథలో కులాంతర వివాహం చేసుకున్న కూతురును చంపిన తండ్రి దుర్మార్గం, అనుమానం కథలో అక్రమ సంబంధాలపై అనుమానం లాంటి అనేక విషయాలు– ప్రతి కథలోనూ మానవీయ సందేశం కనబడుతుంది. నాగిరెడ్డిలో చదువు ప్రాముఖ్యతను గుర్తించిన సంస్కర్త హృదయం, నారాయణరెడ్డి తన శాంతమే తనకు రక్ష, అమెరికాకు వెళ్ళిన పిల్లలు, వారికి సాయంగా తల్లిదండ్రులు, దూరమైనా దూరం కాకూడదన్న ప్రేమ సందేశం, భార్యాభర్తల మధ్య సంబంధాలు, మానవ సంబంధాలు, కాలక్రమంల్లో మనుషుల్లో పెరుగుతున్న దూరాలు, దగ్గర కావలసిన విషయాలెన్నో ఈ కథల నిండా ఉన్నాయి.

ఓ మానవతావాది ఉత్తమ పరిశోధకుడు కథలు రాస్తే అందులో కనబడే ఇంటలెక్చువల్ పోజ్ ఈ కథల్లో దర్శనమిస్తుంది. రాయలసీమ ముద్రతో వెలువడుతున్న ఈ ఇరవై కథల సంపుటి ఆచార్య జయదేవ్ గారిని మంచి కథా రచయితగా నిలబెడుతుందనడంలో ఎలాంటి సందేహం లేదు. మంచి పరిశోధనలే కాక మా మంచి కథలందిస్తున్న జయదేవ్ గారికి అభినందనలు....

# మధ్యతరగతి బతుకుల చిత్రణ

**డా. వి.ఆర్. రాసాని**
కథ, నవల, నాటక రచయిత
తిరుపతి

భారతీయ సమాజంలో సింహభాగం వ్యాపించి ఉన్నది మధ్యతరగతి మనుషులే. ఈ మధ్య తరగతిలో ఎగువ మధ్యతరగతి (Upper middle class) అనీ, దిగువ మధ్యతరగతి (Lower middle class) అనీ రెండు పొరలున్నాయి. ఈ ఆధునిక కాలంలో ఏ సాహితీ కారుడైన ఎక్కువ భాగం ఈ మధ్య తరగతి వారి గురించే రాయడం జరిగింది. అచ్చమాంబ నుంచి హైమావతి దాకా ఈ పనే చేస్తూ వచ్చారు. గురజాడ ఒక దిద్దుబాటు కథలో తప్ప మిగిలిన కథల్లోనూ అదే పని చేశారు. శ్రీపాద మొదలు ఇప్పటి జయదేవ్ వరకు ఈ మధ్య తరగతి బతుకులను తమ కథలకు మూలాంశాలుగా ఎన్నుకున్నవారే. ఏ కవికైనా ఏ రచయిత కైనా సమాజంలోని మధ్యతరగతి వర్గపు జీవితాలే విస్తారమైన గనులు. తవ్వేకొద్దీ కథారత్నాలకు అవసరమైన సంఘటనలు, జీవితాలు తళతళా మెరుస్తుంటాయి. పైగా నేటి సృజనకారులంతా ఎక్కువ భాగం మధ్యతరగతికి చెందిన వారు కావడం కూడా విశేషం. సాటి మనుషుల బాధల్ని కష్టాల్ని చూసి ఎక్కువగా చలించే గుణం ఈ వర్గానికి ఉండడం కూడా అందుకు కారణం కావచ్చు. అలా ఒక మధ్యతరగతి జీవన ప్రతినిధి అయిన జయదేవ్ గారు కూడా మధ్యతరగతి నుంచి వచ్చిన వ్యక్తే. అందుకే వీరి కథల నిండా మధ్యతరగతి బతుకులు, ఆ వర్గానికే చెందిన వివిధ స్థాయిల్లోని స్త్రీ పురుషులే దర్శనమిస్తారు. మధ్యతరగతి మనుషుల ఆశలు, ఆవేశాలు, ఆక్రోశాలు, బాధలు, గాధలు, బలాలు, బలహీనతలు, అవమానాలు, అక్రమ సంబంధాలు, ప్రేమలు, పెళ్లిళ్లు అన్నీ ఈ కథల నిండా పరుచుకొని వున్నాయి. రచనాపరంగా చెప్పాల్సి వస్తే ఏ భేషజాలు, పాండిత్య ప్రకర్షణలు, శైలీశిల్ప విన్యాసాల జోరు, హోరు దరిచేరని అతి సహజమైన

పద్ధతిలో రాయబడిన కథలివి. ఈ కథల్లో కనిపించే ప్రతి పాత్రా మనతోపాటు జీవిస్తూ, మనం పీల్చే గాలి పీల్చుతూ వదులుతూ, మన చుట్టూతా కనిపించే వ్యక్తుల్లాగే కనిపిస్తుంది. అలాగే ప్రతి కథలోనూ నేటి సమాజంలో పేరుకుపోయిన నిసర్గ సత్యాల నిలువుటద్దాల ప్రతిబింబాలే కనిపిస్తాయి. మరి ఆ బింబ ప్రతిబింబాలెలాంటివో చూద్దాం.

ఇది మొత్తం ఇరవై కథల సంపుటి. ఈ ఇరవై కథల్లోని సారాంశాన్ని బట్టి పరిశీలిస్తే విద్య, కులాంతర వివాహాలు, కక్షలు, అక్రమ సంబంధాలు, అత్యాచారాలు, విడాకులు, మూఢనమ్మకాలతో బాటు రచయిత స్వీయానుభవాలను కూడా మూలాంశాలుగా చేసుకొని కథలు అల్లడం జరిగిందని గమనించవచ్చు.

"కృషి" కథ విద్యకు సంబంధించిన కథ. మొదటి నుంచీ తెలుగు మీడియంలో చదివిన గోవర్ధన్ బీ.టెక్. లో చేరిన తర్వాత అతి కష్టం మీద ఆంగ్లంలో పట్టు సాధించి మంచి మార్కులతో పాసై ఉన్నత స్థాయికి చేరుకుంటాడు. నేటి ఆంగ్ల విద్య అవసరాన్ని తెలియజేసిన కథ ఇది. ఈనాడు విద్య, నాగరికత ఎంత పెరిగినా కులాల పట్టింపులు పోలేదు. అందుకే తమ పిల్లలు తాము ఇష్టపడిన మరో కులం వాళ్లను వివాహమాడినా, ఇష్టపడినా తల్లిదండ్రులు సహించడం లేదు. విడాకులు, పరువు హత్యలు అందుకే ఎక్కువయ్యాయి. ఈ విషయాన్ని తెలియజేసే కథ "పరువు". వెంకటరెడ్డి కూతురు ఆదిలక్ష్మి. మాల కులస్తుడైన జాన్ ను ప్రేమించి అతనితో వెళ్ళిపోతుంది. అది సహించలేని రెడ్డి తన స్నేహితుడైన బాలన్న సాయంతో మంచిగా మారినట్లు చెప్పించి ఆదిలక్ష్మిని తిరిగి ఇంటికి రప్పించుకుంటాడు. ఆ తర్వాత ఆమె ఏమైందో ఎవరికీ తెలియదు. రెడ్డి మాత్రం తమ బంధువుల ఇంట్లో ఉంది అంటాడు గానీ చూసినవారు ఎవరు లేరు. అంటే పరువు కోసం తండ్రి ఆదిలక్ష్మిని ఎవరికీ తెలియకుండా చంపేశాడన్న విషయాన్ని రచయిత ఎక్కడ వాచ్యం చేయకపోయినా అది పాఠకునికి మాత్రం అర్థమైపోతుంది. అయితే అందరి తండ్రులు అలా ఉండరు. మంచి తండ్రులు కూడా ఉంటారని తెలియజేసిన కథలు "సంస్కర్త", "తన శాంతమే తనకు రక్ష". సంస్కర్త కథ లో అదే రెడ్డి కులానికి చెందిన నాగిరెడ్డి తన తోటకు కాపలాదారుడుగా ఉన్న ఒక మాదిగ కులస్తుడి కొడుకు అయిన రాజన్నను, తన కూతురు రామలక్ష్మి ప్రేమిస్తే ఇద్దరికీ పెళ్లి చేయడమే కాకుండా తన సొంత ఖర్చుతో వారిని బాగా చదివించి కులం కంటే గుణం గొప్పగా ఉంటే చాలని నిరూపిస్తాడు. తన శాంతమే తనకు రక్ష కథలో నారాయణరెడ్డి తన కూతురైన స్నేహలత వేరే కులస్తున్ని ప్రేమించి వెళ్లిపోయి ప్రియునితో సఖ్యత కుదరక తిరిగి వస్తుంది. నారాయణరెడ్డి ఏమాత్రం కోపగించుకోకుండా కూతురిని ఆదరించి పై చదువులు చదవడానికి అమెరికాకు పంపించి మరో మంచి సంబంధం చూసి వివాహం చేస్తాడు.

రాయలసీమ జీవితాలను శాసించేవి కరువులు, కక్షలు. ఈ ప్రాంతపు రచయితలు ఈ రెండు అంశాలను ప్రధానంగా చేసుకొని చాలా కథలే రాశారు. జయదేవ్ గారు కక్షలతో కునారిల్లే జీవితాలు ఎలా ఉంటాయో తెలియజేస్తూ "తన కోపమే తన శత్రువు" అనే కథను రాశారు. ఏ కక్షకైనా కార్పణ్యానికైనా కోపమే కారణమవుతుంది. అందుకే మనిషికి కోపమే శత్రువు. రాములమ్మ కుటుంబానికి అప్పారావు కుటుంబానికి తగాదా ఉంటుంది. ఈ క్రమంలో రాములమ్మ అప్పారావును సాధించి అతని కుటుంబం మీద పగ తీర్చుకోవడానికి తన కూతురు జీవితాన్ని పావుగా చేసుకొని అప్పారావు కుమారుడైన రమేష్ ను వలలో వేసుకోమని ప్రోత్సహించి, పెళ్లి విషయంలో గొడవలు సృష్టించి కోర్టుకు ఎక్కిస్తుంది. కానీ దాని ఫలితంగా వారి పిల్లల జీవితాలు పెళ్లిళ్లకు నోచుకోక ఎందుకూ పనికిరానివైపోతాయన్న విషయాన్ని రాములమ్మ అప్పారావు మర్చిపోయారు. కక్షల వల్ల హత్యలే కాదు జీవితాలు కూడా ఎలా బుగ్గి పాలవుతాయో తెలియజేసిన కథ ఇది.

స్త్రీ పురుషుల మధ్య అక్రమ సంబంధాలు, స్త్రీల పైన జరిగే అత్యాచారాలు ఎక్కువగా కనిపించేది కూడా మధ్యతరగతి కుటుంబాల్లోనే. ఈ విషయాల పైనా జయదేవ్ గారు కథలు రాసి ఈ సంపుటంలో చేర్చారు. ఐదు ఎకరాల్లో మిరప వేసి ఎండుమిరపకాయలను కళ్ళంలో కుప్ప పెడతాడు రైతు నారాయణ. నారాయణ పొలంలో భార్యతో కలిసి కూలి పనికి వెళ్తున్న నాగన్నకు నారాయణ తన భార్యతో అక్రమ సంబంధం కలిగి ఉన్నాడని అనుమానించి కళ్ళంలోని నారాయణ మిరపకాయల కుప్పను తగులబెట్టి అతన్ని ఆర్థికంగా దెబ్బతిస్తాడు. ప్రస్తుత రాజకీయాలకు అద్దం పట్టే ఈకథ పేరు"అనుమానం". అలాగే "అడకత్తరలో పోక చెక్క", "రాజీ" కథలు కూడా వివాహేతర సంబంధాల నేపథ్యంలో నడిచినవే. ఈ వివాహేతర సంబంధాలే కక్షలకు పోలీసు కేసులకు మూలకారణ మవుతాయన్న సత్యాన్ని ఈ కథల్లో చెప్పడం జరిగింది. అలాగే "పోరు" కథలో అత్యాచారం గురించిన విషయముంది. ఇద్దరు దంపతుల సంసారంలో గొడవల కారణంగా విడాకుల వరకు పోతే ప్రభుత్వ న్యాయవాది వాళ్లకు రాజీ కుదురుస్తాడు "ప్రభుత్వ న్యాయవాది కథ"లో

అలాగే స్వీయానుభవాలను కథలుగా మలచి ఈ పుస్తకంలో ప్రచురించారు జయదేవ్ గారు. చదువు, నాయన, పేరు మార్పు, కాకి కూటం, సొంత ఊరు మొదలైన కథలు ఈ కోవకు చెందినవే. జయదేవ్ గారు ఎన్ని కష్టాలు పడి చదువుకున్నారో, ఆంధ్ర విశ్వవిద్యాలయంలో పరిశోధన చేసేటప్పుడు తన పేరును జయదేవ్ గా ఎలా మార్చుకున్నారో ఈ కథల్లో చిత్రించడం జరిగింది. కాకి కూటం అంటే కాకుల సామూహిక సంయోగ దృశ్యం. దీన్ని చూసినవారి జీవితం నాశనమైపోతుందన్న

మూఢనమ్మకం ఇప్పటికీ పల్లెల్లో ఉంది. ఇదే "కాకి కూటం" కథలోని అంశం. ఇవన్నీ జయదేవ్ గారి స్వీయానుభవాలే.

ఈ కథల్లోని సన్నివేశాలు, కనిపించే మనుషులు, చిత్రించిన జీవితాలు అన్నీ మధ్యతరగతికి సంబంధించినవే. వీటిలోని పాత్రలు లాంటి వ్యక్తులు మనకు ఎప్పుడో ఒకప్పుడు ఎదురయ్యే వుంటారు. మధ్యతరగతి మనస్తత్వాలు, ఆవేశాలు, పట్టింపులు, పగలు వంటివి కూడా మనం ప్రతి నిత్యమూ వింటూనే ఉంటాం. చూస్తూనే ఉంటాం. కాబట్టి జయదేవ్ గారు రాసిన కథలు ఫక్తు మధ్యతరగతి కథలే.

# కొన్ని అనుభవాలు, అక్షరాల్లో

**ఎల్. ఆర్. స్వామి**
కేంద్ర సాహిత్య అకాడమీ అనువాద పురస్కార గ్రహీత
విశాఖపట్నం
సెల్ . 9949075859

ఒక వారం రోజుల క్రితం మిత్రులు ఆచార్య జయదేవ్ గారు ఫోన్ చేసి తాను కొన్ని రచనలు చేశానని (కథలు అని చెప్పినట్లు గుర్తు) అవి చదివి అభిప్రాయం రాయమని కోరారు. ఆచార్య జయదేవ్ గారు ఆంధ్ర విశ్వవిద్యాలయంలోని తెలుగు విభాగంలో ఆచార్యులుగానే కాక విభాగాధిపతిగా కూడా పనిచేసిన తెలుగు భాషాభిమాని, పండితులు కూడా. పదవీ విరమణ చేసిన తర్వాత ప్రస్తుతం హైదరాబాదులో నివాసముంటున్నారు. వారి రచనల పట్ల నాకు కుతూహలం కలగడం సహజం, ఆ రచనల పట్ల నా అభిప్రాయం కోరడం నాకు హర్షదాయకం. జయదేవ్ గారు పంపిన ఇరవై రచనలు చదివిన తర్వాత నేటి చిన్న కథల గురించి చాలా సంక్షిప్తంగా నాలుగు వాక్యాలు రాయాలని అనిపించింది.

ఆధునిక కథ అని నేడు మనం అనుకుంటున్న సాహిత్య ప్రక్రియ భారతీయ సాహిత్యంలో ఇంచుమించు 19వ శతాబ్దపు చివరి రెండు దశకాల్లో కానీ, 20 శతాబ్దపు తొలి దశాబ్దంలో కానీ మొలకెత్తిన సాహిత్య ప్రక్రియ. నేటికీ వివాదాలు ఉన్నప్పటికీ తెలుగులో తొలి ఆధునిక కథగా అంగీకరించబడిన దిద్దుబాటు అయినా, బండారు అచ్చమాంబ కథ అయినా ఒక ప్రత్యేక ఉద్దేశంతో సందేశంతో రాసిన కథలు. నిజ జీవితానికి అద్దం పట్టేటువంటి కథలు. సాహిత్యంలో వాస్తవికత, వాస్తవిక జీవితం, మన చుట్టూ ఉన్న సమాజం, మన అనుభవాలు, చూసిన సంఘటనలు వగైరాలు నాడు నేడు కూడా కథలకు ముడిసరుకులు

ఆధునిక కథ తాలూకు తొలిదశలో రచయిత చెప్పదలుచుకున్న విషయానికి అనుగుణంగా పాత్రలను సృష్టించి, ఆ పాత్రలను మన జీవితంలో కనబడే వ్యక్తుల వలె చిత్రీకరించి కథతో ప్రత్యక్షంగానో పరోక్షంగానో తన ఆశయం/సందేశం వ్యక్తం చేసేవాడు. కథకునికైనా కవికైనా ఒక దృఢమైన జీవిత దృక్పథం, సామాజిక దృక్పథం తప్పకుండా ఉండేది. ఆదృక్పథాన్ని ప్రజల్లోకి తీసుకొని వెళ్లడానికే రచనలు చేసేవారు. కానీ రాను రాను నిజజీవితంలో కనబడే వారే కథాపాత్రలుగా మారటం, కథ నిత్యజీవిత సంఘటనల చిత్రీకరణగా మారటం జరుగుతూ వచ్చింది. కథా పాత్రలను సృష్టించి దృక్పథం వ్యక్తపరచడం తగ్గింది. వాస్తవిక జీవితాన్ని చిత్రీకరించి సందర్భానుగుణంగా తన దృక్పథాన్ని వ్యక్తపరచడం మొదలైంది. జీవితమే ఒక పెద్ద కథ, ప్రతి మనిషి జీవితంలోనూ ఎన్నెన్నో కథలు, రచయిత స్వీయానుభవాలను, ఇతరుల జీవితానుభవాలను కథలుగా మలిచి రాయడం మొదలు పెట్టినప్పటి నుంచి కథ ఒక ఫోటోగ్రాఫ్ లాగా మారింది. నేటి కథల్లో ఈ ఫోటోగ్రాఫ్ ఎఫెక్ట్ ఎక్కువగా కనబడుతోంది పూర్వం కన్నా. ఇది ఒక శుభ పరిణామమే. ఎందుకంటే ఇతరుల అనుభవాల్లో నుంచి నేర్చుకొని తన జీవితాన్ని తీర్చిదిద్దుకోవడానికి చదువరికి సువర్ణావకాశం కల్పిస్తున్నాయి ఇలాంటి కథలు. ఆత్మాశ్రయ కవిత్వం లాగా ఆత్మాశ్రయ కథలు కూడా మొలకెత్తే ఋతువు దగ్గరలోనే ఉంది.

ఇక జయదేవ్ గారి కథల గురించి ఎలాంటి కథలు రాయాలనే దాని గురించి స్పష్టమైన అభిప్రాయముంది జయదేవ్ గారికి. నేను కన్న విన్న సంఘటనలనూ, నా అనుభవాలను ఆధారంగా చేసుకొని కథలను రాశాను అని చెబుతున్నారు రచయిత. ఈ సంపుటిలోని ఇరవై కథల గురించిన దిక్సూచి ఇది. ఆ అనుభవాలను అతి సరళమైన భాషలో మామూలు చదువరికి కూడా అర్థమయ్యే విధంగా రాశారు అనేది చెప్పుకోదగ్గ విషయం. సూటిగా విషయాన్ని ప్రస్తావించడం వల్ల కథలు సులభ గ్రాహ్యంగా ఉన్నాయి. జీవితంలో ఎదురైన సమస్యలను ప్రాయోగికంగా చాకచక్యంతో పరిష్కరించుకోవడం వల్ల జీవితం సాఫీగా సాగిపోతుందని చెప్పే కథ “ప్రభుత్వ న్యాయవాది”. చట్టాల, న్యాయస్థానాల ధోరణుల కన్నా మానవత్వపు ధోరణి సమస్యను చక్కదిద్దుతాయని చెబుతుంది ఈ కథ. ఎంత వెనుకున్నా పట్టుదల, నిరంతర కృషి మనిషిని ఉన్నత స్థాయికి చేరుస్తుందని చెబుతుంది “కృషి” అనే కథ. తెలుగు మాధ్యమంలో చదివి విశ్వవిద్యాలయంలో అడుగు పెట్టగానే ఎదురయ్యే ఆంగ్ల మాధ్యమ విద్యా బోధనతో ఇమడలేక చదువులో వెనక్కి వెళ్ళే ఎందరో విద్యార్థులకు కొత్త ఉత్తేజాన్ని ఇచ్చే కథ ఇది. “తన కోపమే తన శత్రువు”, “తన శాంతమే తనకు రక్ష” అనే రెండు కథలు ఆ రెండు సామెతలకు ఉదాహరణలు. ఈకథల సమాహారంలో

చెప్పుకోదగ్గర కథ "సంస్కర్త". విద్య వల్ల ఉచ్చనీచత్వాలు తగ్గుతాయని కథలో సూచించినది నిజమేనేమో! అంతేకాదు కులవివక్ష తాలూకు పట్టు వీడడానికి కూడా కులాతీత వివాహాలు తోడ్పడతాయనే సూచన కూడా ఇస్తుంది ఈ కథ.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత గత కొన్ని సంవత్సరాల్లో పల్లెల్లో వచ్చిన మార్పులను గురించి చెప్పే రెండు కథలున్నాయి ఈ ఇరవై కథల్లో. ఆ రెండు కథలు పల్లెల్లో జరిగిన రెండు భిన్న పరిణామాలను చిత్రీకరిస్తున్నాయి. కొన్ని పల్లెలు ఆర్థికపురోభివృద్ధి వైపు అడుగులు వేస్తే మరికొన్ని జనాలు వలస వెళ్లడం వల్ల నిర్జీవంగా మారుతున్నాయి. ఇవి మన ఆర్థిక సామాజిక పురోభివృద్ధి తాలూకు వాస్తవిక చిత్రాలు.

అన్ని కథల గురించి చెప్పటం నా ఉద్దేశం కాదు. పుస్తకాన్ని పరిచయం చేసేవాడు పుస్తకంలోని ఆసక్తికరమైన విషయాల్లో కొన్నింటిని సూచనప్రాయంగా ప్రస్తావించి చదువరికి ఆ పుస్తకం చదవాలనే ఆసక్తిని కలిగించాలి కానీ, మొత్తం కథలన్నింటిని గురించి చంటి పిల్లాడికి తినిపించినట్లు చెప్పకూడదు. అయినా ఒక మాట ఈ కథల్లో జయదేవ్ గారి జీవితానికి సంబంధించిన విషయాలు, అనుభవాలు కూడా కొన్ని ఉన్నాయి. కొన్ని కథలకు నేపథ్యం రాయలసీమ ప్రాంతం, రాయలసీమ ప్రాంతపు జీవితం గురించి కొన్ని విషయాలు తెలుసుకోవచ్చు ఈ కథల ద్వారా.

కథకు ముడిసరుకు మానవ జీవితమే,మానవ ప్రవర్తనలే. ఒకే సంఘటన మీద ఇద్దరు మనుషులు ఒకే లాగా స్పందించరు. ఒకే సంఘటనకు ఒకడు ఈరోజు స్పందించినట్లు స్పందించడు అదే సంఘటన రేపు జరిగితే. లోకం ప్రతి జన భిన్న విచిత్ర మార్గం. అందువల్ల ప్రతి ఒక్కరికి తనదైన అనుభవాలుంటాయి. జీవితం అంటేనే ఒక అనుభవాల చిట్టా, అనుభూతుల పుట్ట. అందువల్ల అనుభవాలను అక్షరాల ద్వారా పంచుకోవటం అవసరమైన పని, ఆమోదయోగ్యమైన పని. అది ఇతరుల అనుభవాల నుంచి నేర్చుకొని జీవితాన్ని మెరుగుపరుచుకోవాలని అనుకునే వాళ్లకు చోదకశక్తి అవుతుంది. జయదేవ్ గారు మరి కొన్ని అనుభవాలతో కథనంతో మన ముందుకు వస్తారని ఆశిస్తూ.

13-6-22

# కథా క్రమం

# ప్రభుత్వ న్యాయవాది

"ఏం జరిగిందో చెప్పమ్మా" అన్నాడు తన ఎదురుగా నిలుచున్న సరోజ అనే అమ్మాయితో ఆ కోర్టుకు కొత్తగా బదిలీ అయి వచ్చిన సహాయ ప్రభుత్వ న్యాయవాది (అసిస్టెంట్ పబ్లిక్ ప్రాసిక్యూటర్) గోపాలకృష్ణ.

సరోజ తన కేసు వివరాలను కృష్ణ గారితో చెప్పింది.

"సార్ మాది రామచంద్రాపురం గ్రామం. మా అమ్మానాన్నలు పేదవారు. మా నాన్నకు ఆరోగ్యం బాగుండదు, ఏదో ఉన్నంతలో కట్నమిచ్చి నన్ను మా ఊరి దగ్గరున్న దొర్నిపాడు గ్రామంలోని రవి అనే అబ్బాయికిచ్చి పెళ్లి చేశారు. నా సంసారం బాగానే సాగుతున్నప్పుడు మా అమ్మకు పక్షవాతం వచ్చింది. మా నాన్న అనారోగ్యం వల్ల మా అమ్మను చూసుకోలేకపోతున్నాడు. నేను మా అమ్మను చూడడానికి ఆమెకు సేవ చేయడానికి మా అమ్మ వాళ్ళ ఇంటికి వెళ్తుండే దాన్ని. అది మా అత్త మామలకు ఇష్టం లేదు. పెళ్లి చేసుకొని అత్త వారింటికి వచ్చిన తర్వాత పుట్టింటితో నీకేం పని? నువ్వు ఎట్టి పరిస్థితుల్లోనూ పుట్టింటికి వెళ్లవద్దని నన్ను గట్టిగా శాసించారు. నేను వెళ్లకపోతే మా అమ్మానాన్నలకు అన్నం నీళ్లు కూడా ఉండవు. వారినా పరిస్థితుల్లో వదిలేసి నా అంతట నేను వుండలేక పోయాను. అందుకనే మా అత్త మామలు ఎంత గట్టిగా చెప్పినా నేను వినకుండా మా పుట్టింటికి వెళ్లేదాన్ని. దాంతో మా అత్తమామలకు కోపం వచ్చి నువ్వు మా ఇంటికి రావద్దు, పుట్టింట్లోనే ఉండమని చెప్పి అక్కడనే ఉంచారు. నేను మా నాన్న ఎంత బతిమాలినా ఇంట్లోకి రానివ్వలేదు.

నా భర్త తల్లిదండ్రుల మాట జవదాటడు. అతను కూడా వారితో కలిసి నన్ను అక్కర్లేదన్నాడు. చేసేది లేక పెద్దమనుషుల దగ్గర పంచాయతీ పెట్టి నాకు మా అత్త

మామలు రెండులక్షలు ఇచ్చేటట్టుగా ఒడంబడిక చేసుకొని కాయితాలు రాసుకొని విడిపోయాం. అయితే వాళ్లు లక్షన్నర మాత్రమే ఇచ్చారు. మిగతా యాభై వేలు ఇవ్వడం లేదు. దానితో నేను అత్తమామల మీద మా ఆయన మీద వేదింపుల కేసు పెట్టాను. సంవత్సరం నుంచి కోర్టు చుట్టూ తిరుగుతున్నాను. వాళ్లు లాయర్ ను పెట్టుకొని వాయిదాలు వేయిస్తూ వస్తున్నారు. నేను కేసు వేసి వాళ్లను కోర్టుకు లాగినానని నా మీద కోపంతో యాభై వేలు ఇవ్వకుండా కోర్టు చుట్టూ తిప్పుతున్నారు. ఇది సార్ జరిగింది". అని సరోజ గోపాలకృష్ణ గారికి చెప్పింది.

"ఇప్పుడు మీ అమ్మ ఆరోగ్యం ఎలా ఉంది" అడిగాడు క్రిష్ణ

"ఇప్పుడు బాగానే ఉంది సార్ ఆమె పనులు ఆమె చేసుకుంటూ ఉంది"

"తిరిగి కాపురానికి వెళ్ళడం నీకు ఇష్టమేనా"

"ఇష్టమే, కానీ సార్ ఇంత జరిగిన తర్వాత వాళ్ళు నన్ను కాపురానికి తీసుకెళ్తారా"

"చూద్దాం, నువ్వు అత్తవారింట్లో ఉన్నప్పుడు నీ భర్త నీతో ఎలా ఉండేవాడు"

"మేము బాగానే ఉండేవాళ్ళం సార్, అప్పుడు కూడా ఆయన వాళ్ళ అమ్మా నాన్న మాటే వినేవాడు."

"నిన్ను మళ్ళీ కాపురానికి పంపించే ప్రయత్నం చేద్దాం. దానికి నువ్వు ఒక పని చేయాలి. మీ ఆయన కోర్టుకు వచ్చినప్పుడు మీ అత్తమామలకు తెలియకుండా అతనితో మాట్లాడే ప్రయత్నం చెయ్. మెల్లగా అతని ఫోన్ నెంబర్ తీసుకొని ఫోన్ చేస్తూ ఉండు, మొదట అతను నీతో మాట్లాడడు. అయినా సరే ఫోన్ చేస్తూనే ఉండు. చేస్తూ ఉంటే కొద్దికాలానికి మీ ఆయన మనసు మెత్తబడి నీతో మాట్లాడతాడు. మాట్లాడిన తర్వాత ఎక్కడైనా ఏకాంతంగా మీఆయనతో కలుసుకునే ప్రయత్నం చేయి. ఇద్దరూ కలుసుకున్నప్పుడు కొన్ని ఫోటోలు తీసుకో, ఆ తర్వాత ఏం చేయాలో చూద్దాం" అని సరోజతో చెప్పాడు కృష్ణ

గోపాలకృష్ణ ఫస్ట్ క్లాస్ మేజిస్ట్రేట్ కోర్టులో సహాయ ప్రభుత్వ న్యాయవాదిగా వున్నాడు. అతనికి గొప్ప నిజాయితీపరుడుగా మంచి పేరుంది. కుటుంబ తగాదాలు, భార్య భర్తల తగాదాలు వచ్చినప్పుడు ఇరువైపుల వారికి నచ్చజెప్పి రాజీ చేసే ప్రయత్నం చేస్తూ వుంటాడు. ముఖ్యంగా భార్య భర్తల మధ్య తగాదాలు వచ్చినప్పుడు మొదట భార్యతో మాట్లాడి వారిద్దరి మధ్య తగాదా ఎందుకు వచ్చిందో తెలుసుకునేవాడు. తర్వాత భర్తతో వేరుగా మాట్లాడి తగాదాకు కారణం తెలుసుకుని ఇద్దరికీ వేరు వేరుగా కౌన్సెలింగ్ చేసేవాడు. తర్వాత వారిద్దరినీ తన గదికి పిలిపించి వారిద్దరూ మనసు విప్పి మాట్లాడుకునే లాగా చేసి విడిపోవడానికి సిద్ధమైన భార్యా భర్తలు కలుసుకుని

తిరిగి కాపురం చేయడానికి అన్ని రకాల ప్రయత్నాలు చేసేవాడు. ఇలా చేయడం వల్ల ప్రైవేట్ ప్రాక్టీస్ చేసే లాయర్లు ఇతని మీద గుర్రుగా ఉండేవారు. ఎందుకంటే వారి ఆదాయం పోతుంది కాబట్టి. కృష్ణ ఇవేమీ పట్టించుకోకుండా భార్యాభర్తలను కలపడానికి శాయశక్తుల ప్రయత్నం చేస్తుంటాడు. కృష్ణ నిజాయితీ తెలిసిన న్యాయమూర్తులు ఇలాంటి కేసుల విషయంలో అతనికి పూర్తి స్వేచ్ఛనిచ్చి అతనికి బాగా సహకరిస్తూవుంటారు.

సరోజ కృష్ణ చెప్పినట్లుగా అత్తమామలకు తెలియకుండా తన భర్తను కలుసుకుంది. అతని ఫోన్ నెంబర్ తీసుకొని అతనికి ఫోన్ చేస్తూ ఉండేది. ఆమె భర్త మొదట తల్లిదండ్రులకు భయపడి ఫోన్ ఎత్తేవాడు కాదు. సరోజ మళ్లీ మళ్లీ ఫోన్ చేస్తూ వుండడంతో అతని మనస్సు మెత్తబడి మాట్లాడడం ప్రారంభించాడు. సరోజ అతనితో మాట్లాడుతూ ఎక్కడైనా ఏకాంతంగా కలుసుకుందామని చెప్పింది. దానికి అతను అంగీకరించాడు. ఆమె భర్త తల్లిదండ్రులకు తెలియకుండా రహస్యంగా ఆమెను కలుసుకున్నాడు. ఆమె తన పరిస్థితి తన తల్లిదండ్రుల పరిస్థితి తాను ఎట్టి పరిస్థితుల్లో అలా చేయవలసి వచ్చిందో అన్నీ వివరంగా చెప్పి కన్నీళ్లు పెట్టుకొని అతని మనసు మార్చే ప్రయత్నం చేసింది. తర్వాత అతనితో కలిసి సెల్ఫీ తీసుకుంది. మళ్లీమళ్లీ కలుసుకుందామని ఆమె భర్తతో చెప్పింది. దానికి ఆమె భర్త కూడా అంగీకరించాడు. మూడు నాలుగు సార్లు వాళ్ళు ఏకాంతంగా కలుసుకుని మనసు విప్పి మాట్లాడుకున్నారు. అతని మీద తనకు చాలా ప్రేమ ఉందని, అతన్ని వదిలి ఉండలేకపోతున్నానని, ఆమె తన మనసులోని మాట పదే పదే చెప్పింది. ఆమె భర్త రవికి కూడా ఆమె మీద ప్రేమ ఉంది. అయితే తల్లిదండ్రులను కాదని అతను ఏమీ చేయలేడు. అది అతని బలహీనత. ఆమె వారిద్దరు కలుసుకున్నప్పుడు సెల్ఫీ ఫోటోలు తీసుకునేది. ఆ తర్వాత కోర్టు వాయిదాకు వచ్చినప్పుడు సరోజ తను చేసిన ప్రయత్నమంతా గోపాలకృష్ణ గారికి చెప్పి తాను తీసిన ఫోటోలను అతనకి ఇచ్చింది. గోపాలకృష్ణ సరోజ కేసు వివరాలన్నీ న్యాయమూర్తి రమ్యవాణిగారికి చెప్పి ఆమెను తిరిగి కాపురానికి పంపించడంలో సాయం చేయవలసిందిగా కోరాడు. వాణి గారు కూడా సంతోషంగా అంగీకరించారు.

కోర్టు ఖాళీ సమయంలో న్యాయమూర్తి వాణి గారు, కృష్ణ గారు న్యాయమూర్తి గారి గదిలో కూర్చొని రవిని పిలిపించి అతనికి కౌన్సెలింగ్ చేశారు. “చూడబ్బాయ్, నువ్వు నీ భార్య పెద్దమనుషుల దగ్గర తీసుకున్న విడాకులు చెల్లవు. నీ భార్య నుంచి నువ్వు విడిపోవాలంటే తప్పనిసరిగా కోర్టు ద్వారా విడాకులు తీసుకోవాలి. దానికి నువ్వు లాయర్ ను పెట్టుకోవాలి. లాయర్‌కు నువ్వు కనీసం యాభై వేల రూపాయలు

మొదట ఇచ్చుకోవాలి. నువ్వు అన్ని వేల రూపాయలు లాయర్ కిచ్చి లాయర్ చుట్టూ కోర్టు చుట్టూ తిరిగినా నీ భార్య అంగీకరిస్తేనే నీకు విడాకులు త్వరగా వస్తాయి. ఆమె అంగీకరించకపోతే విడాకులు రావడానికి కనీసం పది సంవత్సరాలు పడుతుంది. ఇన్ని సంవత్సరాలు నువ్వు లాయర్ చుట్టూ కోర్టు చుట్టూ తిరుగుతూ లాయర్ కు అతను అడిగినంత ఫీజు మళ్లీ మళ్లీ ఇస్తూ ఉండాలి. ఇటువంటి కేసులు కోర్టులో చాలా పెండింగ్ లో ఉన్నాయి. అంతవరకు నువ్వు మళ్ళీ పెళ్ళి చేసుకోవడానికి వీల్లేదు, కాబట్టి నా సలహా ఏమిటంటే నువ్వు నీ భార్యతో మళ్లీ కలిసి జీవించడమే అన్ని రకాలుగా మంచిది. అదీకాకుండా ఆమె ఇప్పుడు మీ అమ్మానాన్నల మీద నీ మీద పెట్టిన వేధింపుల కేసు చాలా బలంగా ఉంది. దానికి మీ అందరికీ రెండు సంవత్సరాలు జైలు శిక్ష పడుతుంది. మీరు జైలు శిక్ష నుంచి తప్పించుకోవాలంటే ఆమె తన కేసు వెనక్కి తీసుకోవాలి. ఆమె వెనక్కి తీసుకోవాలంటే మీరు ఆమెను మీ ఇంటికి మళ్లీ కోడలుగా తీసుకొని వెళ్ళాలి. మీకు వేరే మార్గం లేదు. కోర్టు చుట్టూ లాయర్లు చుట్టూ తిరక్కుండా మీ ఇంట్లో మీరు ప్రశాంతంగా హాయిగా జీవించాలంటే నీ భార్యను మళ్లీ మీ ఇంటికి తీసుకుని వెళ్లి మంచిగా  చూసుకోవాలి. మీ లాయర్ కేసు మన పక్షాన ఉంది, మనమే గెలుస్తాం, భయపడొద్దు అని చెబుతూ వుంటాడు. అది నిజం కాదు, మీ కేసు త్వరగా పూర్తి అయితే అతనికి డబ్బులు ఎవరిస్తారు? నీలాంటి అమాయకుల కేసులు కోర్టులో పెండింగ్‌లో ఉంటేనే ఎప్పటికప్పుడు డబ్బులు గుంజడానికి లాయర్లకు అవకాశముంటుంది. మీరు మీ లాయర్ మాటలు నమ్మవద్దు. నేను చెప్పిన ఈ మాటలు మీ అమ్మానాన్నలకు చెప్పి జాగ్రత్తగా ఆలోచించి నిర్ణయం తీసుకుంటే అన్ని రకాలుగా మీకు చాలా మంచిది."అని న్యాయమూర్తి వాణి గారు రవికి చెప్పారు.

రవి ఆమె మాటలను జాగ్రత్తగా విన్నాడు. ఆ తర్వాత సరోజను కాపురానికి తీసుకుని పోవడం తనకు ఇష్టమేనని, తన భార్యమీద తనకు ప్రేమ ఉందని అయితే తన అమ్మానాన్నలు తన ఇష్టానికి భిన్నంగా ఉన్నారని అందువల్ల తాను ఏమీ చేయలేక పోతున్నానని రవి చెప్పాడు.

"వచ్చే వాయిదాకు మీ అమ్మానాన్నలను కోర్టుకు తీసుకొనిరా, వారితో నేను మాట్లాడతాను"అని న్యాయమూర్తి గారు చెప్పారు.

రవి దానికి అంగీకరించి వెళ్ళిపోయాడు.

తర్వాత వాయిదాకు రవి తన అమ్మానాన్నలను కోర్టుకు తీసుకుని వచ్చాడు.

వాణి గారు, కృష్ణ గారు న్యాయమూర్తి  గదిలో కూర్చొని రవి అమ్మానాన్నలను పిలిపించి కూర్చోబెట్టి గతంలో రవికి చెప్పిన మాటలను మళ్ళీ ఆ పెద్దవాళ్ళకు కూడా

చెప్పారు. తర్వాత న్యాయమూర్తి సరోజ తాను తన భర్త కలిసి ఉన్నప్పుడు తీసుకున్న సెల్ఫీఫోటోలను రవి తల్లిదండ్రులకు చూపించి "మీ అబ్బాయికి మీ కోడలు మీద ప్రేమ ఉంది, వాళ్ళిద్దరూ మీకు తెలియకుండా కలుసుకుంటున్నారు. మీ కొడుకు రవికి మీరంటే చాలా గౌరవం ఉంది. మీ ఇష్టానికి భిన్నంగా వ్యవహరించడానికి అతను ఇష్టపడటం లేదు. అంత మంచి కొడుకు ఇష్టానికి భిన్నంగా మీరు వ్యవహరిస్తే ఎలా? మీ కొడుకు తన భార్యతో సుఖంగా కాపురం చేసుకునే లాగా చేయడం తల్లిదండ్రులుగా మీ బాధ్యత. కాబట్టి మీ కొడుకు ఇష్టాన్ని గమనించి మీ కోడలును కాపురానికి తీసుకువెళ్ళడమే అన్ని విధాల మీకు మంచిది. లేకపోతే ఆమె వేసిన వేధింపుల కేసు వల్ల మీకందరికీ రెండు సంవత్సరాలు జైలు శిక్ష పడుతుంది. సరోజ నుంచి విడాకులు వచ్చే వరకు మీ అబ్బాయికి మళ్లీ మీరు పెళ్లి చేయకూడదు. కోర్టు ద్వారా విడాకులు రావడానికి చాలా సంవత్సరాలు పడుతుంది. అన్ని సంవత్సరాలు మీరు లాయర్ చుట్టూ కోర్టుల చుట్టూ తిరుగుతూ డబ్బులు ఖర్చు పెట్టుకుంటూ మనశ్శాంతి లేకుండా బ్రతకవలసి వుంటుంది. ఇదంత అవసరమా? చెప్పండి, మీ కోడలు చాలా మంచిది, తల్లిదండ్రులు కష్టాల్లో ఉన్నప్పుడు ఆమె వారికి బాసటగా వెళ్ళింది. మనసున్న మనుషులు ఎవరైనా అదే పని చేస్తారు. అందువల్ల మీ కోడలు చేసిన పనిని మీరు తప్పుగా భావించవద్దు. తల్లిదండ్రులను బాగా చూసే అమ్మాయి అత్తమామలను కూడా బాగా చూస్తుంది. మీ కొడుకు భవిష్యత్తు మీ భవిష్యత్తు బాగుండాలంటే ప్రశాంతంగా మీరందరూ జీవించాలంటే మీ కోడలు సరోజను మీరు మళ్ళీ కాపురానికి తీసుకెళ్లి ఆమెను మంచిగా చూసుకోవాలి." అని న్యాయ మూర్తి గారు చెప్పడంతో రవి తల్లిదండ్రులు కాసేపు ఆలోచించి సరోజను కాపురానికి తీసుకెళ్లడానికి అంగీకరించారు.

న్యాయమూర్తి వెంటనే సరోజను పిలిపించారు. సరోజ రాగానే అత్తమామల పాదాలకు నమస్కరించి కన్నీళ్లు పెట్టుకుంది. అత్తమామలు ఆమెను అక్కున చేర్చుకుని, న్యాయమూర్తి గారికి కృష్ణ గారికి ధన్యవాదాలు చెప్పి కోడలును కొడుకును తీసుకుని ఇంటికి వెళ్ళిపోయారు.

* * *

# కృషి

"వాటీజ్ యువర్ నేమ్"

"గోవర్ధన్"

"ఇంట్రడ్యూస్ యువర్‌సెల్ప్ టు ది క్లాస్"

......................మౌనం

"ఐ సెడ్ ఇంట్రడ్యూస్ యువర్‌సెల్ఫ్ టు ది క్లాస్"

"నాకు రాదు మేడం"

క్లాసులోని విద్యార్థులందరూ గొల్లున నవ్వారు

"సిట్ డౌన్"

గోవర్ధన్ చాలా అవమానంగా భావించి తల దించుకుని కూర్చున్నాడు.

బీ.టెక్ ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ బ్రాంచ్‌లో చేరిన తర్వాత గోవర్ధన్ మొదటి సారి క్లాసుకు వెళ్ళినప్పుడు జరిగిన సంభాషణ అది.

అంతకు మూడు రోజుల ముందు నుంచి తరగతులు ప్రారంభమయ్యాయి. అది కెమిస్ట్రీ క్లాసు. గోవర్ధన్ కొంచెం ఆలస్యంగా వచ్చి అందరి కంటే వెనక బెంచీలో కూర్చున్నాడు. ఒక మేడం పాఠం చెబుతున్నారు. ఆ మేడం గోవర్ధన్‌ను క్లాసుకు తనని తాను పరిచయం చేసుకోమని ఇంగ్లీషులో చెప్పారు. గోవర్ధన్‌కు ఆమె మాట్లాడేది అర్థం లేదు. ఎందుకంటే గోవర్ధన్ ఒకటవ తరగతి నుంచి ఇంటర్మీడియట్ వరకు తెలుగు మీడియంలో చదువుకున్నాడు. అంతే కాకుండా అతను పూర్తి పల్లెటూరు వాతావరణం నుంచి వచ్చాడు.

గోవర్ధన్ చాలా తెలివైన విద్యార్థి. అతను పదవ తరగతిలో 80 శాతం మార్కులు తెచ్చుకున్నాడు. ఇంటర్మీడియట్‌లో 90 శాతం పైగా మార్కులు తెచ్చుకున్నాడు. ఎంసెట్లో 20 వేల లోపు ర్యాంకు సాధించాడు. అంత తెలివైన విద్యార్థి అయినప్పటికీ మొదటిసారి ఇంగ్లీష్ మీడియం క్లాస్ కు రావడం వల్ల ఆ మేడం అడిగిన చిన్న ప్రశ్నలు గూడా అతనికి  అర్థం కాలేదు.

మేడం తాను చెబుతున్న చాప్టర్‌కు సంబంధించి కొన్ని ముఖ్యమైన పాయింట్లు చెప్పి, ఆ తర్వాత విద్యార్థులను వాటిమీద సొంతంగా నోట్స్ రాయమని చెప్పారు. ఎక్కువ మంది విద్యార్థులు నోట్స్ రాస్తున్నారు. మేడం చెప్పిన విషయాలు ఏమీ అర్థం కాకపోవటం వల్ల గోవర్ధన్ ఏమీ రాయలేక పోయాడు. మేడం క్లాసు రూమ్‌లో అటు ఇటు తిరుగుతూ ఎవరు ఏమిరాస్తున్నది చూస్తున్నారు. వెనుక కూర్చున్న తన వద్దకు మేడం వచ్చి చూస్తారేమో అని గోవర్ధన్ భయపడుతున్నాడు. కొంత మంది విద్యార్థులు నోట్స్ రాస్తూ సందేహాలు అడిగినప్పుడు ఆ సందేహాలకు ఆమె వివరణ ఇస్తూ అనర్గళంగా ఇంగ్లీషులో మాట్లాడుతున్నారు. ఇంగ్లీష్ మీడియంలో చదివిన విద్యార్థులు మేడం చెప్పినట్లుగా రాస్తున్నారు. తర్వాత మేడం కొంత మంది విద్యార్థులను ప్రశ్నలు అడిగారు. వాళ్ళు ఇంగ్లీషులో సమాధానం చెప్పారు. మేడం తనను ఎక్కడ ప్రశ్న అడుగుతుందో అని గోవర్ధన్ భయపడ్డాడు. మేడం ప్రశ్నిస్తే ఏం చెప్పాలో కూడా అతనికి తెలియడం లేదు. అతను చాలా సందిగ్ధావస్థలో ఉన్నాడు. అదృష్టవశాత్తు మేడం అతని వద్దకు రాలేదు, అతన్ని ప్రశ్నించలేదు. తర్వాత పిరియడ్ ఫిజిక్స్ లెక్చరర్ వచ్చారు. అతను కూడా ఇంగ్లీష్‌లో పాఠం బాగా చెప్పారు. అతను చెప్పేది కూడా గోవర్ధన్‌కు ఏమీ అర్థం కాలేదు. ఆ రోజంతా కాలేజీలో అలాగే గడిచింది.

గోవర్ధన్ బస్సు సౌకర్యం లేని ఒక మారుమూల పల్లెటూరు నుంచి వచ్చాడు. అతని తల్లిదండ్రులు చదువు లేనివారు, మంచి కష్ట జీవులు. తమ కుమారుడు తమ లాగా కాకుండా బాగా చదువుకొని మంచి ఉద్యోగంలో స్థిరపడాలని వారు ఆశించారు. తమ ఊరికి దగ్గరగా ఉన్న మామూలు బడుల్లో జూనియర్ కాలేజీలో తెలుగు మీడియంలో తమ కుమారుని చదివించారు. వారికి తమ కుమారుని ఇంగ్లీష్ మీడియంలో చదివించాలనే ఆలోచనే రాలేదు.

గోవర్ధన్ తన తల్లిదండ్రుల ఆశలకు ఆకాంక్షలకు అనుగుణంగానే పెరిగాడు, చదువుకున్నాడు. అతను కేవలం తెలివైనవాడు మాత్రమే కాదు. మంచి బుద్ధిమంతుడు, అంతేకాదు మంచి పట్టుదల కలవాడు కూడా, ఏదైనా ఒక విషయం అనుకుంటే అది సాధించేవరకు అతను గట్టి పట్టుదలతో ప్రయత్నిస్తూనే ఉంటాడు. తాను చదువుకున్న స్కూల్‌లో గాని, జూనియర్ కళాశాలలో గాని పాఠాలు పెద్దగా చెప్పేవారు

కాదు. కేవలం గోవర్ధన్ తాను సొంతంగా కష్టపడి మంచి మార్కులు సంపాదించుకున్నాడు. అతనికి ఒక్క దురలవాటు కూడా లేదు. చిన్నప్పటినుంచి తల్లిదండ్రుల కష్టం చూస్తూ పెరిగినవాడు. బడి లేనప్పుడు తనకు ఖాళీ ఉన్నప్పుడు తల్లిదండ్రులతో పాటు తాను కూడా కష్టపడి వ్యవసాయం పనులు చేసేవాడు. తల్లిదండ్రులు తన పట్ల పెంచుకున్న ఆశలకు ఏమాత్రం దూరం కాకుండా అహర్నిశలు కష్టపడి బాగా చదువుకొని అన్ని పరీక్షలు మంచి మార్కులతో ఉత్తీర్ణుడయ్యాడు.

ఇంటర్మీడియట్ పాస్ అయిన తర్వాత భవిష్యత్తులో తాను ఏమి చదవాలి, ఏమి కావాలి అనే విషయంలో గోవర్ధన్‌కు ఒక స్పష్టత వచ్చింది. తాను మంచి సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ కావాలన్నది అతను లక్ష్యంగా పెట్టుకున్నాడు. అందుకనే అతను ఇంటర్మీడియట్ తర్వాత కడపలో మంచి పేరున్న ఇంజనీరింగ్ కళాశాలలో బి.టెక్ ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ బ్రాంచ్‌లో చేరాడు. కానీ కాలేజీలో తన మొదటి రోజు అనుభవం చూసిన తర్వాత అతనికి తన మీద తన శక్తి సామర్థ్యాల మీద అనుమానం కలిగింది. బీ.టెక్ మంచి మార్కులతో పాసై సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ కావాలన్న తన లక్ష్యాన్ని సాధించగలనా? లేదా? అనే సందిగ్ధంలో పడిపోయాడు. తాను ఇంటర్మీడియట్ వరకు తెలుగు మీడియంలో చదువుకున్నందుకు ఇంగ్లీష్ మీడియంలో చదువలేక పోయినందుకు చాలా బాధపడ్డాడు. బీ.టెక్ మానుకొని ఏదైనా డిగ్రీలో చేరితే బాగుంటుందా అని కూడా ఆలోచించాడు. అయితే తొందరపడి ఒక నిర్ణయానికి రాకూడదని  కనీసం ఒక నెల రోజుల పాటు బీ.టెక్‌లో చూసి ఆ తర్వాత ఆలోచించుకోవచ్చు అని అతను తాత్కాలికంగా అనుకున్నాడు.

అయితే రోజులు గడిచేకొద్దీ ఏది ఏమైనా ఎంత కష్టపడి అయినా తాను బీ.టెక్‌లోనే కొనసాగి సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ కావాలన్న తన లక్ష్యాన్ని ఎలాగైనా సాధించాలని కూడా అతను గట్టిగా నిర్ణయించుకున్నాడు. ఆ నిర్ణయంతోనే అతను ప్రతిరోజు ప్రతి క్లాసు మానకుండ తరగతులకు హాజరవుతూ చాలా జాగ్రత్తగా లెక్చరర్లు చెప్పే పాఠాలు వింటున్నాడు. ఎంత జాగ్రత్తగా వింటున్నప్పటికీ అతనికి ఆపాఠాలు బోధపడటం లేదు. ఇలా నెల రోజులు గడిచింది.

నెలరోజుల్లోనూ అతనికి పాఠాలు అర్థమయ్యే విషయంలో పెద్దగా మార్పు లేదు. నెల రోజుల తర్వాత ఫస్ట్ ఇంటర్నల్ పరీక్షలు జరిగాయి. గోవర్ధన్‌కు ఆ పరీక్షల్లో ఏమిరాయాలో ఎలా రాయాలో కూడా అర్థం కాలేదు. తనకు తెలిసినంతలో ఏదో రాశాడు. ఆ పరీక్షలు 20 మార్కులకు జరుగుతాయి. గోవర్ధన్‌కు అన్ని పేపర్లలోనూ చాలా తక్కువ మార్కులు వచ్చాయి. మ్యాథ్స్ పేపర్‌లో మాత్రమే కొంచెం మంచి మార్కులు వచ్చాయి. మిగతా అన్ని పేపర్లలోనూ 20 మార్కులకు 4,5 మార్కులు

మాత్రమే వచ్చాయి. తనకు వచ్చిన మార్కులను చూసుకొని గోవర్ధన్ చాలా బాధపడ్డాడు. ఆ తర్వాత ఒకటిన్నర నెలకు రెండవ ఇంటర్నల్ పరీక్షలు పెట్టారు. అవి కూడా 20 మార్కులకే. వాటిలో కూడా గోవర్ధన్ పెద్దగా పురోగతి సాధించలేదు.

ఆ తర్వాత గోవర్ధన్ ప్రతి సబ్జెక్టుకు సంబంధించిన రెఫరెన్స్ పుస్తకాలు తీసుకొని వాటితో కుస్తీ పట్టాడు. ఒక్కొక్క సబ్జెక్టుకు సంబంధించిన రెఫరెన్స్ పుస్తకాలు తీసుకున్నాడు. వాటిలో ఒక్కొక్క చాప్టర్ ను మొదట రెండు మూడు సార్లు చదివేవాడు. అలా చదవగా కొంతవరకు అందులోని విషయం అర్థమయ్యేది. కొన్ని పదాలకు అర్థం తెలిసేది కాదు. తెలియని పదాలకు నిఘంటువులో వెతికి అర్థాలు రాసుకుని ఆ అర్థాలను మూడు నాలుగు సార్లు చదువుకొని గుర్తు పెట్టుకునేవాడు. ఆ తర్వాత మళ్లీ రెండు మూడు సార్లు ఆచాప్టర్ ను చదివేవాడు. అప్పటికి ఆచాప్టర్ మీద అతనికి మంచి అవగాహన ఏర్పడేది. ఆ తర్వాత ఆచాప్టర్‌లోని విషయాన్ని ఇంగ్లీషులో తన సొంత మాటలతో నోట్ పుస్తకంలో రాసుకుని దాన్ని పదేపదే చదివేవాడు. దానితో ఆ చాప్టర్ అంతా అతనికి పూర్తిగా వచ్చేది. ఇలా ప్రతి సబ్జెక్టుకు సంబంధించిన ప్రతి చాప్టర్‌ను ఎంతో ఓపికతో కష్టపడి ఒకరకంగా చెప్పాలంటే అతి దారుణంగా కష్టపడి ప్రతి సబ్జెక్టులోని ప్రతి చాప్టర్ మీద మంచి అధికారం సంపాదించాడు. ఇలా ప్రతి సబ్జెక్టు మీద అధికారం సంపాదించడానికి గోవర్ధన్‌కు ఇంచుమించుగా ఒకటిన్నర సంవత్సరం పట్టింది. అంటే బీ.టెక్ రెండవ సంవత్సరం మొదటి సెమిస్టర్ చివరినాటికి అతను ఆ స్థితికి చేరుకోగలిగాడు.

మొదటి సెమిస్టర్ రెండవ ఇంటర్నల్ పరీక్షల తర్వాత గోవర్ధన్ ఇలా కష్టపడి ఆ సెమిస్టర్ ఎక్స్‌టర్నల్ పరీక్ష నాటికి కొంత పురోగతి సాధించాడు. మొదటి సెమిస్టర్ పరీక్షలో అతను 59 శాతం మార్కులు సంపాదించాడు. రెండవ సెమిస్టరు మొదటి ఇంటర్నల్ పరీక్షలో 20 కి అన్ని సబ్జెక్టుల్లో పదికి పైగా మార్కులు సంపాదించాడు. సెకండ్ ఇంటర్నల్ పరీక్షల్లో అన్ని సబ్జెక్టుల్లో 20 కి 15 మార్కులు సంపాదించాడు. రెండవ సెమిస్టర్ పరీక్షలో అతను 65 శాతం మార్కులు సంపాదించాడు. బీటెక్ రెండవ సంవత్సరం మొదటి ఇంటర్నల్ పరీక్షలో అతను ప్రతి సబ్జెక్టులోనూ 17, 18 మార్కులు సంపాదించాడు. అలాగే రెండవ ఇంటర్నల్‌లో కూడా అంతే మార్కులు సంపాదించాడు. ఆ సెమిస్టర్ పరీక్షలో అతను 70 శాతం మార్కులు సాధించాడు. ఆ తర్వాత గోవర్ధన్ తిరిగి చూసుకోలేదు. రెండవ సంవత్సరం రెండవ సెమిస్టర్‌లో 75% మార్కులు సంపాదించాడు. మూడవ సంవత్సరం మొదటి సెమిస్టర్ రెండవ సెమిస్టర్ పరీక్షలు ఇంటర్నల్స్‌తో కలిపి 80 శాతం మార్కులు సంపాదించాడు. అలాగే నాలుగవ సంవత్సరం మొదటి సెమిస్టర్ రెండవ సెమిస్టర్ ఇంటర్నల్‌తో కలిపి అతను

80 శాతం పైగా మార్కులు సంపాదించాడు. గోవర్ధన్ ఇంజనీరింగ్ నాలుగు సంవత్సరాలు విద్యార్థి జీవితంలోని అన్ని సరదాలు మానుకొని ఇలా కష్టపడి బీ.టెక్ 77 శాతం మార్కులతో ఉత్తీర్ణుడయ్యాడు.

గోవర్ధన్ చదివిన కళాశాలకు ఆ సంవత్సరం ఏ సాఫ్ట్‌వేర్ కంపెనీ కూడా క్యాంపస్ సెలక్షన్స్‌కు రాలేదు. గోవర్ధన్ బీ.టెక్ ఉత్తీర్ణుడైన తర్వాత రెండు సంవత్సరాల పాటు బెంగళూరులో ఉండి ఉద్యోగం కోసం గట్టి ప్రయత్నం చేశాడు. అతను మొదట చిన్న స్టార్టప్ కంపెనీలో చేరి జావాలో ప్రావీణ్యత సంపాదించాడు. ఆతర్వాత జావాతో చిన్న కంపెనీలో ఓ మోస్తరు జీతంతో ప్రవేశించాడు. ఆ అనుభవంతో రెండు సంవత్సరాల తర్వాత పెద్ద కంపెనీలో చెప్పుకోదగిన ప్యాకేజీతో పూర్తి సాఫ్ట్ వేర్ ఇంజనీర్ గా ఉద్యోగం చేస్తున్నాడు. ప్రస్తుతం అతని కంపెనీ నిర్వహించే టెక్నికల్ ఇంటర్వ్యూలకు అతను ఎక్స్‌పర్ట్ మెంబర్‌గా కూడా వెళ్తున్నాడు. ఈ విధంగా గోవర్ధన్ ఒకటవ తరగతి నుంచి ఇంటర్మీడియట్ వరకు తెలుగు మీడియంలో చదువుకున్నప్పటికీ దృఢమైన సంకల్పంతో చాలా కృషి చేసి సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ కావాలన్న తన జీవిత లక్ష్యాన్ని సాధించాడు. అతను ఇప్పటికీ తాను తెలుగు మీడియంలో కాకుండా ఇంగ్లీష్ మీడియంలో చదువుకొని వుంటే మొదటి రోజు క్లాసులో మేడం అడిగిన చిన్న ప్రశ్నకు సమాధానం చెప్పలేక అవమానానికి గురి అయ్యే వాడిని కాదనీ, అలాగే విద్యార్థి జీవితంలోని అన్ని సరదాలు మానుకొని ఇంతగా కష్టపడాల్సిన అవసరం ఉండేది కాదని అనుకుంటూ ఉంటాడు. ఇంటర్మీడియట్ వరకు తెలుగు మీడియంలో చదువుకున్న తన బీ.టెక్ సహాధ్యాయులు చాలా మంది బీ.టెక్ పూర్తి చేయలేక, ఉద్యోగాలు లేకుండా అక్కడే ఆగిపోయారని అతను బాధపడుతూ వుంటాడు. వాళ్లు కనీసం ఆరవ తరగతి నుంచి ఇంటర్ వరకు ఇంగ్లీష్ మీడియంలో చదువుకుని ఉంటే వారికి ఆ పరిస్థితి తనకు ఈ పరిస్థితి వచ్చి ఉండేది కాదని అతను భావించాడు.

* * *

# పరువు

“సూసినావాబాలన్న నా బిడ్డ ఎంత పని జేసిందో? ఇంగ నేనీవూర్లో ఎట్ల బతికేది? కుటుంబం పరువు కులం పరువు తీసి నా పెద్దబిడ్డ తన దోవన తాను పోయింది. అది చేసిన పరువు తక్కువ పనికి నా సిన్న బిడ్డకు ఎట్లా పెండ్లయితుంది? నా కొడుక్కెట్లా పెండ్లయితుంది? నేనేం జేయాల్నో ఏం అర్థం కావడం లేదు బాలన్నా! నువ్ చెప్పు నన్నేంజేయమంటవో?”అని వెంకట్ రెడ్డి బాలన్నను అడిగాడు.

వెంకట్ రెడ్డికి ఏం చెప్పాలో తెలియక బాలన్న బిక్క మొగమేసుకొని అతని మొగం వైపు చూస్తూ మౌనంగా ఉండిపోయాడు. వెంకట్ రెడ్డి పెద్ద కూతురు ఆదిలక్ష్మి రెండు రోజుల కిందట ఆఊర్లోని మాల కుర్రవాడు “జాన్” తో వెళ్ళిపోయింది. ఈవార్త తెలిసిన వెంటనే జాన్ కుటుంబం మొత్తం వెంకట్ రెడ్డికి భయపడి వేరే ఊరికి వెళ్ళిపోయారు. అది బాగా పల్లెటూరు కావడంతో ఆ వార్త నిమిషాల మీద అందరికీ పాకిపోయింది. ఊర్లో వాళ్ళందరూ దాన్ని గురించి రకరకాలుగా మాట్లాడుకుంటున్నారు. వెంకట్‌రెడ్డి మీద సానుభూతి ఉన్నవాళ్లు అయ్యో వెంకట్‌రెడ్డికి ఎంత కష్టమొచ్చిందని బాధపడుతున్నారు. అతనంటే గిట్టని వాళ్ళు వెంకట్ రెడ్డికి తగిన శాస్తి జరిగిందని లోలోపల సంతోషపడుతున్నారు. ఇదంతా బాలన్నకు తెలుసు. అందుకనే వెంకట్‌రెడ్డి తన బాధను బాలన్నకు చెప్పి ఏం చేయమంటావు అని అడిగినప్పుడు ఏం మాట్లాడాలో తెలియక బాలన్న మాట్లాడకుండా మౌనంగా ఉన్నాడు. బాలన్న వెంకట్ రెడ్డి చిన్నప్పటి నుంచి మంచి స్నేహితులు. తన చిరకాల మిత్రుడు వెంకట్ రెడ్డి అలా బాధపడుతుంటే బాలన్న తాను కూడా అతనితోపాటు బాధపడటం తప్ప ఏమి మాట్లాడలేకపోయాడు.

వెంకట్‌రెడ్డి మళ్లీ మాట్లాడాడు.

“నా భార్యకు మొదటి కాన్పు కూతురు పుట్టినప్పుడు లచ్చిందేవి పుట్టిందని సంతోషించిన, మొదటి బిడ్డ అని దానికి ఆదిలచ్చిమని పేరు పెట్టిన, ఎంతో ముద్దుగా పెంచుకున్నా, అది సదువుకుంటానంటే పదో తరగతి వరకు సదివిచ్చిన, మమ్మల్నందరినీ నట్టేట్లో ముంచేసి అది ఎవనితోనో ఎగిరిపోయింది. నన్ను వాళ్ళమ్మను సెల్లెల్ని తమ్మున్ని గురించి ఏమీ ఆలోచించకుండా మేమేమై పోతామోనని కొంచెం కూడా సూడకుండా మూరకంగా ఎళ్ళిపోయింద”ని వెంకట్‌రెడ్డి దీనంగా మాట్లాడుతుంటే అతనితోపాటు బాలన్న గూడా బాధపడుతూ ఉన్నాడు. వెంకట్ రెడ్డి ఎప్పుడు అంత దీనంగా మాట్లాడలేదు.

కొంచెం సేపైన తర్వాత బాలన్న తేరుకుని వెంకట్ రెడ్డితో “నన్నేం జేయమంటావో సెప్పన్నా, నేను సేయాల్సిన పని గానీ సాయం గానీ ఉంటే తప్పకుండా సేచ్చాను” అన్నాడు.

వెంకట్‌రెడ్డి బాలన్నను ఇంకో గదిలోకి తీసుకుని పోయి అతనితో రహస్యంగా చెప్పాడు. “ఆ జాన్ గాని అమ్మా నాయనా యా వూర్లో ఉండారో కనుక్కొని వాళ్ళ దగ్గరికి పోయి నా బిడ్డ ఎక్కడుందో తెలుసుకొని రహస్యంగా ఎవరికీ తెలీకుండా దాన్ని మా ఇంటికి తీసుకొని రావాల. తీసుకోనొచ్చినాక దానికి నచ్చజెప్పి కొద్దిరోజుల పాటు వేరే ఊర్లో మా బంధువుల ఇంట్లో వుంచి ఈ సంగతి సద్దు మనిగినాక దానికి వేరే పెండ్లి జేచ్చా. అందుకని నువ్వు అదెక్కడుందో తెలుసుకుని దాన్ని మనూర్లో ఎవురూ సూడకుండా ఎవరికీ తెలీకుండా తీసుకొని రావాల”. అని వెంకట్ రెడ్డి బాలన్న చేతులు పట్టుకొని చెప్పాడు.

బాలన్న వెంటనే వెంకట్రెడ్డి చెప్పిన పని చేయడానికి కార్యరంగంలోకి దూకాడు. మొదట జాన్ తల్లిదండ్రులు ఏ ఊర్లో ఉన్నారో రహస్యంగా తెలుసుకోవడానికి ప్రయత్నించాడు. చాలా రహస్యంగా అతను ఆ ప్రయత్నం చేశాడు. చివరికి ఆ పిల్లవాని తల్లిదండ్రుల ఎక్కడున్నదీ తెలుసుకున్నాడు.

బాలన్న వాళ్ల దగ్గరికి వెళ్లి వాళ్ళతో “మీ మీద గానీ మీ కొడుకు జాన్ మీద గానీ వెంకట్‌రెడ్డికి కోపం లేదు. కూతురు మీద ఇప్పటికీ అతనికి శానా ప్రేమ ఉంది. అతడు జరిగిన దానికి బాదపడతండాడు గానీ కోపంగా లేదు. వెంకట్‌రెడ్డి కూతురు యాడుందో సెప్తే నేను ఆ అమ్మాయిని తోలుకొనిపోయి వెంకట్‌రెడ్డికి అప్పగిచ్చాను. వెంకట్‌రెడ్డి కొద్ది రోజుల తర్వాత ఆమెకు వేరే పెళ్లి సేచ్చానంటండాడు. కావట్టి ఆదిలక్ష్మి యాడుందో సెప్పర్రి.” అని అన్నాడు

జాన్ తల్లిదండ్రులు బాలన్న చెప్పిన మాటలు నమ్మలేదు. వెంకట్‌రెడ్డి జరిగిన విషయాన్ని అంత తేలిగ్గా తీసుకుంటాడని వారు భావించ లేదు. బాలన్న తమను నమ్మించడానికి అబద్ధాలు చెబుతున్నాడని వాళ్ళు భావించారు. అందువల్ల వారు తమ కొడుకు జాన్, ఆదిలక్ష్మి ఎక్కడున్నది తమకు తెలియదని, మళ్ళీ మళ్ళీ ఆ విషయం గురించి తమను అడగవద్దని చాలా గట్టిగా చెప్పారు. బాలన్న చాలా సేపు వారిని బతిమాలి ఇంటికి వచ్చాడు. రెండు రోజుల తర్వాత మళ్ళీ వెళ్లి వాళ్లను పదే పదేబ్రతిమాలాడు. బాలన్న అలా మూడు నాలుగు సార్లు వారి వద్దకు వెళ్లి పదేపదే బతిమాలాడు. దానితో వారు బాలన్న చెబుతున్నది నిజమేనని నమ్మి అతన్ని తీసుకొని తమ కొడుకు జాన్ ఆదిలక్ష్మి వున్న తన బంధువుల ఇంటికి వెళ్లారు.

బాలన్న ఆదిలక్ష్మిని కలుసుకొని ఆమె తండ్రి ఆమెకోసం పడుతున్న బాధను ఆమెకు వివరించాడు.

“అమ్మా ఆదిలచ్చిమీ మీయమ్మ నాయన తమ్ముడు సెల్లెలు అందరూ నీకోసం శానా బాదపడతండారు. నువ్ జేసిన పనికి వాళ్ళు కుమిలి కుమిలి ఏడ్చుండారు. అయితే నీ మీద కోపంగా మాత్రం లేరు. నిన్ను ఇంటికి తోల్క రమ్మని నన్ను బంపినారు. వాళ్ళు నిన్ను ఏమీ అనరు. నిన్ను ఒక దెబ్బ కూడా కొట్టరు. కొద్దిరోజుల పాటు నిన్ను వేరే ఊర్లో మీ బంధువుల ఇంట్లో ఉంచి నీకు మంచి సంబంధం సూసి పెండ్లి సేయాలని మీ నాయన అనుకుంటండాడు. అందువల్ల నువ్వు నా మాట నమ్మి ఇంక ఏమీ ఆలోసెన సేయకుండా మీ అమ్మా నాయన్లను బాదపెట్టకుండా నాతో పాటు మీయింటికి రామ్మా.”అన్నాడు.

బాలన్న చెప్పిన మాటలకు ఆదిలక్ష్మి చాలా బాధపడింది. తన కారణంగా తన కుటుంబం మొత్తం పడుతున్న బాధను ఆమె అర్థం చేసుకుంది. తొందరపడి ఏమీ ఆలోచించకుండా ఏదో మైకంలో ఆమె జాన్‌తో వచ్చేసింది. అయితే ఆమెకు తండ్రి గురించి తెలుసు. ఆమె ఇంటికి పోతే తండ్రి తప్పనిసరిగా తనను బతకనీయడు. చంపి తీరుతాడు. అందువల్ల బాలన్న మాటలు ఆమె నమ్మలేదు. అదే విషయం ఆమె బాలన్నతో చెప్పింది.

“నేను రాను సిన్నాయన, నేనొచ్చే నాయన నన్ను బతకనీడు. తప్పకుండా సంపుతాడు. అందులో నాకే అనుమానం లేదు. నన్ను సంపాలనుకుంటే మా ఇంటికి తీసుకొనిపో, నేను బతకాలనుకుంటే నన్ను ఈడనే వుండనీ. నా బతుకు నేను బతుకుతా” అని చెప్పింది.

బాలన్న ఆమె మాటలను పడనీయలేదు. "లేదమ్మా నాయన శానా మంచోడు. నువ్వంటే ఆయనకు శానా ఇష్టం. నీ మీద ప్రాణం పెట్టుకున్నాడు. నువ్వు ఇక్కడ ఎన్ని కష్టాలు పడతున్నావోనని ఆయన దిగులు పడతన్నాడు, నిన్ను తీసుకొని రమ్మని నాకు మరీ మరీ సెప్పినాడు. నీకేం బయం లేదమ్మా, నేనున్నాను గదా జాగ్రత్తగా సూసుకుంటా, నాతో ధైర్యంగా రా". అనిబాలన్న ఆమెకు ధైర్యం చెప్పి ఆరోజు రాత్రి పొద్దు పోయిన తర్వాత ఆమెను కారులో కూర్చోబెట్టుకొని అర్ధరాత్రి దాటిన తర్వాత తన ఊరికి చేరుకుని ఆదిలక్ష్మిని వెంకట్ రెడ్డి ఇంట్లో అప్పజెప్పి తన ఇంటికి వెళ్ళాడు.

మరుసటి రోజు పొద్దున పదకొండు గంటల ప్రాంతంలో బాలన్న వెంకటరెడ్డి ఇంటికి వెళ్లి ఆదిలక్ష్మి గురించి అడిగాడు. దానికి వెంకటరెడ్డి రాత్రికి రాత్రే ఆమెను వేరే ఊర్లో ఉన్న తన బంధువుల ఇంటికి పంపించానని చెప్పాడు. బాలన్న ఆశ్చర్యపోయాడు, ఇంత తొందరగా ఆదిలక్ష్మిని బంధువుల ఇంటికి పంపిస్తాడా? అనిబాలన్న అనుమానించాడు.

ఆ తర్వాత బాలన్న ఆదిలక్ష్మిని మళ్ళీ చూడలేదు. బాలన్నే గాదు ఇంకెవరు గూడా ఆదిలక్ష్మిని చూడలేదు. ఆమె ఏమైపోయిందో ఎవరికీ స్పష్టంగా తెలియదు. అది వెంకట్‌రెడ్డికి, అతని కుటుంబ సభ్యులకు మాత్రమే తెలుసు.

* * *

# అనుమానం

కల్లంలో ఉన్న నారాయణకు సంబంధించిన నలభై క్వింటాళ్ల ఎండు మిరపకాయలను రాత్రికి రాత్రి ఎవరో పెట్రోలు పోసి తగలబెట్టారు. ఎంతో కష్టపడి పండించిన పంట, చేతి దాకా వచ్చిన పంట నోటి దాకా రాకుండా పోయినందుకు నారాయణ చాలా తీవ్రంగా బాధ పడ్డాడు. ఆ ప్రాంతమంతా తగలబడిన మిరపకాయల ఘాటుతో ఉంది. చాలా మంది వ్యక్తులు మిరపకాయలు తగలబడిన ప్రాంతానికి వచ్చి చూసి నారాయణ మీద సానుభూతి ప్రకటిస్తూ మాట్లాడుతున్నారు. నారాయణ, అతని కుటుంబ సభ్యులు తీవ్రమైన విషాదంలో ఉన్నారు. సుమారు పది లక్షల రూపాయల విలువచేసే మిరపకాయలు ఒక్క రాత్రిలో బూడిద కావడం వారు ఊహించలేక పోతున్నారు. తమకు అంత నష్టం కలుగుతుందని వారు ఏనాడు భావించలేదు. నారాయణ కుటుంబానికి చెప్పుకోదగ్గ శత్రువులు ఎవరూ లేరు. ఒకరితో చిన్న తగాదా వుంది. కానీ అది ఇంతదాకా వస్తుందని వాళ్లు భావించడం లేదు. ఏమి చేయాలో నేరం ఎవరి మీద మోపాలో వాళ్లకు ఏమీ అర్థం కావడం లేదు.

నారాయణకు పది ఎకరాల పొలముంది. ఐదెకరాల్లో పత్తి పంట వేశాడు. ఐదెకరాల్లో మిరప వేశాడు. వర్షాలు ఎక్కువ కావడం వల్ల ఆ సంవత్సరం పత్తి పంట బాగా దెబ్బ తినింది. పెట్టిన పెట్టుబడి కూడా రాలేదు సరికదా చాలా నష్టమొచ్చింది. మిరప ఫరవాలేదు, పత్తి పంటలో వచ్చిన నష్టాన్ని భర్తీ చేస్తుంది అనుకుంటున్న సమయంలో మిరపకాయలు ఒక్క రాత్రిలో ఇలా కాలి బూడిదైపోయాయి.

ఆ వూరి పోలీస్ స్టేషన్లో సర్కిల్ ఇన్స్పెక్టర్‌గా నాగరాజు యాదవ్ గారున్నారు. ఆయన చాలా స్ట్రిక్ట్ ఆఫీసర్. చాలా నిజాయితీ గల వ్యక్తి. లంచం అనే మాట కూడా అతని పోలీస్ స్టేషన్ లో వినిపించడానికి వీలు లేదు. ఎలాంటి పక్షపాతం లేకుండా

పలుకుబడులకు ఒత్తిళ్లకు లొంగకుండా చాలా ధర్మంగా తన విధి నిర్వహిస్తారన్న మంచి పేరు అతనికుంది. బాధితులకు ఆయన బాగా అందుబాటులో ఉంటారు. పోలీసులున్నది ప్రజలకు అందులో ముఖ్యంగా బాధితులకు సేవ చేయడానికే అనే దృక్పథం గట్టిగా వున్నవారు. ఎలాంటి క్లిష్టమైన కేసునైనా చాలా నేర్పుగా పరిష్కరించగల గొప్ప మేధావి ఆయన.

నారాయణకు సంబంధించిన మిరపకాయలు తగలబడిపోయిన విషయం నాగరాజు గారికి తెలియగానే ఆయన వెంటనే అక్కడికి వెళ్లిపోయారు. అక్కడ గుంపుగా చేరిన ప్రజలు మాట్లాడుకుంటున్న మాటలు ఆయన విన్నారు. ఆయన్ను చూడగానే కొంతమంది మాట్లాడ్డం మానేశారు. నాగరాజు గారు అక్కడ చేరిన వాళ్ళతో, నారాయణతో మిరపకాయలను ఎవరు తగలబెట్టారు? ఎందుకు తగలబెట్టారు? అనే విషయం గురించి  అడిగారు. నారాయణ గాని అక్కడున్న వాళ్ళు గాని దానికి సంబంధించిన సరైన సమాచారాన్ని ఇవ్వలేకపోయారు. తర్వాత వచ్చి పోలీస్ స్టేషన్ లో కంప్లైంట్ చేయమని నారాయణకు చెప్పి నాగరాజు గారు వెళ్లిపోయారు.

నారాయణ ఆ రోజు సాయంత్రం పోలీస్ స్టేషన్ కు వెళ్లి తన మిరపకాయలు తగలబెట్టిన విషయాన్ని గురించి రాతపూర్వకంగా ఫిర్యాదు చేశాడు.

“నీకు ఎవరిమీదైనా అనుమానముందా” అని సి.ఐ గారు నారాయణను అడిగారు

“నాకు ఎవరిమీద అనుమానం లేదు సార్” అని నారాయణ చెప్పాడు

“పోనీ ఈ మధ్య కాలంలో నువ్వు ఎవరితోనైనా గొడవ పడ్డావా? లేక నీతో ఎవరైనా గొడవ పడ్డారా?” నాగరాజు గారు అడిగారు.

“ఒకతనితో చిన్న గొడవ అయింది సార్, మా కల్లం పక్కన సుబ్రహ్మణ్యం అనే అతని కల్లం ఉంది. ఆ కల్లానికి సంబంధించిన దారి విషయంలో నాకు అతనికి చిన్న తగాదా అయింది. కానీ ఆ గొడవ మిరపకాయలను తగలబెట్టేటంత పెద్ద గొడవ కాదని నా నమ్మకం”  నారాయణ చెప్పాడు.

“సరే అన్ని విషయాలు నేను ఎంక్వైరీ చేస్తాను, నీకు ఏదైనా విషయం తెలిస్తే వచ్చి నాకు చెప్పు” సి.ఐ గారు చెప్పారు.

తన మిరపకాయలను తగలబెట్టింది ఎవరు అనే విషయం సి.ఐ గారు తప్పనిసరిగా కనుక్కుంటారన్న ఆశతో నారాయణ ఇంటికి వెళ్లిపోయాడు.

నారాయణ వెళ్లిపోయిన తర్వాత నాగరాజు యాదవ్‌గారు ఆ విషయం గురించి ఆలోచించారు. రాయలసీమలో శత్రువుల ఆస్తులకు నష్టం కలిగించడం చాలా కాలం

నుంచి జరుగుతూ వుంది. శత్రువులకు సంబంధించిన నిమ్మ, చీనీ, అరటి, బొప్పాయి మొదలైన తోటల్లోని చెట్లను రాత్రికి రాత్రి నరికివేస్తారు. శత్రువులకు ఆర్థికంగా నష్టం కలిగించడానికి ఈ విధంగా తోటలు నరికి వేస్తారు. కానీ కల్లంలోని ఎండు మిరపకాయలను తగలబెట్టడం ఇదే మొదటిసారి. నారాయణ తనకు శత్రువులు ఎవరూ లేరని అంటున్నాడు, మరి శత్రువులు లేకపోతే తగులబెట్టింది ఎవరు? నారాయణ మీద అసూయతో ఎవరైనా ఈ పని చేసి ఉండొొచ్చు, నారాయణ మీద అసూయ ఉన్నవాళ్లు ఎవరున్నారు? ఈ విషయం గురించి నారాయణ ఏమీ చెప్పడం లేదు, ఎలా కనుక్కోవడం? అని నాగరాజు యాదవ్ గారు తీవ్రంగా ఆలోచించారు.

సరే, ముందు నారాయణతో ఈ మధ్యకాలంలో గొడవపడిన సుబ్రమణ్యాన్ని విచారించుదామని సి.ఐ గారు సుబ్రమణ్యాన్ని పిలిపించారు.

సి.ఐ గారు సుబ్రహ్మణ్యంతో అన్నారు.

“చూడు సుబ్రమణ్యం, మీ కల్లం పక్కన ఉన్న నారాయణ కల్లంలోని నారాయణ ఎండు మిరపకాయలను తగులబెట్టిన విషయం నీకు తెలిసే ఉంటుంది. కల్లానికి సంబంధించిన దారి విషయంలో నువ్వు నారాయణ గొడవ పడ్డారు. అతని మీద కోపంతో నువ్వే అతని ఎండు మిరపకాయలను తగులబెట్టావని మాకు సమాచారముంది. నేరాన్ని వెంటనే ఒప్పుకుంటే నీకు మంచిది. లేకపోతే మా పోలీసు పద్ధతిలో నేరాన్ని ఒప్పించవలసి ఉంటుంది”. సి.ఐ గారు అన్నారు.

“కల్లం దారి విషయంలో నేను నారాయణ గొడవ పడిన మాట వాస్తవమే, కానీ నేను కూడా రైతునే, సాటి రైతు పంటను తగులబెట్టేటంత దుర్మార్గున్ని కాదు సార్ నేను. నారాయణకు నష్టం కలిగినందుకు నేను చాలా బాధపడుతున్నాను. కానీ నేను ఆ పని చేయలేదు, ప్రమాణపూర్తిగా చెబుతున్నాను, నేను ఆ పని చేయలేదు సార్” అని సుబ్రహ్మణ్యం అన్నాడు.

సుబ్రహ్మణ్యం మాటలు విన్న తర్వాత అతను నిజమే చెబుతున్నాడని సీ.ఐ భావించారు.

ఆతర్వాత నాగరాజు గారు “సరే సుబ్రహ్మణ్యం, అవసరమైతే మళ్లీ పిలుస్తాను”అని అతన్ని పంపించారు.

నాగరాజు గారు దాని గురించి ఆలోచిస్తున్నప్పుడు అతనికి ఒక ఆలోచన వచ్చింది. దాని ప్రకారం తన దగ్గర పనిచేసే పోలీస్ కానిస్టేబుల్లను పిలిచి చుట్టుపక్కల పెట్రోల్ బంకుల్లో గత నాలుగైదు రోజుల్లో ఎవరెవరు పెట్రోలును డబ్బాల్లో గానీ

కేన్లలో గానీ తీసుకొని వెళ్ళారో వాళ్ల వివరాలు సేకరించమని చెప్పారు. అలాగే సీ.సీ కెమెరాలను గూడా పరిశీలించమని చెప్పారు.

కానిస్టేబుల్లు పెట్రోల్ బంకుల నుంచి డబ్బాల్లో సీసాల్లో పెట్రోలు తీసుకెళ్లిన వారి వివరాలను సేకరించారు. ఆతర్వాత పెట్రోల్ బంకుల్లోని సి.సీ కెమెరాలను పరిశీలించారు.

ఇలా పరిశీలించిన తర్వాత ఆ గ్రామంలోని నాగన్న అనే వ్యక్తి పెట్రోల్‌ను మూడు రోజులపాటు వరుసగా సీసాలో తీసుకొని వెళ్ళినట్లుగా తెలిసింది.

నారాయణ ఎండు మిరపకాయలను నాగన్న తగలబెట్టినట్లుగా నాగరాజు గారు నిర్ధారణ చేసుకున్నారు.

నాగరాజు గారు నాగన్నను పోలీస్ స్టేషన్‌కు పిలిపించారు.

నాగన్న భయపడుతూ భయపడుతూ సీ.ఐ గారి దగ్గరికి వచ్చాడు. వెంటనే సీ.ఐ చాలా గట్టిగా గద్దిస్తూ

“ఎందుకు నారాయణ మిరపకాయలను తగలబెట్టావు” అని అడిగారు.

నాగన్న భయపడుతూ “నేను తగలబెట్టలేదు సార్” అని అన్నాడు. పోలీసులు తమదైన శైలిలో విచారించగా నాగన్న తానే నారాయణ మిరపకాయలు తగలబెట్టినట్లు నేరం అంగీకరించాడు.

సి.ఐ గారు అతన్ని కటకటాల్లో పెట్టారు.

సి.ఐ గారు నారాయణను స్టేషన్‌కు పిలిపించి నాగన్న అతని మిరపకాయలను తగలబెట్టినట్లుగా చెప్పారు.

సి.ఐ గారు చెప్పింది విని నారాయణ ఆశ్చర్యపోయాడు. ఎందుకంటే నాగన్న, అతని భార్య తన పొలంలో పని చేయడానికి వస్తూ ఉంటారు. వాళ్లతో తనకెలాంటి గొడవ లేదు. అలాంటివాడు తన మిరపకాయలను తగలబెట్టి భారీ మొత్తంలో తనకు ఆర్థిక నష్టం ఎందుకు కలిగించాడో అతనికి అర్థం కాలేదు.

నాగన్న మీద కేసు ఫైల్ చేసి అతని జైలుకు పంపిస్తానని సి.ఐ నాగరాజు గారు నారాయణతో చెప్పారు.

నారాయణ దానికి అంగీకరించలేదు. “నాగన్న జైలుకు వెళితే అతని భార్యాబిడ్డలు రోడ్డున పడతారు, అతని మీద కేసు పెట్టవద్దు సార్” అని సి.ఐగారికి చెప్పాడు.

"నాగన్న నా మిరపకాయలను ఎందుకు తగలబెట్టాడో కారణం తెలుసుకోండి" అని నారాయణ సి.ఐ గారిని కోరాడు.

"నారాయణ మిరపకాయలను ఎందుకు తగలబెట్టావు, అతని మీద నీకు ఎందుకు అంత కక్ష ? అతను నీకు ఏం అపకారం చేశాడు? కారణం చెప్పు" అని సీ.ఐ నాగన్నను గద్దిస్తూ అడిగారు

–నాగన్న బదులు చెప్పకుండా మౌనంగా ఉన్నాడు.

వెంటనే పోలీస్ కానిస్టేబుల్ తన లాఠీకి పని చెప్పాడు.

చెప్పకపోతే పోలీసులు తనను చితక్కొడతారని భయపడి నాగన్న అసలు విషయాన్ని చెప్పాడు.

నాగన్న చెప్పిన మాటలు విని సీ.ఐ నాగరాజు గారు పోలీసులు నారాయణ ఆశ్చర్యంతో అలా ఉండిపోయారు.

ఇంతకూ నాగన్న ఏం చెప్పాడంటే–

"నారాయణ నా భార్యతో అక్రమ సంబంధం పెట్టుకున్నట్లుగా నాకు అనుమానంగా ఉంది, అందుకే అతని మీద కోపంతో అతనికి ఆర్థిక నష్టం కలిగించడానికి అతని మిరపకాయలను తగలబెట్టాను."

* * *

# సంస్కర్త

నాగిరెడ్డి రాజన్నను పిలిపించి చెప్పాడు. "సూడబ్బీ, మా తోటకు కాయిలుండాల, తోటలో మిరపతో బాటు వంకాయలు బెండకాయలు సొరకాయలు టమాటా ఇట్లాంటి కూరగాయలతో పాటు ఇంకా శానా రకాల పూలచెట్లు గూడా ఉండాయి. తోటలో మంచె గూడా కట్టినాం, మా తోటకు పగలు రేత్రి కాయిలుండాల, నువ్వుంటావా? నెలకు పదైదు వేలు జీతమిచ్చాను. మీ అమ్మా నాయన్ను అడిగి ఏ విషయం చెప్పు" అన్నాడు.

రాజన్న మాదిగ కులానికి చెందిన ఇరవై సంవత్సరాల యువకుడు. కాయకష్టం చేసి మంచి బలంగా ఉన్నాడు. ఇంటర్మీడియట్ వరకు చదువుకున్నాడు. ఆర్థిక ఇబ్బందుల వల్ల తర్వాత చదువుకోలేదు. తమకున్న కొద్దిపాటి పొలాన్ని సాగు చేసుకుంటూ కూలికి పోతూ జీవనం సాగిస్తున్నాడు. అతను నల్లగా ఉన్నప్పటికీ కళ గల నవ్వు ముఖం. రాజన్న నాగిరెడ్డి తోటకు కాపలా ఉండాలన్న విషయాన్ని తన అమ్మానాన్నలకు చెప్పాడు.

రాజన్న తండ్రి ఎల్లన్న. ఎల్లన్న కొడుకు రాజన్నకు జాగ్రత్తలు చెప్పాడు. "నువ్వు శానా జాగర్తగా ఉండాల, ఎంత వరకు ఉండాలో అంత వరకే ఉండాల, మనం మాదిగోల్లం. వాల్లు కాపోల్లు, వాల్ల ఆడోల్ల విషయంలో మనం మరీ జాగర్తగా ఉండాల, తప్పు వాల్లదైనా మనదే తప్పంటారు. వాళ్లు చనువిచ్చినా మనం చనువు తీసుకోగూడదు. మన అద్దుల్లో మనం ఉండాల. మనం ఎప్పుడూ అద్దు దాటగూడదు. అట్లా ఉంటే మనకు ఏ ఇబ్బంది ఉండదు" అన్నాడు. తండ్రి చెప్పిన మాటలు రాజన్న విని అలాగే జాగ్రత్తగా నడుచుకుంటానన్నాడు.

మరుసటి రోజు నుంచి రాజన్న నాగిరెడ్డి తోటకు కాపలాగా కుదురుకున్నాడు. రాజన్న మంచి నిజాయితీ పరుడు. నమ్మకస్తుడు. తోటలో ఏ వస్తువును ఇతరులు తీసుకొని పోకుండా చాలా జాగ్రత్తగా పగలు రాత్రి కాపలా కాస్తున్నాడు. కాపలా కాయడమే కాదు. ఇంజన్ వేసి తోటకు నీళ్ళు పెట్టేవాడు. మొక్కలకు చక్కగా పాదులు తవ్వేవాడు. కలుపు తీసేవాడు. తోటలోని కూరగాయలు పూలు తెంపి నాగిరెడ్డి ఇంటికి పంపించేవాడు. ఒక కూరగాయ గాని ఒక పువ్వు గాని తన ఇంటికి తీసుకు వెళ్ళేవాడు కాదు. రాజన్న నిజాయితీ నమ్మకంగా కష్టపడి పనిచేసే లక్షణం నాగిరెడ్డికి బాగా నచ్చాయి.

నాగిరెడ్డికి పెళ్లీడుకు వచ్చిన ఇద్దరు కొడుకులున్నారు. ఒక కూతురుంది. కూతురు దగ్గరలో ఉన్న పట్నంలో ఇంటర్మీడియట్ రెండవ సంవత్సరం చదువుతూవుంది. ప్రతిరోజు ఇంటి నుంచి వెళ్లి వస్తుంది. నాగిరెడ్డి భార్య కూతురు కొడుకులు తోటకు వచ్చి కూరగాయలు పూలు తెంపుకుని వెళ్ళేవారు. అప్పుడప్పుడు నాగిరెడ్డి కూతురు రామలక్ష్మి ఒంటరిగా తోటకు వచ్చేది. రాజన్నతో కలుపుగోలుగా మాట్లాడేది. రాజన్న తన హద్దుల్లో ఉంటూ ఆమెకు దూరంగా ఉండేందుకు ప్రయత్నించేవాడు. అయితే రామలక్ష్మి అతనికి దగ్గర కావడానికి ప్రయత్నించేది. ఇలా కొద్ది రోజులు గడిచింది. రోజురోజుకు ఆమె రాజన్నకు దగ్గర కావడానికి ప్రయత్నిస్తూ వుంది. ఇది రాజన్నకు చాలా ఇబ్బందిగా ఉండేది. ఆమెకు దగ్గరగా వస్తే ఒక సమస్య, దూరంగా ఉంటే మరో రకం సమస్య రావచ్చు. అందుకని అతను నాగిరెడ్డి తోటకు కాపలా ఉండడం మంచిది కాదని భావించాడు.

రాజన్న నాగిరెడ్డి ఇంటికి వచ్చి నాగిరెడ్డితో మాట్లాడాడు

“రెడ్డయ్య నేను తోటకు కాయిలి ఉండలేను, మీదగ్గర పని మానేచ్చాను” అన్నాడు రాజన్న

“ఏం, ఎందుకు మానేచ్చా వబ్బీ? మా వాళ్ళు ఎవరైనా ఏమన్నా అన్నారా? చెప్పు, వాళ్లతో నేను మాట్టాడతా, నువ్వు నిజాయితీగా కష్టపడి పని సేచ్చుండావు, చాన్నాల్లు మా తోటకు కాయిలి ఉంటావనుకున్నాను. ఎందుకు మానేచ్చావో చెప్పు కారణం?”అన్నాడు నాగిరెడ్డి

............................ రాజన్న మౌనంగా ఉన్నాడు.

“మాట్లాడకుండా ఉంటే ఎట్లా సెప్పు? కారణం చెప్పు, ఏదో ఒకటి కారణ ముంటుంది గదా. నేనేమనుకోను, సెప్పు, కారణం ఏందో సెప్పు” అన్నాడు నాగిరెడ్డి

"మీ అక్కయ్య(కూతురు) రామలక్ష్మి నాకు చాలా దగ్గరగా వచ్చుంది, నేను దూరంగా పోతున్నా సరే ఆమె మరింత దగ్గరవుతూ వుంది. అది నాకు నచ్చలేదు, అందుకనే నేను మీ దగ్గర పని మానేయాలనుకుంటండా." అన్నాడు రాజన్న

రాజన్న చెప్పింది విన్నాక నాగిరెడ్డి కాసేపు మౌనంగా ఉన్నాడు. తరువాత ఆలోచించి "మా అక్కయ్య సంగతి నేను జూసుకుంటా. నువ్వు మాత్రం పని మానొద్దు, మామూలుగా తోటకు కాయిలుండు" అన్నాడు నాగిరెడ్డి.

రాజన్న సరేనని అంగీకరించి వెళ్ళిపోయాడు.

నాగిరెడ్డి మంచివాడు. ఆ ఊర్లో అతను పెద్ద రైతు, తన కాలంలో ఎవరూ చదువుకోని రోజుల్లోనే పదవ తరగతి వరకు చదువుకున్నాడు. అతనికి వేమన పద్యాలు చాలా ఇష్టం, వేమనలోని సంస్కరణ భావాలు మరీ ఇష్టం. ముఖ్యంగా వేమన గుణవంతుని గురించి చెప్పిన పద్యాలు అతనికి చాలా ఇష్టం

"గుణయుతునకు మేలు గోరంత చేసినా
కొండయగును వాని గుణము చేత
కొండయంత మేలు గుణహీనుడెరుగునా?
విశ్వదాభిరామ వినుర వేమ"

"గుణములు గల వాని కులమెంచగానేల
గుణము గల్గెనేని కోటి సేయు
గుణము లేకయున్న గుడ్డిగవ్వయు లేదు
విశ్వదాభిరామ వినుర వేమ"

నాగిరెడ్డి తన కూతురు రామలక్ష్మిని గురించి ఆలోచించాడు. సీనియర్ ఇంటర్ చదువుతున్న ఆమె జూనియర్ ఇంటర్లో మంచి మార్కులతో పాస్ అయింది. ఆమె రాజన్నను ఇష్టపడుతుందా? ప్రేమిస్తుందా? అది తాత్కాలికమైన ఆకర్షణా లేక మరేదైనానా? అనేది అతనికి అర్థం కాలేదు. యువతీ యువకుల మధ్య ప్రేమ గురించి అతనికి అవగాహన ఉంది. యువతీ యువకుల్లో ఎవరికి ఎవరి మీద ఎందుకు ప్రేమ కలుగుతుందో ఏమీ చెప్పలేం. కొందరికి చూడగానే ప్రేమ కలుగుతుంది. మరికొందరికి అవతలి వ్యక్తిని చాలా కాలం చూసి ఆమెలోని లేక అతనిలోని భావాలు, మనస్తత్వం నచ్చిన తర్వాత ప్రేమ కలగవచ్చు. అందువల్ల తన కూతురు రాజన్న పట్ల ఎలాంటి భావం కలిగి ఉందో తెలుసుకోవాలని అనుకున్నాడు.

ఆమెను పిలిచి నాగిరెడ్డి మాట్లాడాడు.

"ఏం తల్లి బాగా చదువుతండావా, రోజూ కాలేజీకి పోయి రావడంలో ఇబ్బందులు లేవు గదా, ఏమైనా ఉంటే చెప్పు, అక్కడే హాస్టల్లో ఉండి చదువుకుందువు గానీ" అన్నాడు నాగిరెడ్డి

"బాగా చదువుతున్నా నాన్న, ఇంటి నుంచి కాలేజీకి పోయి రావడంలో నాకు ఏ ఇబ్బంది లేదు, హాస్టల్లో నేనుండలేను, ఇంటి దగ్గర నుంచి పోయి వస్తాను". అని రామలక్ష్మి చెప్పింది.

"అప్పుడప్పుడు మన తోటకు పోయి వచ్చుండావు గదా, తోట బాగుందా, తోటలో కూరగాయలు పూలు బాగా కాచ్చుండాయా? తోటకు కాయిలున్న రాజన్న బాగుండాడా? "అడిగాడు నాగిరెడ్డి.

రాజన్న పేరు చెప్పగానే ఆమె ముఖంలో సంతోషం స్పష్టంగా కనిపించింది నాగిరెడ్డికి.

"తోట బాగుంది నాన్న, తోటను రాజన్న బాగా చూసుకుంటండాడు" అన్నది

"నువ్వు రాజన్నతో శానా చనువుగా ఉంటండావని నాకు అనిపిచ్చుంది, ఇది మామూలుగా ఉండే చనువేనా, ల్యాక అతని మీద నీకు ఏదన్నా ప్రత్యేకమైన ఆసక్తి వుందా"అని నాగిరెడ్డి అడిగాడు

రామలక్ష్మి రాజన్నను మనస్ఫూర్తిగా ప్రేమిస్తూ వుంది. అతని నిజాయితీ, నమ్మకంగా పని చేసే విధానం, తాను అతనికి దగ్గరవుతున్నా తనకు దగ్గర కాకుండా దూరంగా వుండటం మొదలైన లక్షణాలు ఆమెకు అతని మీద ఉన్న ప్రేమను మరింత ఎక్కువ చేశాయి. రాజన్న మీద తనకున్న ప్రేమను గురించి తండ్రి అలా అడిగేటప్పటికీ ఆమె మొదట ఆశ్చర్యపోయింది. తండ్రి సానుకూలంగా మాట్లాడడంతో ఆమె ధైర్యంగా తన మనసులోని ప్రేమను గురించి తండ్రికి చెప్పాలని నిశ్చయించుకుంది.

"అవ్ నాన్నా నేను రాజన్నను ప్రేమిచ్చుండా, సాదారణంగా ఆడపిల్లలు మగపిల్లలకు దగ్గరవుతుంటే ఆ అవకాశాన్ని ఎవరు వదులుకోరు. కానీ రాజన్న నేను దగ్గరవుతున్న కొద్దీ నాకు దూరంగా పోతండాడు. అయితే అతని మనసులో నా మీద ప్రేమ ఉంది. అది తెలుచ్చుంది. కానీ అతను అది చెప్పడం లేదు, నేను చెప్దామంటే అతను నాకు అవకాశం ఇయ్యడం లేదు. ఇవన్నీ అతనిలోని మంచి గుణాలు. అతని కంటే మంచి మనిషి నాకు దొరుకుతాడని నేను అనుకోవడం లేదు. నువ్వు అడుగుతండావు కాబట్టి నేను నా మనసులో మాట చెప్తండా, నేను రాజన్నను మనస్పూర్తిగా ప్రేమిచ్చుండా. అతన్ని మాత్రమే పెళ్లి జేసుకుంటా, ఇంకెవరిని చేసుకోను, ఇది నేను నిచ్చయంగా చెప్తున్న మాట, ఆ తర్వాత నీ ఇష్టం" తండ్రితో చెప్పింది రామలక్ష్మి.

తన కూతురు రామలక్ష్మి రాజన్నను ప్రేమిస్తున్న విషయం, అతన్ని పెళ్లి చేసుకోవాలనే విషయం ఖరాఖండీగా చెప్పడంతో నాగిరెడ్డి ఆలోచనలో పడ్డాడు.

"నన్ను ఆలోచించుకోనీ" అని కూతురుకు చెప్పి ఆమెను పంపించాడు.

నాగిరెడ్డి ఆ విషయం గురించి తీవ్రంగా ఆలోచించాడు. రాజన్న మంచి గుణవంతుడు, తన కూతురు అతనికి దగ్గరవుతుంటే దాన్ని అవకాశంగా తీసుకోకుండా తన దగ్గరకు వచ్చి తన కూతురు విషయం తనకు చెప్పి తన వద్ద పని మానేస్తానని చెప్పినప్పుడు అతని మీద నాగిరెడ్డికి గౌరవం పెరిగింది. అంతకంటే మంచి గుణం ఇంకేం కావాలి. అయితే వేమన చెప్పినట్టుగా ''గుణములు గల వాని కులమెంచగానేల" అనే విషయం పల్లెటూళ్లో సాధ్యమేనా? పట్టణాల్లో నగరాల్లో ఎవరి కులం ఎవరికీ తెలియదు కాబట్టి అక్కడ అది సాధ్యమే. కానీ గ్రామాల్లో కులం కట్టుబాట్లు చాలా ఎక్కువగా వుంటాయి. ధైర్యం చేసి రాజన్నకు తన కూతురునిచ్చి పెళ్లి చేస్తే గ్రామంలో ఉన్న తన తోటి కులస్తులు, ఇతర కులాల వాళ్ళు తన మీదకు దండెత్తుతారు. అలాగని తన ఒక్కగానొక్క కూతురు ఇష్టాన్ని కాదనడం కూడా అతనికి ఇష్టం లేదు. ఈ రెండింటికి మధ్యస్తంగా ఆ సమస్యను పరిష్కరించాలని అతను భావించాడు.

నాగిరెడ్డి మొదట తన భార్యను ఇద్దరు కుమారులను కూర్చోబెట్టుకొని వారికి విషయం చెప్పి తాను చేయదలచుకున్న విషయాన్ని వివరించాడు. మొదట వారు దానికి అంగీకరించలేదు. కానీ నాగిరెడ్డి మారుతున్న కాలాన్ని గురించి తాము మారవలసిన అవసరాన్ని గురించి వారికి మంచి మాటలతో చెప్పి తాను చేయదలచిన పనికి వారిని అంగీకరింపజేశాడు.

ఆ తర్వాత నాగిరెడ్డి తన కూతురును తీసుకుని తోటలో ఉన్న రాజన్న దగ్గరకు వెళ్లి అతనితో మాట్లాడాడు.

"రాజన్నా, నా బిడ్డ రామలక్ష్మి నిన్ను ప్రేమిచ్చుంది. నిన్ను మాత్రమే పెళ్లి జేసుకుంటానని చెప్తంది. దీని మీద నీ అభిప్రాయం ఏంది" అన్నాడు నాగిరెడ్డి.

నాగిరెడ్డి మాటలకు రాజన్న ఆశ్చర్యపోయాడు. వెంటనే అతనికి ఏం మాట్లాడాలో తెలియలేదు. కొంచెం సేపు మౌనంగా ఉండి తర్వాత నాగిరెడ్డితో చెప్పాడు.

"రెడ్డయ్య మాది సిన్న కులం, మీది పెద్ద కులం, మనూరు శానా పల్లెటూరు, ఈ ఊర్లో ఇట్టాటిది జరుగుతాదా?" అన్నాడు

"రాజన్నా హిందూమతంలోని కులాల పట్ల నాకు నమ్మకం లేదు. మన పెద్దలు సమాజం ఒడిదుడుకులు లేకుండా నడ్సడానికి కులాల్ను ఏర్పాటు చేసినారు. కొందరు స్వార్ధపరులు దాన్ని చాలా కఠినంగా అమలు చేసినారు. దానివల్ల దేశంలో డెబ్బై శాతం మంది నరక యాతన పడుతండారు. వేమన లాంటి సంఘసంస్కర్తలు కులవ్యవస్థ

నిర్మూలించే ప్రయత్నం చేసినారు, కానీ అది జరగలే. అయితే ఈనాడు సమాజంలో కులానికి సంబంధించి మెల్లగా మార్పులు వచ్చుండాయి. సిన్న కులాల వాళ్ళు పెద్ద కులాల వాళ్ళు పెండ్లి చేసుకుంటండారు. పట్టణాల్లో నగరాల్లో దీని గురించి ఎవరూ పెద్దగా పట్టించుకోరు. కానీ గ్రామాల్లో కుల కట్టుబాట్లు ఎక్కువ కాబట్టి ఇట్లాంటి పెండ్లిండ్లు ఎవరూ జరగనియ్యరు. ఆ సంగతి నేను సూసుకుంటా. మా అమ్మాయిని పెళ్ళి చేసుకోవడం నీకు ఇష్టమేనా? అది చెప్పు, ఇష్టమైతే తర్వాత విషయం నేను సూసుకుంటా" అన్నాడు నాగిరెడ్డి.

"రాజన్నకు రామలక్ష్మి అంటే ఇష్టమే, అయితే అతని తండ్రి ఎల్లన్న నాగిరెడ్డి ఇంటి ఆడవాళ్ళ పట్ల దూరంగా ఉండమని చెప్పాడు, కాబట్టి అతని తండ్రి మాటకు కట్టుబడి రామలక్ష్మికి దూరంగా ఉన్నాడు. నాగిరెడ్డి రామలక్ష్మిని పెళ్ళి చేసుకోవడం ఇష్టమేనా అని అడిగిన వెంటనే అతను సంతోషంగా రామలక్ష్మి వైపు చూస్తూ "ఇష్టమే"అన్నాడు. రామలక్ష్మి కూడా రాజన్న వైపు సంతోషంగా చూసింది. అప్పుడు నాగిరెడ్డి తన మనసులోని మాటను వాళ్ళిద్దరికీ చెప్పాడు.

"రాజన్నా నువ్వు పై చదువులు చదవాల, పట్నంలో నిన్ను నేను చదివిచ్చాను. నువ్వు బాగా చదివి మంచి ఉద్యోగం తెచ్చుకోవాల. నా బిడ్డ కూడా చదువుకుంటుంది. మీరిద్దరూ ప్రయోజకులయిన తర్వాత మీ పెళ్ళి సేచ్చాను. పెండ్లి చేసుకున్నాక మీరు పట్నంలోనో నగరంలోనో ఉంటారు కాబట్టి గ్రామంలోని ప్రజల వల్ల మీకు ఎలాంటి ఇబ్బంది ఉండదు. కాబట్టి ముందు మీరు బాగా చదువుకోండి" అన్నాడు నాగిరెడ్డి.

దానికి రాజన్న రామలక్ష్మి సంతోషంగా అంగీకరించారు.

తర్వాత నాగిరెడ్డి రాజన్నతో "మీ అమ్మానాన్నలకు ఈ విషయం చెప్పు. నువ్వు పై చదువులు చదవడానికి పట్నం వెళ్ళడానికి సిద్ధంగా ఉండు. మా ఇంట్లో వాళ్ళందరూ ఈ విషయానికి ఒప్పుకున్నారు. కాబట్టి మా ఇంట్లో వాళ్ల వల్ల నీకు గాని నీ కుటుంబానికి గానీ ఎలాంటి ఇబ్బంది ఉండదు". అనిఅన్నాడు

రాజన్న వెంటనే ఇంటికి సంతోషంగా వెళ్లి తన అమ్మానాన్నలకు ఈ విషయమంతా చెప్పాడు. వాళ్లు మొదట నాగిరెడ్డి మంచితనానికి ఆశ్చర్యపోయారు. తర్వాత సంతోషంగా రాజన్న చెప్పిన దానికి అంగీకరించారు.

నాగిరెడ్డి తాను చెప్పినట్లుగానే రాజన్నను పై చదువులకు పంపించాడు. రాజన్న కష్టపడి చదివి మంచి ఉద్యోగం సంపాదించు కున్నాడు. రామలక్ష్మి కూడా బాగా చదువుకుంది. వాళ్ళిద్దరి పెళ్లి నాగిరెడ్డి పట్టణంలో చేసి తన మాట నిలబెట్టుకొని మంచి సంస్కర్తగా పేరు తెచ్చుకున్నాడు.

* * *

# తన కోపమే తన శత్రువు

అది విశాఖపట్నం జిల్లాలో ఒక పల్లెటూరు. ఆ ఊర్లో రాములమ్మ అనే ఆమె వుంది. ఆమెకు భర్త లేడు. ఓకే కూతురు, సరోజ, ఆమె ఇంటర్మీడియట్ చదువుతూ వుంది. వాళ్ళు పేదవాళ్ళు. కానీ ఊర్లో ఆమెకు దగ్గర బంధువులు చాలా మంది ఉన్నారు. ఆ ఊర్లోనే అదే కులానికి చెందిన అప్పారావు కుటుంబం ఉంది. అప్పారావు కొడుకు రమేష్, అతను బీ.టెక్ చదువుతున్నాడు. ఈ రెండు కుటుంబాలకు ఒక విషయంలో తగాద వచ్చింది.

రాములమ్మ కోపిష్టి మనిషి. ఆ కోపంతో వాళ్ల మీద కక్ష తీర్చుకోవడానికి తన కూతురును బీ.టెక్ చదువుతున్న రమేశ్‌కిచ్చి పెళ్లి చేసి ఆ తర్వాత ఆమె ద్వారా ఆ కుటుంబం మీద కక్ష సాధించాలని అనుకున్నది. మామూలుగా అయితే రెండు కుటుంబాలకు పడదు కాబట్టి తన కూతురును వాళ్ళు పెళ్ళి చేసుకునే అవకాశం లేదు. ఒకవేళ వాళ్ళు పెళ్లి చేసుకోవడానికి అంగీకరించినా తన కూతురును పెళ్లి చేసుకోవడానికి కట్నం అడుగుతారు. కట్నం ఇచ్చే స్తోమత తనకు లేదు. అందువల్ల రాములమ్మ తన కూతురు సరోజతో ఎలాగైనా రమేశ్ తో పరిచయం పెంచుకుని అతన్ని ముగ్గులోకి దింపి పెళ్లి చేసుకోమని చెప్పింది. సరోజ కూడా దానికి అంగీకరించింది.

సరోజ మెల్లగా రమేశ్‌కు దగ్గరయ్యే ప్రయత్నం చేసింది. లెక్కలు తనకు అర్థం కావడం లేదని, అర్థం కాని లెక్కలు చెప్పుమని రమేశ్ ను సరోజ కోరింది. రమేశ్ అంగీకరించి ఆమెకు లెక్కలు చెప్పేవాడు. సరోజ అతను చెప్పే లెక్కలు వింటూ అతనికి దగ్గరయ్యే ప్రయత్నం చేసింది. అమ్మాయి తనంతట తానుగా దగ్గరవుతూ ఉంటే రమేశ్ కాదనకుండా ఆమెతో శారీరక సంబంధం పెట్టుకున్నాడు.

ఆ తర్వాత సరోజ తనను పెళ్లి చేసుకోమని రమేశ్ ను కోరింది.

“రమేశ్ నువ్వు లెక్కలు బాగా చెప్పావు. నువ్వు చాలా తెలివైన వానివి. అందంగా కూడా ఉంటావు. నువ్వంటే నాకు చాలా ఇష్టం. మన ఇద్దరి కులాలు కూడా ఒకటే, కాబట్టి మనం పెళ్లి చేసుకుందాం. మన తల్లిదండ్రులు కూడా మన పెళ్ళికి అడ్డు చెప్పరు. ఆ ధైర్యంతోనే నా అంతట నేనుగా నీకు దగ్గరయ్యాను. నీతో సంబంధం పెట్టుకున్నాను. ఆలస్యం చేయకుండా మనం వెంటనే పెళ్లి చేసుకోవాలి”అని సరోజ చెప్పింది.

సరోజ చెప్పినదానికి రమేశ్ అంగీకరించలేదు.

సాధారణంగా ఆడపిల్లలు మగవాళ్ళకి దూరంగా ఉంటారు. కానీ నువ్వు కావాలని నాకు దగ్గరై నాతో సంబంధం పెట్టుకున్నావు. నేను మగవాన్ని. నేను కావాలని ఎవరైనా అమ్మాయి నా దగ్గరికి వస్తే నేను దూరంగా ఎలా ఉండగలను, కాదని ఎలా అనగలను. అలా తిరస్కరిస్తే నా మగతనాన్ని అవమానించినట్లు, అంతేకాదు అలా తిరస్కరిస్తే అమ్మాయి బాధపడుతుంది. ఆ అమ్మాయిని కూడా అవమానించినట్ల వుతుంది. అందువల్ల నేను నిన్ను బాధ పెట్టడం, అవమానించడం ఇష్టం లేక నీతో సంబంధం పెట్టుకున్నాను. నిన్ను పెళ్లి చేసుకుంటానని నేను ఎప్పుడూ చెప్పలేదు. నిన్ను పెళ్లి చేసుకునే ఉద్దేశం కూడా నాకు లేదు. కాబట్టి ఇందులో నా తప్పు ఏమీ లేదు, నిన్ను పెళ్లి చేసుకునే అవకాశం లేదు, కాబట్టి నేను నిన్ను పెళ్లి చేసుకోను”. అని రమేశ్ చెప్పాడు.

రమేశ్ మాటలు విన్న సరోజ దిగ్భ్రాంతి చెందింది. కాసేపటి తర్వాత ఆమె తేరుకొని అతన్ని కౌగలించుకుని “రమేశ్ ఇలా మాట్లాడడం నీకు న్యాయం కాదు, నన్ను అన్యాయం చేయొద్దు, నీ మీద నేను ఎన్నో ఆశలు పెట్టుకున్నాను, నా ఆశలు అడియాసలు చేయొద్దు, నా భవిష్యత్తును నాశనం చేయొద్దు, నీకు దండం పెడతాను, నన్ను స్వీకరించు, మన సంబంధం అందరికీ తెలిసిపోయింది, నువ్వు నన్ను పెళ్లి చేసుకోకపోతే ఇంక నన్ను ఎవరూ చేసుకోరు. కాబట్టి నువ్వే నన్ను పెళ్లి చేసుకోవాలి. దయచేసి మన పెళ్లికి అంగీకరించు”అని సరోజ దుఃఖంతో చెప్పింది.

రమేశ్ ఆమె మాటలను అంగీకరించలేదు.

“సరోజా, నా లక్ష్యం నా ఆశయం వేరుగా ఉన్నాయి. నేను మొదట బెంగళూరు గాని హైదరాబాద్ గానీ వెళ్ళి కోచింగ్ తీసుకుని సాఫ్ట్ వేర్ ఉద్యోగం సంపాదించుకోవాలి. ఆ తర్వాత సాఫ్ట్ వేర్ ఉద్యోగం చేస్తున్న అమ్మాయిని పెళ్లి చేసుకొని హైదరాబాదులో గానీ బెంగుళూరులో గానీ స్థిరపడాలని నేను లక్ష్యంగా

పెట్టుకున్నాను. అందువల్ల నిన్ను పెళ్లి చేసుకోవడం కుదరదు. నా మీద ఎలాంటి ఆశలు పెట్టుకోవద్దు. నేను రేపు వెళ్లిపోతున్నాను, నువ్వు ఇంటర్మీడియట్ పాస్ అయ్యావు, ఆ తర్వాత డిగ్రీ గాని బీ.టెక్ గానీ చదువు, నేను ఇక్కడి నుంచి వెళ్లిపోయి, నువ్వు చదువులో పడిపోతే మన సంబంధం గురించి అందరూ మర్చిపోతారు. తర్వాత నువ్వు వేరే వ్యక్తిని పెళ్లి చేసుకోవచ్చు"అని రమేశ్ ఆమెతో చెప్పాడు.

తాను ఆ ఊర్లో ఉంటే సరోజ తన మీద ఒత్తిడి తీసుకురావచ్చని భావించి రమేష్ ఉద్యోగ ప్రయత్నం కోసం హైదరాబాదుకు ఆరోజే వెళ్ళిపోయాడు.

రమేశ్ హైదరాబాదుకు వెళ్ళిపోయిన విషయం తెలిసుకున్న రాములమ్మ తన కూతురును తీసుకుని తన బంధువులతో కలిసి అప్పారావు ఇంటి మీదకి వెళ్లి నానా గొడవ చేసింది. రాములమ్మ బంధువులు అప్పారావును కొట్టి, అతని ఇంట్లో సామానులు పగలగొట్టారు. రాములమ్మ తన కూతురును వాళ్ళ ఇంటి కోడలిగా చేసుకోకపోతే పరిణామాలు చాలా తీవ్రంగా ఉంటాయని హెచ్చరించింది.

అప్పారావు రాములమ్మకు వాళ్ల బంధువులకు భయపడి ఆఊరు వదిలి వేరే ఊరికి కుటుంబంతో సహా వెళ్ళిపోయాడు. రాములమ్మ బంధువులు అప్పారావు ఇంటిని ఆక్రమించుకున్నారు. ఈ విషయాలన్నీ అప్పారావు తన కుమారునికి ఫోన్ ద్వారా చెప్పి అతన్ని జాగ్రత్తగా ఉండమని హెచ్చరించాడు.

తన కారణంగా తన తల్లిదండ్రులు బాధలు పడుతున్నందుకు రమేష్ చాలా బాధపడ్డాడు. తన తండ్రిని కొట్టి తన ఇంట్లో సామానులు పాడు చేసి తన ఇంటిని ఆక్రమించుకున్నందుకు రమేశ్ కు సరోజ మీద ఆమె తల్లి మీద వాళ్ళ బంధువుల మీద చాలా కోపం వచ్చింది. అయితే తమకు బంధుబలం లేదు కాబట్టి వాళ్లను ఏమీ చేయలేక మౌనంగా ఉండిపోయాడు. ఏది ఏమైనా వారి బెదిరింపులకు లొంగకూడదని రమేశ్ గట్టిగా నిర్ణయించుకున్నాడు.

రాములమ్మ అన్న హైదరాబాదులో ఉన్నాడు. అతని పేరు వెంకటరావు. అతను రౌడీ లాంటివాడు. రాములమ్మ తన కూతురును అన్న దగ్గరికి పంపించి రమేశ్‌ను వెదికి పట్టుకుని వాళ్ళిద్దరికీ ఎలాగైనా వివాహం చేయాలని గట్టిగా చెప్పింది.

వెంకటరావు తప్పనిసరిగా చేస్తానని రాములమ్మకు హామీ ఇచ్చాడు. వెంకటరావు, అతని మనుషులు, సరోజ, రమేశ్ కోసం వెదకడం ప్రారంభించారు. రమేశ్ అమీర్ పేటలోని ఒక కోచింగ్ సెంటర్లో కోచింగ్ తీసుకుంటున్నట్టుగా వాళ్లు తెలుసుకున్నారు. వెంకటరావు రమేశ్ ఎక్కడెక్కడ తిరుగుతున్నది తెలుసుకోవడానికి ఒక మనిషిని పెట్టాడు. ఆ మనిషి రమేశ్ ను రహస్యంగా అనుసరిస్తూ ఎప్పటికప్పుడు రమేశ్ ఎక్కడెక్కడ తిరుగుతున్నది సెల్ ఫోన్ ద్వారా వెంకటరావుకు చెప్పేవాడు.

రమేశ్ ఎక్కడికి వెళ్ళినా మిత్రులతో కలిసి వెళ్లేవాడు. ఒంటరిగా తిరిగే వాడు కాదు. అయితే ఒకసారి అతను బేగంపేటలో ఒంటరిగా ఉన్నప్పుడు వెంకటరావు సరోజ వెంకటరావు మనుషులు రమేశ్ ను పట్టుకున్నారు. "పెళ్లి చేసుకుంటానని హామీ ఇచ్చి నన్ను వాడుకుని పెళ్లి చేసుకోకుండా తిరుగుతున్నావా" అని సరోజ అతన్ని అందరి ముందు కొట్టింది. వెంకటరావు అతని మనుషులు కూడా కొట్టి అందరి ముందు రమేశ్ ను అవమానించారు. తర్వాత వెంకటరావు బలవంతంగా రమేశ్ ను ఆటోలో ఎక్కించి తన ఇంటికి తీసుకొని వెళ్ళాడు.

వెంకటరావు సరోజను రమేశ్ ను ఒక గదిలోకి పంపించి కాపురం చేయుమని రమేశ్ ను బెదిరించాడు. రమేశ్ దానికి అంగీకరించకపోవడంతో వెంకటరావు అతన్ని బాగా కొట్టాడు. ఆ దెబ్బలకు తట్టుకోలేక రమేశ్ సరోజతో నెల రోజుల పాటు కాపురం చేశాడు. రమేశ్ వాళ్ల దగ్గర నుంచి తప్పించుకోవడానికి వాళ్ళతో కొంత సానుకూలంగా వ్యవహరించాడు. దానితో రమేశ్ గాడిలో పడ్డాడని భావించి అతని విషయంలో కొంచెం అశ్రద్ధగా ఉన్నారు. అదే అదనుగా భావించి రమేశ్ తప్పించుకొని వెళ్ళిపోయాడు. చేసేదిలేక సరోజ తన ఊరికి వచ్చింది.

తల్లి చెప్పిన మాట వినటం వల్ల తన జీవితం నాశనమైపోయిందని సరోజ తల్లితో వాపోయింది

"అమ్మా, నువ్వే నా జీవితం నాశనం చేశావు. నీ కోపం తీర్చుకోవడానికి నన్ను పావుగా వాడుకున్నావు. నువ్వు చెప్పిన మాట విని నేను రమేశ్తో సంబంధం పెట్టుకోవడం వల్ల వాడు నన్ను చులకనగా చూశాడు, నన్ను అవమానించాడు. అంతటితో ఆగిపోయి ఉంటే బాగుండేదేమో, నువ్వు కోపంతో బంధువులను నన్ను తీసుకొని రమేశ్ వాళ్ల నాన్న మీదికి వెళ్లి నానా యాగీ చేయడంవల్ల రమేశ్ తల్లిదండ్రులు ఊరు విడిచి వెళ్లిపోయారు. అలా చేస్తే ఏ కొడుకైనా అలా చేసిన వారిని క్షమిస్తాడా? నీ మాట మామయ్య మాట విని నెల రోజుల పాటు వానితో హైదరాబాదులో బలవంతంగా కాపురం చేశాను. వానికేం, వాడు మగవాడు, వానికి వచ్చిన నష్టమేమీ లేదు. నన్న అనుభవించి వాడు పారిపోయాడు. వాడు ఎక్కడ ఉన్నాడో తెలియదు, వాన్ని ఎలా పట్టుకోవడం? పెళ్లికి ఒప్పించడం ఎలా? అన్ని విధాల నష్టపోయింది నేనే, ఇప్పుడు నేనేం చేయాలి, నా భవిష్యత్తు ఏమిటి, అర్థం కాకుండా ఉంది, నీ కోపిష్టితనం వల్ల నా జీవితం నాశనమైపోయింది". అని సరోజ తల్లితో కోపంగా చెప్పింది.

"వాడి మీద కేసు పెట్టి వాన్ని కోర్టుకు లాగుదాం, వాని అంతు చూద్దాం, వాన్ని వదిలి పెట్టగూడదు, కేసు పెడితే వాడు తప్పనిసరిగా మన దారికి వస్తాడు". అని రాములమ్మ చెప్పింది.

చెప్పినట్లుగానే సరోజ రమేశ్ మీద కేసు పెట్టింది. రమేశ్ తనను పెళ్లి చేసుకుంటానని మాయమాటలు చెప్పి శారీరకంగా వాడుకొని పెళ్లి చేసుకోకుండా ఊరు వదిలి పారిపోయాడని కేసు పెట్టింది. కేసు కోర్టుకు వెళ్లింది, కోర్టు నుంచి రమేశ్ కు నోటీసులు వెళ్ళాయి. నోటీసులు అందుకోకుండా రమేశ్ చాలా కాలం పాటు తప్పించుకుని తిరిగాడు. చివరకు సరోజ లాయర్ పేపర్ ప్రకటన ఇవ్వడంతో రమేశ్ తాను కూడా ఒక లాయర్ ను పెట్టుకొన్నాడు.

సరోజ చెప్పినట్లుగా తాను ఆమెను పెళ్లి చేసుకుంటానని మాయమాటలు చెప్పలేదని, ఆమెను శారీరకంగా వాడుకోలేదని ఆమెకు తనకు ఎలాంటి సంబంధం లేదని, కేసులో ఆమె రాసిన మాటలన్నీ అబద్ధాలని తమ కుటుంబానికి వారి కుటుంబానికి తగాదా ఉందని, ఆకారణంతో తన మీద కక్ష తీర్చుకోవడానికి అబద్ధపు కేసు పెట్టిందని, తాను ఉద్యోగ ప్రయత్నంలో చెన్నైలో ఉన్నానని, ఆమె చెప్పినట్లు తాను ఎక్కడికి పారిపోలేదని రమేశ్ తన లాయర్ ద్వారా కోర్టుకు తెలియజేశాడు. కోర్టులో కేసు నెలకొకసారి వాయిదా పడేది, కొన్నిసార్లు రెండు నెలలకు ఒకసారి వాయిదా పడేది. వాయిదాకు రమేశ్ చెన్నై నుంచి వస్తున్నాడు, వెళ్తున్నాడు. రాని సమయంలో తన లాయర్ ద్వారా గైరు హాజరు పిటీషన్ వేస్తున్నాడు. రమేశ్ సరోజ ఇద్దరు లాయర్లకు డబ్బులు ముట్టచెబుతూనే వున్నారు. కేసు తేలేవరకు రమేశ్ వేరే అమ్మాయిని పెళ్ళి చేసుకోవడానికి వీల్లేదని సరోజ కోర్టు ద్వారా ఉత్తర్వులు పొందింది. అందువల్ల రమేశ్ వేరే పెళ్లి చేసుకోలేక పోయాడు. కేసు పది సంవత్సరాలు నడిచింది. రమేశ్ కు సరోజ నడివయసు వచ్చింది. ఇద్దరు పెళ్ళిళ్ళు లేకుండా అలా ఉండిపోవవసి వచ్చింది. చివరకు పది సంవత్సరాల తర్వాత బలమైన సాక్ష్యాలు లేక పోవడం చేత సరోజ వేసిన కేసు కోర్టు కొట్టివేసింది.

కేసు పోయినందుకు సరోజ ఆమె తల్లి చాలా ఏడ్చారు. ఏం చేయాలో వారికి ఏమాత్రం తోచలేదు. పై కోర్టులో అప్పీల్ చేయాలంటే చాలా డబ్బులు కావాలి. ఇప్పటికే చాలా డబ్బులు ఖర్చు పెట్టారు. ఇంకా డబ్బులు ఖర్చు పెట్టే స్తోమత వారికి లేదు. కేవలం తన కోపం కారణంగా తన కుమార్తె జీవితం నాశనమైనందుకు రాములమ్మ చాలా ఏడ్చింది. ఆమె కోపం ఆమెకు శత్రువయింది. చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకుంటే లాభం లేదన్నట్లుగా ఇప్పుడు బాధపడడం వల్ల ఏమీ ఉపయోగం లేకపోయింది. సరోజ తన గతాన్ని తలుచుకుని తన భవిష్యత్తును గురించి ఆలోచించుకుంటూ నిస్సహాయంగా శూన్యంలోకి చూస్తూ అలా ఉండిపోయింది.

* * *

# తన శాంతమే తనకు రక్ష

నారాయణ రెడ్డి తన భార్య సావిత్రికి చెప్పాడు “మనకున్నది ఒక్క కూతురు. ఈ అమ్మాయిని బాగా చదివించి అమెరికాలో ఉద్యోగం చేస్తున్న అబ్బాయికిచ్చి వివాహం చేయాలని నాకు బాగా ఆశగా ఉంది. అలా చేయాలంటే అమ్మాయి బాగా చదువుకోవాలి. మన పల్లెటూరులో మంచి చదువు లేదు కాబట్టి మనం మన పొలాన్ని గుత్తకిచ్చి కర్నూల్ కు పోదాం. అక్కడ మంచి స్కూల్లో మనమ్మాయిని చేర్పించి బాగా చదివించుదాం. తర్వాత మంచి జూనియర్ కాలేజీలో ఇంటర్మీడియట్ ఎం.పీ.సీ గ్రూప్ లో చదివించాలి. ఆ తర్వాత బీ.టెక్ చదివించి అమ్మాయిని అమెరికాకు ఎం.ఎస్ చేయడానికి పంపించి అమెరికాలో మంచి అబ్బాయిని చూసి పెళ్లి చేయాలని నా కోరిక” అని చెప్పాడు.

అతని మాటలకు భార్య సావిత్రి కూడా సంతోషంగా అంగీకరించింది.

నారాయణ రెడ్డి కర్నూలుకు 30 కిలోమీటర్ల దూరంలో ఉన్న ఒక గ్రామంలో వుంటున్నాడు. అతనికి తన ఊర్లో పెద్దల నుంచి వస్తున్న 30 ఎకరాల పొలముంది. అతను ఇంటర్మీడియట్ వరకు చదువుకున్నాడు. ఆ తరువాత అతను చదువు మానేసి సేద్యం చేసుకుంటున్నాడు. వాళ్ళ ఊరికి కే.సీ కెనాల్ నీళ్లు వస్తాయి. పంటలు బాగా పండుతాయి. నారాయణ రెడ్డి వ్యవసాయం బాగా చేశాడు. అందువల్ల అతను డబ్బులు బాగా కూడబెట్టాడు. అతనికి ఎలాంటి దురలవాట్లు లేవు. ఉత్తముడు. తన విషయం తప్ప ఇతర విషయాలు పెద్దగా పట్టించుకునేవాడు కాదు. పూర్తిగా సానుకూల దృక్పథమున్నవాడు. మిన్ను విరిగి మీద పడినా చెక్కుచెదరని శాంతస్వభావుడు. అతనికి ఒకే ఒక కూతురు, ఆమె పేరు స్నేహలత. ఆమె ప్రస్తుతం ప్రభుత్వ పాఠశాలలో

తొమ్మిదవ తరగతి చదువుతోంది. ఇంటి నుంచి ప్రతిరోజు స్కూలుకు వెళ్లి వస్తూ ఉంది. నారాయణ రెడ్డికి అతని భార్య సావిత్రికి తమ కూతురు స్నేహలత అంటే వల్లమాలిన ప్రేమ. ఒక కూతురు కావడం వల్ల చాలా గారాబంగా పెంచారు. ఆమెకు మంచి చదువులు చెప్పించాలంటే దూరంగా హాస్టల్‌లో ఉంచాలి. కూతురును వదిలిపెట్టి ఉండలేక వాళ్ళు ఆమెను హాస్టల్లో చేర్పించలేదు. అయితే నారాయణ రెడ్డి ప్రస్తుతం ఆమెకు మంచి చదువు చెప్పించాలనుకున్నాడు కాబట్టి పల్లెటూర్లో నివాసం మానేసి కర్నూల్ లో నివాసం వుండాలనుకున్నాడు.

స్నేహలత తొమ్మిదవ తరగతి చదువు పూర్తి కాగానే నారాయణరెడ్డి ఆమెను కర్నూల్‌లోని ఒక మంచి ప్రైవేటు స్కూల్‌లో పదవ తరగతిలో చేర్పించాడు. అంతేకాకుండా ఆమె స్కూల్ దగ్గర ఇల్లు అద్దెకు తీసుకొని అందులోకి భార్యతో సహా మారిపోయాడు.

స్నేహలత పెద్దగా తెలివైనది కాదు. ఆవరేజ్ స్టూడెంట్. అందువల్ల ఆమె పదవ తరగతి 60 శాతం మార్కులతో పాస్ అయింది. నారాయణ రెడ్డి తన కూతురుకు ఎక్కువ మార్కులు రానందుకు ఏ మాత్రం బాధపడలేదు. అతను స్నేహలతను పేరుపొందిన జూనియర్ కళాశాలలో ఎం.పీ.సీ గ్రూప్‌లో చేర్పించాడు. అంతేకాకుండా ఆ కళాశాలకు దగ్గరలోనే ఇల్లు అద్దెకు తీసుకొని అందులోకి మారిపోయి ప్రతిరోజు కూతురు ఇంటి నుంచి కళాశాలకు వెళ్లి వచ్చే ఏర్పాటు చేశాడు. స్నేహలత ఇంటర్మీడియట్ కష్టపడి చదివి 70 శాతం మార్కులతో ఉత్తీర్ణురాలయింది. ఎంసెట్లో ఆమెకు 70 వేలకు పైగా ర్యాంకు వచ్చింది.

నారాయణ రెడ్డి స్నేహలతను పేరుపొందిన ఇంజనీరింగ్ కళాశాలలో బీ.టెక్ కంప్యూటర్ సైన్స్ బ్రాంచ్ లో డొనేషన్ కట్టి చేర్పించాడు. తన నివాసం ఆ కాలేజీ దగ్గరికి మార్చి కూతురు ఇంటి నుంచి వెళ్లి వచ్చేలాగా ఏర్పాటు చేశాడు. నారాయణ రెడ్డి తన కూతురును విడిచిపెట్టి ఉండలేక ఆమె ఎక్కడ చదువుతూ ఉంటే అక్కడికి తన నివాసాన్ని మార్చుకున్నాడు. అతనికి తన కూతురంటే అంత వల్లమాలిన ప్రేమ.

రోజులు సాఫీగా సాగుతున్నాయి. స్నేహలత ఇంజనీరింగ్ మూడో సంవత్సరం పూర్తి చేసింది. ఇంజనీరింగ్ పూర్తయిన తర్వాత నారాయణరెడ్డి ఆమెను అమెరికాలో ఎం.ఎస్. చదివించే ఉద్దేశంలో ఉన్నాడు. అందువల్ల నారాయణ రెడ్డి ఆమెను ఇంజనీరింగ్ నాలుగవ సంవత్సరంలో జీ ఆర్ ఇ, టోఫెల్ పరీక్షలకు కోచింగ్ ఇప్పించి రాయించాడు. వాటిలో ఆమెకు మంచి మార్కులు వచ్చాయి. స్నేహలత ఇంజనీరింగ్ నాలుగవ సంవత్సరం పూర్తి చేసింది. ఇంజనీరింగ్ లో ఆమెకు 67 శాతం మార్కులు వచ్చాయి. తమ కూతురు తాము మొదటినుంచి అనుకుంటున్నట్లుగా అమెరికా వెళ్లి

ఎం.ఎస్ చేస్తుందని నారాయణ రెడ్డి అతని భార్య సంతోష సాగరంలో ఓల లాడుతున్నారు.

అలాంటి సమయంలో స్నేహలత పెద్ద బాంబు పేల్చింది. ఆమె తల్లిదండ్రులకు ఒక ఉత్తరం రాసి పెట్టి ఇంటి నుంచి వెళ్లిపోయింది. ఆ ఉత్తరాన్ని చదివి నారాయణ రెడ్డి అతని భార్య పెద్దగా షాక్ అయ్యారు. వారి కాళ్ళ కింద భూమి కదిలిపోతున్నట్టు అనిపించింది. కాసేపటి వరకు వాళ్ళు ఎక్కడ ఉన్నది వారికి అర్థం కాలేదు. ప్రాణప్రదంగా పెంచుకున్న తమ కూతురు అంత పని చేస్తుందని వారు కలలో కూడా ఎన్నడూ ఊహించలేదు. నారాయణరెడ్డి భార్య స్పృహ తప్పి కుప్పకూలిపోయింది. నారాయణరెడ్డి మొదట తేరుకొని తన భార్యకు అన్ని రకాల సపర్యలు చేసి మెల్లగా ఆమెను స్పృహలోకి తెచ్చాడు. తర్వాత నారాయణ రెడ్డి తన కూతురు రాసిన ఉత్తరాన్ని మళ్లీ ఒకసారి చదువుకున్నాడు.

ప్రియాతి ప్రియమైన తల్లిదండ్రులకు,

కృతఘ్నురాలైన మీ కూతురు రాస్తున్న ఉత్తరం. నేను నా క్లాస్మేట్ ఒక అబ్బాయిని ప్రేమించాను. ఆ అబ్బాయిది మన కులం కాదు. మాల కులం. నాన్నా మీకు నా మీద ఎలాంటి ఆశలున్నాయో నాకు తెలుసు. అందువల్ల మీరు ఆ అబ్బాయిని పెళ్లి చేసుకోవడానికి  అంగీకరించరు. ఈ విషయం నేను నీతో చెప్పలేక చాలా కాలం సతమతమయ్యాను. నేను అతన్ని వదిలిపెట్టి ఉండలేక అతనితోపాటు వెళ్ళిపోతున్నాను. నేను మీ ప్రేమకు ఏమాత్రం అర్హురాలిని కాదు. దయచేసి నన్ను క్షమించండి. నాకోసం వెతక వద్దు. వీలుంటే నేనే వస్తాను. నేను చేసిన ఈ పని మిమ్మల్ని ఎంత బాధ పెడుతుందో నాకు తెలుసు. ముఖ్యంగా అమ్మ ఏమవుతుందోనని నాకు చాలా బాధగా ఉంది. నాన్నా, మీరే అమ్మను ఎలాగైనా ఈ బాధ నుంచి గట్టెక్కించాలి.

మీకు గుండెకోతను కలిగించిన మీ కూతురు

స్నేహలత

నారాయణ రెడ్డి మొదట ఆ షాక్ నుంచి తేరుకున్నాడు. కూతురు చేసిన ఆ పని గురించి ఎవరికీ చెప్పకూడదని నిశ్చయించుకున్నాడు. తర్వాత అతను భార్యను సముదాయించే ప్రయత్నం చేశాడు. ఆమె నిద్రాహారాలు లేక మంచం పట్టింది. నారాయణ రెడ్డి అన్ని పనులు మానేసి ఆమె వద్దనే ఉండి కంటికి రెప్పలా అమెను చూసుకుని ఆ షాక్ నుంచి కోలుకునే లాగా చేశాడు.

ఆమె భర్తతో మన అమ్మాయి ఎక్కడ ఉందో ఎలా ఉందో ఎన్ని కష్టాలు పడుతుందో తెలియడం లేదు. మీరు ఎలాగైనా వెతికించండి అని చెప్పింది.

కానీ నారాయణ రెడ్డి అందుకు అంగీకరించలేదు.

"మనం వెతికించే ప్రయత్నం చేస్తే అమ్మాయి విషయం అందరికీ తెలిసిపోతుంది. అది ఎవరికీ తెలియకూడదు. మనం ఎవరికి అన్యాయం చేయలేదు. మనకు కూడా అన్యాయం జరగదు. జీవితంలో ఇలాంటి దుర్ఘటనలు జరుగుతూ ఉంటాయి. ఇలాంటి సమయంలోనే మనం మనసు గట్టి చేసుకుని భయపడకుండా ఉండాలి. మనం సానుకూల దృక్పథంతో ఉండాలి. అలా ఉంటే మనకు ఏమీ కాదు. ఎలాంటి అన్యాయం జరగదు. నాకు గట్టిగా నమ్మకముంది, మన అమ్మాయి తప్పనిసరిగా మన దగ్గరికి వస్తుంది. మన ఆశలను ఆశయాలను తప్పకుండా నెరవేర్చుతుంది, ఈ విషయంలో నువు ఎలాంటి ఆందోళన చెందవద్దు. మన అమ్మాయి వెళ్లిపోయిన విషయం మన ఇద్దరికీ తప్ప ఎవరికీ తెలియకూడదు. కొద్ది రోజులు ఓపిక పట్టు, అన్ని విషయాలు చక్కబడతాయి." అని నారాయణ రెడ్డి ఆమెకు గట్టిగా మళ్లీ మళ్లీ ఉద్బోధ చేశాడు.

అతని మాటలు విన్న తర్వాత ఆమె కూడా కొంతవరకు తేరుకుని మెల్లమెల్లగా మామూలు మనిషి అయింది. చుట్టుపక్కల వాళ్ళు తమ కూతురును గురించి ప్రశ్నించగా ఆమె హైదరాబాదులో ఉండి ఉద్యోగ ప్రయత్నం చేస్తోందని చెప్పారు. ఇలాగా మూడు నెలల కాలం గడిచిపోయింది. నారాయణ రెడ్డి తప్పనిసరిగా తన కూతురు వస్తుందని గట్టిగా నమ్మకంతో ఉన్నాడు. అతని నమ్మకం వమ్ము కాలేదు

ఒక రోజు స్నేహలత తండ్రికి ఫోన్ చేసింది. మాట్లాడలేక అదేపనిగా దుఃఖిస్తూ ఉంది. నారాయణరెడ్డి ఆమెను ఓదార్చి ఎక్కడున్నావో చెప్పమన్నాడు. ఆమె కర్నూలు బస్టాండ్‌లో వున్నానని చెప్పింది. వెంటనే నారాయణ రెడ్డి బస్టాండ్ దగ్గరకి వెళ్లి ఆమెను కలుసుకుని అక్కడ ఏమి మాట్లాడకుండా ఇంటికి తీసుకొని వచ్చాడు. స్నేహలత శారీరకంగా మానసికంగా చిక్కిపోయివుంది. రెండు రోజులపాటు ఆమెకు పూర్తి విశ్రాంతినిచ్చి తమ ప్రేమతో ఆమె కోలుకునేలా చేశారు దంపతులు.

ఆ తర్వాత ఏం జరిగిందో చెప్పుమని నారాయణ రెడ్డి ఆమెను అడిగాడు.

స్నేహలత చెప్పింది.

"ఆ అబ్బాయి పేరు వెంకటేశ్వర్లు. నా క్లాస్మేట్ ,చాలా మంచివాడు, అందంగా వుంటాడు, ఎందుకో అతను నాకు చాలా బాగా నచ్చాడు, నేనే మొదట అతన్ని ప్రేమించాను. నా ప్రేమను గురించి చెబితే అతను కూడా నన్ను ప్రేమించాడు. బీ.టెక్ నాల్గవ సంవత్సరం నుంచి ప్రేమించుకోవడం మొదలు పెట్టాం. రహస్యంగా కలుసుకునేవాళ్ళం. బీ.టెక్ తర్వాత మీరు నన్ను అమెరికా పంపిస్తున్నారని తెలిసి అతన్ని విడిచి ఉండలేక అతనితో కలిసి వాళ్ల ఊరికి వెళ్లాను. వాళ్ళ ఊరు నంద్యాల,

చాలా పేద వాళ్ళు, ఇల్లు చాలా చిన్నది, నన్ను వాళ్ళ బంధువుల అమ్మాయి అని తెలిసిన వాళ్లకు చెప్పారు. ఆఇంట్లో వుండడం చాలా కష్టంగా తోచింది. తినడానికి మూడు పూటల ఆహారం కూడా లేదు. అబ్బాయి ఉద్యోగం కోసం ప్రయత్నించాడు కానీ ఉద్యోగం దొరకలేదు. నేను వాళ్ల దగ్గర ఉండలేనని అర్థమైంది. అదే విషయం నేను ఆఅబ్బాయితో అతని తల్లిదండ్రులతో చెప్పాను. వాళ్ళు చాలా మంచివాళ్ళు. నా పరిస్థితి అర్థం చేసుకొని వెంటనే వెళ్లిపొమ్మని చెప్పారు. నేను అబ్బాయిని పెళ్లి చేసుకోలేదు. మీరు నన్ను ఎంతగా ప్రేమిస్తున్నారో నాకు తెలుసు. నన్ను మీరు తప్పనిసరిగా క్షమిస్తారని నేను వెంటనే కర్నూల్‌కు వచ్చి మీకు ఫోన్ చేశాను”అని స్నేహలత చెప్పింది.

నారాయణ రెడ్డి అతని భార్య కూతురిని కౌగలించుకుని ఆమె మంచి పని చేసిందని మెచ్చుకున్నారు. ఆ తర్వాత అతన్ని మరచిపోమని చెప్పారు. అతనితో ప్రేమ ఒక పీడ కలగా భావించమని చెప్పారు. ఆమె కూడా తప్పనిసరిగా మర్చిపోతానని చెప్పింది.

నారాయణ రెడ్డి వెంటనే కారు మాట్లాడుకుని భార్యను కూతురును తీసుకుని హైదరాబాదుకు వెళ్ళాడు. అక్కడ ఒక హోటల్ దిగి ఇల్లు అద్దెకు తీసుకొని భార్యను కూతురిని అద్దె ఇంట్లో ఉంచి తాను మాత్రం కర్నూల్ కు వచ్చి కర్నూల్ లో ఉన్న తన ఇంటి సామాను మొత్తాన్ని హైదరాబాదుకు మార్చాడు. తర్వాత స్నేహలతను అమెరికాలోని యూనివర్సిటీల్లో ఎం.ఎస్ చేయడానికి దరఖాస్తు చేయించాడు. ఆమెకు రెండు మూడు యూనివర్సిటీల్లో సీటు వచ్చింది. వెంటనే తన కూతురును నారాయణ రెడ్డి అమెరికాకు పంపించాడు.

స్నేహలత రెండు సంవత్సరాలు కష్టపడి ఎం.ఎస్. పాస్ అయి అక్కడే ఉద్యోగం సంపాదించింది. నారాయణ రెడ్డి మాట్రిమోనియల్ సంస్థల ద్వారా అమెరికాలో స్థిరపడిన రెడ్డి కుటుంబంలోని ఒక అబ్బాయికి తన కూతురునిచ్చి పెళ్లి చేశాడు. పెళ్లి అమెరికాలో జరిగింది. నారాయణరెడ్డి దంపతులు తమ కూతురు పెళ్లికి అమెరికాకు వెళ్లి రెండు నెలలు అక్కడే సంతోషంగా గడిపారు. ఆ తర్వాత నారాయణ రెడ్డి భార్యతో కలిసి ఇండియాకు వచ్చి తన సొంత ఊరులో స్థిరపడ్డాడు.

నారాయణ రెడ్డి తన కూతురు చేసిన పనికి కోపపడకుండా ప్రశాంతంగా ఆలోచించి ఆమె జీవితాన్ని తన ఆశయాలకు అనుగుణంగా మార్చుకోగలిగాడు. అతని స్థానంలో ఎవరైనా కోపిష్టి వాళ్ళుంటే వెళ్లిపోయిన తమ కూతురు కోసం పోలీస్ స్టేషన్లో కంప్లైంట్ చేసి అబ్బాయిని పట్టుకుని కొట్టడమో చంపడమో చేసేవారు. దానివల్ల కేసులు కోర్టులు శిక్షలు మొదలైనవి జరిగేది. లాయర్ల చుట్టూ తిరగవలసి

వచ్చేది. చాలా డబ్బు ఖర్చు అయ్యేది. దానివల్ల అమ్మాయి బ్రతుకు చిందరవందర అయ్యేది. తమ కుటుంబం పరువు పూర్తిగా పోయేది. నారాయణ రెడ్డి అలా చేయకుండా ప్రశాంతంగా ఆలోచించి తన పరువు కాపాడుకోవడమే కాకుండా తన కూతురు జీవితాన్ని సుఖమయం చేయగలిగాడు.

అతని శాంతమే అతనికి రక్ష అయింది.

స్నేహలత గర్భవతి అయినప్పుడు నారాయణ రెడ్డి దంపతులు ఆమెకు సాయంగా అమెరికా వెళ్ళారు. మొదటి కాన్పులో ఆమెకు కొడుకు పుట్టాడు. నారాయణ రెడ్డి దంపతులు చాలా సంతోషించారు. వారు ఆరు నెలలు అక్కడే కూతురుకు సాయంగా వున్నారు.

తన జీవితం నాశనం కాకుండా కాపాడిన తల్లిదండ్రులను స్నేహలత అపరిమితమైన భక్తి శ్రద్ధలతో దేవతల లాగా చూస్తూవుంది.

రెండవ కాన్పులో ఆమెకు కూతురు పుట్టినప్పుడు గూడా నారాయణరెడ్డి దంపతులు ఆమెకు సాయంగా వెళ్ళారు. ఆతర్వాత వారు సంవత్సరానికి ఒకసారి అమెరికా వెళ్లి రెండు మూడు నెలలు తమ కూతురు అల్లుడు మనుమడు మనుమరాలుతో సుఖంగా గడిపివస్తున్నారు.

వారి జీవితం వారి అమ్మాయి జీవితం సుఖంగా సాగిపోతూవుంది.

* * *

# అడకత్తెరలో పోకచెక్క

విజయలక్ష్మి పరిస్థితి అడకత్తెరలో పోకచెక్క లాగా అయిపోయింది. ఒకవైపు తనను ప్రాణాధికంగా ప్రేమించే భర్త, అతని కుటుంబం, మరొక వైపు తాను కోరుకున్న ప్రియుడు. ఎవరి వైపు ఉండాలో ఆమె నిర్ణయించుకోలేక పోతూవుంది. ఆమె మనసు తక్కెడలోని ముల్లు లాగా అటు ఇటు ఊగిసలాడుతూ వుంది. ఏమి చేయాలో తేల్చుకోలేక సతమతమవుతూ నరకమనుభవిస్తూ వుంది. తనవాళ్లు చెబుతున్నట్లుగా మద్దిలేటి మీద కేసు పెడితే అది తప్పుడు కేసు అవుతుంది, కాబట్టి అది తనకు ఇష్టం లేదు. కేసు పెట్టకపోతే తన ఉనికికే ప్రమాదం వస్తుంది. అందువల్ల ఆమె ఏమి చేయాలో తీవ్రంగా ఆలోచించుకుంటూ ఉంది.

విజయలక్ష్మి ఒక చిన్న గ్రామంలో పుట్టి పెరిగింది. చాలా అందంగా ఉంటుంది. ఆమె తల్లిదండ్రులు ఆమెను వారి గ్రామానికి దగ్గరలో ఉన్న ఓబులేసు అనే అతనికిచ్చి పెళ్ళి చేశారు. ఓబులేసుకు భార్య మీద చెప్పలేనంత ప్రేమ. ఓబులేసు ఇంటి పక్కనే అదే కులానికి చెందిన మద్దిలేటి అనే యువకుని కుటుంబం ఉంది. పల్లెటూరు కావడం పైగా ఒకే కులం కావడంతో విజయలక్ష్మి మద్దిలేటి తల్లితో మాట్లాడడానికి అతని ఇంటికి వస్తూ పోతూ ఉండేది. మద్దిలేటి వ్యాయామం చేసిన దేహంతో మంచి బలిష్టంగా అందంగా ఉంటాడు. అతనికి పెళ్లి కాలేదు. తన ఇంటికి వస్తూ పోతున్న విజయలక్ష్మితో మద్దిలేటి పరిచయం పెంచుకున్నాడు. కొంతకాలానికి పరిచయం కాస్త ప్రేమగా మారి వారిద్దరి మధ్య వివాహేతర సంబంధం ఏర్పడింది. వాళ్ళిద్దరూ రహస్యంగా కలుసుకునేవారు. కొత్త మోజులో రహస్యంగా కలుసుకోవడంతో తృప్తిపడక మద్దిలేటి ఆమెను లేవదీసుకుని పోయాడు. ఈ సంఘటనను ఓబులేసు అతని

అమ్మానాన్నలు చాలా అవమానంగా భావించి ఊర్లో తలెత్తుకుని తిరగలేక పోయారు. ముఖ్యంగా ఓబులేసు ఈ సంఘటనతో చాలా షాక్ అయ్యాడు. తాను ఎంతగానో ప్రేమించిన తన అందమైన భార్య పరాయి మగాడితో లేచిపోయినందుకు అతనికి మతిపోయినంతపనైంది. అన్నం నీళ్లు అతనికి సహించలేదు. రెండు మూడు రోజుల పాటు మామూలు మనిషి కాలేకపోయాడు. అతని తల్లిదండ్రులు ఓబులేసును అనేక రకాలుగా ఓదార్చే ప్రయత్నం చేశారు.

విజయలక్ష్మి పుట్టింటి వాళ్ళు గూడా ఓబులేసు వద్దకు వచ్చి అతన్ని ఓదార్చారు. తమ కూతురును బూతులు తిట్టారు. అట్లాంటి కూతురును కన్నందుకు తమను తాము తిట్టుకున్నారు. అయితే ఓబులేసు తన భార్యను ఒక్క మాటతో కూడా నిందించలేదు. ఆమె అమాయకురాలని మద్దిలేటి గాడే ఆమెకు మాయమాటలు చెప్పి లోబర్చుకొని లేవదీసుకు పోయాడని ఆమె తిరిగి వస్తే తాను ఆమెను భార్యగా స్వీకరిస్తానని చెప్పాడు. విజయలక్ష్మి తల్లిదండ్రులు అతని మంచితనాన్ని నెమ్మదితనాన్ని మెచ్చుకొని ఎక్కడున్నా తమ కూతురిని తీసుకొని వస్తానని చెప్పారు. అంతేకాకుండా విజయలక్ష్మి కోసం ఆమె అమ్మా నాన్న అన్నదమ్ములు చుట్టుపక్కలంతా వెదికారు. ఎక్కడా విజయలక్ష్మి మద్దిలేటిల ఆచూకి తెలియలేదు. సుమారు పది రోజులయింది.

పది రోజుల తర్వాత విజయలక్ష్మి ఒక్కతే తిరిగి వచ్చింది. ఆమె నీరసంగా బట్టలు మాసిపోయి తల విరబోసుకొని ఉంది. మతిస్థిమితం లేని దానిలాగా ఉంది. ఓబులేసు అమ్మా నాన్నలు, అత్తామామలు విజయలక్ష్మిని నానా బూతులు తిట్టారు. విజయలక్ష్మి అమ్మానాన్నలు ఆమెను గట్టిగా కొట్టారు. "మద్దిలేటి గానితో లేచిపోయి పుట్టింటి పరువు మెట్టినింటి పరువు తీశావు. సంసారం చేసే ఆడది చేసే పనేనా ఇది, ఇన్నాళ్లు ఎక్కడున్నావ్, మద్దిలేటి గాడు ఏడి? వాడు కనిపిస్తే ముక్కలు ముక్కలు కింద నరికి పారేస్తాం. వాడెక్కడున్నాడో చెప్పు" అని కోపంతో ప్రశ్నించారు.

తల్లిదండ్రుల మాటలు విన్న విజయలక్ష్మి వారి మాటలు అర్థం కానట్టు తనకేమీ తెలియనట్లు వారి వైపు పిచ్చి చూపులు చూస్తూ మౌనం గా నిలబడింది. ఎంత తిట్టినా కొట్టినా ఆమె మారు మాట్లాడకుండా భరిస్తూ అలా శూన్యంలోకి చూస్తూ ఉండిపోయింది. ఆమెను ఆమె పరిస్థితిని గమనించిన ఓబులేసు ఆమెకు నిజంగా మతి తప్పిందని భావించాడు. తన తల్లిదండ్రులను అత్తమామలు ఆమెను తిట్టకుండా కొట్టకుండా వారించాడు. ప్రస్తుతం ఆమె మన లోకంలో లేదు, రెండు మూడు రోజులు పోయిన తర్వాత ఆమె మనం లోకంలోకి వచ్చిన తర్వాత అన్ని విషయాలు తెలుసుకుందామని చెప్పాడు. దానితో అందరూ విజయలక్ష్మిని తిట్టడం కొట్టడం మానేశారు.

విజయలక్ష్మి రాత్రిపూట లేచి నిద్రలో బయటికి నడుస్తూ వెళ్ళేది. ఇంట్లోవాళ్ళు వెంటనే మేలుకొని ఆమెను తీసుకుని వచ్చే వాళ్ళు. తర్వాత ఆమె మెల్ల మెల్లగా కోలుకోవడం ప్రారంభించింది. అయితే రాత్రిపూట నిద్రలో నడిచే ప్రయత్నం మాత్రం చేస్తూనే ఉంది. ఒక్కొక్కసారి ఏమీ గుర్తు లేనట్టుగా పిచ్చి చూపులు చూస్తూ ఉండిపోతుంది. వారం రోజులకు ఆమె చాలా వరకు కోలుకుంది. అప్పుడు ఆమె తల్లిదండ్రులు ఎక్కడికి వెళ్లావు అని అడిగారు. విజయలక్ష్మి చెప్పింది.

"ఏం జరిగిందో నాకు తెలియదు, నాకు తెలివి వచ్చేటప్పటికి ఏదో ఊర్లో వున్నాను, నేను అక్కడ ఎందుకున్నానో జ్ఞాపకం చేసుకుంటూ ఉంటే మళ్లీ నాకు జ్ఞాపక శక్తి తొలగిపోయి ఏదీ గుర్తుకు వచ్చేది కాదు. నేను మన ఇంటికి ఎలా వచ్చానో కూడా తెలియదు. నాకు కొంచెం సేపు అంతా గుర్తు ఉంటుంది, ఆ తర్వాత ఏమీ గుర్తుండటం లేదు. ఆకస్మాత్తుగా నాకు ఇలాంటి జబ్బు ఎలా వచ్చిందో ఎందుకొచ్చిందో తెలియడం లేదు" అని చెప్పింది.

ఆమె చెప్పింది విని ఇంట్లో వాళ్ళందరూ ఆశ్చర్యపోయారు. ఆమె నిజం చెబుతుందా లేక అబద్ధమాడుతుందా? వాళ్లకి ఏమీ అర్థం కాలేదు. విజయలక్ష్మి చెప్పిన మాటలు కొందరు నమ్మారు. కొందరు నమ్మలేదు. కొద్ది రోజులు చూసిన తర్వాత అప్పుడు ఆలోచిద్దామని అనుకున్నారు.

విజయలక్ష్మి చేసిన ఆ ప్రయత్నమంతా మద్దిలేటి ప్రణాళిక. మద్దిలేటి ఒక ప్రణాళిక వేసుకొని దాని ప్రకారం ఆమె ఎలా ప్రవర్తించాలో అంతా వివరంగా చెప్పి ఆమెను మొదట ఇంటికి పంపించాడు. అతను చెప్పినట్లుగా ఆమె జాగ్రత్తగా నటించింది. వారం రోజుల తర్వాత మద్దిలేటి ఇంటికి వచ్చాడు. ఊర్లో వాళ్లు ఎక్కడికి వెళ్ళావు అని అడిగితే హైదరాబాదుకు ఉద్యోగ ప్రయత్నం కోసం వెళ్లానని చెప్పాడు. అతని మాటలు కొందరు నమ్మారు కొందరు నమ్మలేదు. ఓబులేసు కుటుంబ సభ్యులు అతన్ని ఏమీ అనలేదు.

కొద్దిరోజుల తర్వాత విజయలక్ష్మి మద్దిలేటి తమ సంబంధాన్ని మళ్లీ మొదలు పెట్టారు. ఒక రోజు వాళ్ళిద్దరు కలిసి ఉండగా ఓబులేసు తల్లి చూసి పట్టుకుంది. ఓబులేసు అమ్మానాన్నలు విజయలక్ష్మి తల్లిదండ్రులను పిలిపించారు. విజయలక్ష్మి తల్లిదండ్రులు ఆమెను గట్టిగా తిట్టారు.

"మా కడుపున చెడపుట్టావు కదే, మా ఇంటా వంటా లేని పాపిష్టి పని చేశావు, మేము సమాజంలో తల ఎత్తుకొని ఎట్లా తిరగాలి, నిన్ను చంపి పోగులు పెట్టినా

పాపం లేదు, ఎంత మంచి భర్త, ఎంత మంచి అత్తమామలు, వాళ్ల గౌరవాన్ని మంట కలిపావు, నిన్ను ఏం చేసినా పాపం లేదు"అని ఆమె తల్లిదండ్రులు చాలా గట్టిగా తిట్టారు.

విజయలక్ష్మి వారి తిట్లను మౌనంగా భరించింది.

ఓబులేసు అమ్మానాన్నలు విజయలక్ష్మికి విడాకులు ఇవ్వమని ఓబులేసుకు చెప్పారు. ఓబులేసు దానికి అంగీకరించలేదు.

"విజయలక్ష్మి ఒక పని చేస్తే మేము ఆమెను మా ఇంట్లో ఉంచుకుంటాము, లేకపోతే ఆమెను మా ఇంట్లో ఉంచుకోము. మద్దిలేటి తన మీద అత్యాచారం చేయడానికి ప్రయత్నించాడని విజయలక్ష్మి మద్దిలేటి మీద పోలీస్ స్టేషన్‌లో కంప్లైంట్ చేయాలి. అలా చేస్తేనే మా ఇంట్లో ఆమెను ఉంచుకుంటాము" అని ఓబులేసు అమ్మానాన్నలు గట్టిగా చెప్పారు.

"అవును, అది ముమ్మాటికీ చేయాలి. పరాయి స్త్రీతో సంబంధం పెట్టుకున్న ఆ మద్దిలేటిగాన్ని కోర్టుకీడ్చి జైలు శిక్ష పడేలాగా చేయాలి, వాన్ని వదలిపెట్టగూడదు" అని ఓబులేసు, విజయలక్ష్మి తల్లిదండ్రులు గూడా గట్టిగా చెప్పారు.

చెప్పడమే గాకుండా ఓబులేసు, అతని అమ్మానాన్నలు, విజయలక్ష్మి తల్లిదండ్రులు మద్దిలేటి మీద కేసు పెట్టాలని ఆమె మీద గట్టిగా వత్తిడి తెచ్చారు.

ఈ పరిస్థితిలో విజయలక్ష్మికి ఏం చేయాలో తోచడం లేదు. మద్దిలేటి మీద పోలీస్ కేసు పెట్టకుంటే అత్తమామలు తనను ఇంట్లోకి రానివ్వమని అంటున్నారు. మద్దిలేటి మీద పోలీస్ కేసు పెట్టడం అన్యాయమని తన మనసు చెబుతోంది. ఎందుకంటే అతనితో సంబంధం పెట్టుకోవడంలో తన తప్పు ఉంది. ఇద్దరూ కలిసి ఆ తప్పు చేశారు. అతని మీద కేసు పెడితే అది తప్పుడు కేసు అవుతుంది.

బాగా ఆలోచించిన తర్వాత ఆమె తన వాళ్ళతో చెప్పింది.

"మీరందరూ మద్దిలేటి మీద కేసు పెట్టమంటే నేను కేసు పెడతాను. కానీ అది అంత మంచిది కాదని నాకు అనిపిస్తూ వుంది. ఎందుకంటే నేను కేసు పెట్టిన తర్వాత ఆ కేసు నిజమేనా? లేక తప్పుడు కేసా అని పోలీసులు ఎంక్వైరీ చేస్తారు. పోలీస్ వాళ్లు మన ఊర్లో మన ఇంటి చుట్టుపక్కల ప్రజలను కలిసి అన్ని విషయాలు తెలుసుకుంటారు. మన చుట్టుపక్కల వాళ్ళు నాకు మద్దిలేటికి మధ్య ఉన్న సంబంధం గురించి చెబితే నేను పెట్టిన కేసు తప్పుడు కేసు అని వాళ్ల రిపోర్ట్‌లో రాస్తారు. అలా

రాస్తే మద్దిలేటి శిక్ష పడకపోగా తప్పుడు కేసు పెట్టినందుకు నాకు జరిమానా వేసే అవకాశముంది. అందువల్ల మనం మద్దిలేటి మీద కేసు పెట్టకుండా ఉంటేనే మనకు మంచిది. నేను ఇక మద్దిలేటి గాని మొహం చూడదలుసుకోలేదు. అందువల్ల మనం ఈవూరు నుంచి సంసారం వేరే ఊరికి మారిస్తే ఈ సమస్య పరిష్కారమవుతుంది. మీరు ఆ దిశగా ఆలోచిస్తే బాగుంటుంది" అని విజయలక్ష్మి తన వారికి చెప్పింది.

విజయలక్ష్మి చెప్పింది విన్న తర్వాత ఆమె తల్లిదండ్రులు అత్తమామలు ఆమె చెప్పినట్లు చేయాలా? వద్దా? అనే ఆలోచనలో పడిపోయారు.

ఓబులేసు ఆమె చెప్పినట్లు చేయాలని నిర్ణయించుకున్నాడు.

* * *

# రాజీ

రాజకుమారికి ఏం చేయాలో అర్థం కాలేదు. ఆమెకు తన భవిష్యత్తు అగమ్యగోచరంగా తోచింది. తను బాగా చదువుకుని ఉంటే ఏదో ఒక ఉద్యోగం చూసుకొని తన కాళ్ల మీద తాను నిలబడగలిగేది. తాను కేవలం పదవ తరగతి వరకు మాత్రమే చదువుకుంది. ఆ చదువుకు తనకు ఏ ఉద్యోగం వస్తుంది? తన తల్లితండ్రులు పేదవారు కావడం చేత ఆపైన చదివించ లేకపోయారు. బాగా చదువుకోవాలని ఆమెకు చాలా ఆశగా ఉండేది. తన ఆశలను అడియాశలు చేస్తూ తండ్రి తనకు పెళ్లి చేశాడు. తండ్రి మాటకు తలవొగ్గి తలవంచుకొని తాళి కట్టించుకుంది. తనకు తాళి కట్టిన వాడు ఇంత దుర్మార్గుడని ఆమె ఊహించలేక పోయింది. తాను ఒక్కతే అయివుంటే ఎలాగో ఒకలాగా తన జీవితాన్ని గడిపేది. ఇప్పుడు తనకు ఒక కుమారుడున్నాడు, వాన్ని ఎలా పెంచాలి, ఎలా చదివించాలి, వాని భవిష్యత్తును ఎలా తీర్చిదిద్దాలి ఆమెకు ఏమీ పాలుపోలేదు. ఆమె తన భవిష్యత్తును గురించి  ఆలోచిస్తూ గతాన్ని గుర్తు చేసుకుంది.

ఆమె గతం.

రాజకుమారి తండ్రి నానారావు. అతను విజయనగరం జిల్లాలో మారుమూల పల్లెటూరులో నివసిస్తున్నాడు. పేదవాడు, అతను తన ఊరికి దగ్గరలో వున్న ప్రభుత్వ వున్నత పాఠశాలలో తన  కూతురు రాజకుమారికి పదవ తరగతి వరకు చదువు చెప్పించాడు. ఆ తర్వాత చదివించలేక అష్టకష్టాలు పడి శంకర్రావు అనే కుర్రవానికిచ్చి పెళ్ళి జేశాడు. శంకర్రావు ఇంటర్మీడియట్‌వరకు చదువుకొని వ్యవసాయం చేస్తున్నాడు. అతనికి అన్న ఉన్నాడు. వారిద్దరికీ కలిపి ఇరవై ఎకరాల పొలముంది. ఇద్దరూ కలిసి

ఉంటున్నారు. అన్నకు పెళ్లయింది. ఇద్దరు కొడుకులున్నారు. ఇద్దరూ చిన్నపిల్లలు. శంకర్రావు భాగానికి 10 ఎకరాల పొలం వస్తుందని ఆశపడి నానారావు అతనికి తన కూతురునిచ్చి పెళ్లి చేశాడు.

రాజకుమారి కాపురానికి వెళ్ళింది. శంకర్రావు ఆమెను మామూలుగా చూసుకునేవాడు. ఆమె పట్ల పెద్దగా ప్రేమను చూపించేవాడు కాదు. శంకర్రావు అన్న రామారావు వదిన అన్నపూర్ణ కూడా రాజకుమారి పట్ల అంటీముట్టనట్లు ఉండేవారు. వాళ్ళు ముగ్గురు చాలా చనువుగా ఉండేవాళ్ళు. శంకర్రావు తన అన్న కొడుకులను బాగా చూసుకునే వాడు. రామారావు తరచుగా విజయనగరం ఆస్పత్రికి వెళ్లి మందులు తెచ్చుకొని మింగుతూ ఉండేవాడు. అయితే అతని అనారోగ్యమేమిటో శంకర్‌రావు గానీ రామారావు గాని అన్నపూర్ణ గానీ రాజకుమారికి తెలియనిచ్చే వాళ్ళు కాదు. రహస్యంగా ఉంచేవాళ్లు. ఇరుగుపొరుగు వాళ్ళ వల్ల శంకర్రావు అన్న ఏదో పెద్ద జబ్బుతో బాధపడుతున్నాడని రాజకుమారి తెలుసుకుంది. శంకర్రావు అన్నపూర్ణ పట్ల చూపిస్తున్న చనువు మామూలు చనువని రాజకుమారి మొదట్లో భావించింది. కానీ అది మామూలు చనువు కాదు. వాళ్ళిద్దరికీ సంబంధముందని ఆ సంబంధం గురించి రామారావుకు తెలుసని కూడా ఆమె తొందరగానే గ్రహించింది. రాజకుమారి ఆ విషయం గురించి భర్తను ప్రశ్నించింది. శంకర్రావు ఆమె అడిగిన దాన్ని చాలా తేలిగ్గా తీసుకొని అలాంటిదేమీ లేదని మొదటినుంచి అన్నపూర్ణతో చాలా చనువుగా ఉంటున్నానని ఆ విషయంలో ఎలాంటి అనుమానం పెట్టుకోవద్దని రాజకుమారికి చెప్పాడు. రాజకుమారి అతని మాటలను నమ్మలేదు.

ఈలోగా రాజకుమారి గర్భవతి అయి పుట్టింటికి కాన్పుకు వెళ్ళింది. పుట్టింటికి వెళ్ళిన రాజకుమారిని గురించి శంకర్రావు పట్టించుకోలేదు. ఆమెకు కొడుకు పుట్టాడు. కొడుకు పుట్టిన తర్వాత ఒకసారి మాత్రమే శంకరరావు వచ్చి చూసి వెళ్ళాడు. భర్త ప్రవర్తన రాజకుమారికి చాలా అసహనంగా ఉంది. తండ్రి బాధ పడతాడని ఆమె నానారావుకు ఈ విషయాలేమీ చెప్పలేదు. అమె కాన్పు అయిన నెల రోజులకు రామారావు చనిపోయాడు. రాజకుమారి వెళ్లలేకపోయింది. ఆమె తండ్రి వెళ్ళి వచ్చాడు.

రాజకుమారి కాన్పు అయి ఆరు నెల్లయింది. శంకర్రావు మళ్లీ ఒక్కసారి కూడా ఆమె దగ్గరకు రాలేదు. రాజకుమారి రెండు మూడు సార్లు తనను కుమారుని తీసుకుని వెళ్ళమని ఫోన్ చేసింది. అప్పుడు శంకర్రావు వచ్చి ఆమెను కుమారుని తన ఇంటికి తీసుకొని వెళ్ళాడు. కానీ ఆమెను ఆమె కుమారుని అసలు పట్టించుకోవడం మానేశాడు. చులకనగా చూడటం అవమానించడం కూడా మొదలు పెట్టాడు. ఎక్కువగా వదిన అన్నపూర్ణతో ఆమె కుమారులతో ఉంటున్నాడు. అంతకుముందు ఆమెను

వదిన అని పిలిచేవాడు. ఇప్పుడు వదిన అని పిలవడం మానేసి అన్నపూర్ణ అని పేరు పెట్టి ఆమెను పిలుస్తున్నాడు. రాజకుమారి ఆ విషయాన్ని గురించి ప్రశ్నించగా తాను అన్నపూర్ణతోనే ఉంటానని, ఆమె పిల్లలు తన పిల్లలేనని వాళ్లు తనకు పుట్టిన వాళ్ళేనని తెగేసి చెప్పాడు. అంతేకాకుండా నువ్వు ఉంటే ఉండు లేకపోతే లేదు అని గూడా చెప్పాడు.

అతని మాటలకు ఆమె హతాశురాలయింది. నిశ్చేష్టురాలయింది. కాసేపు ఏమీ మాట్లాడ లేకపోయింది. తాను వింటున్నది నిజమా? లేక కలా? అని తెలుసుకో లేక పోయింది. తర్వాత మెల్లగా తేరుకొని "మీవదినతోనే ఉండాలనుకునే వాడివి నన్నెందుకు పెళ్లి చేసుకున్నావు? నా జీవితాన్ని ఇలా ఎందుకు నాశనం చేశావు? నాతో ఎందుకు కొడుకును కన్నావు? ఇప్పుడు నా పరిస్థితి ఏమిటి? కొడుకు పరిస్థితి ఏమిటి?" అని ఆమె ఆక్రోశంతో శంకర్రావును ప్రశ్నించింది.

"నీకేం తక్కువయింది, నీపరిస్థితి బాగానే ఉంది, ఇప్పుడు ఉన్నట్లుగానే నువ్వు నీ కొడుకు ఉండండి." అని శంకర్రావు నిర్లక్ష్యంగా మాట్లాడి అక్కడి నుంచి వెళ్లిపోయాడు.

తన భర్త శంకర్రావు ఇంత కఠినంగా నిర్లజ్జగా నీచంగా దుర్మార్గంగా మాట్లాడతాడని ఆమె ఊహించలేకపోయింది. ఇప్పుడు తానేం చేయాలి? తన భవిష్యత్తు ఏమిటి ? అనే విషయం గురించి ఆమె ఆలోచించుకుంటూ వుంది. తన ఎదుటనే శంకర్రావు అన్నపూర్ణతో గడపడం ఆమె జీర్ణించుకోలేక పోయింది. భర్త నిర్లక్ష్యానికి గురై అతనిచేత అవమానింపబడుతూ ఆ ఇంట్లో ఉండటం ఆమె వల్ల కాలేదు.

ప్రస్తుతం.

రాజకుమారి తన తల్లిదండ్రులకు ఈ విషయమంతా చెప్పి వారి సలహా తీసుకోవాలని నిర్ణయించుకుంది. తాను పుట్టింటికి వెళ్లి వస్తానని శంకర్రావుకు చెప్పింది. ఎందుకు? అని అతను అడిగాడు. అవసరమైన పని ఉందని ఆమె చెప్పింది, అతను సరే అన్నాడు.

రాజకుమారి మరుసటి రోజు పుట్టింటికి బయలుదేరి వెళ్ళింది. తల్లిదండ్రులు ఇద్దరినీ కూర్చోబెట్టి మొదటి నుంచి జరిగిన విషయాలన్నీ చెప్పి ఏం చేయాలో తనకు అర్థం కావడం లేదని చెప్పింది. తండ్రి నానారావు తనకు తెలిసిన లాయరు ఉన్నాడని అతని దగ్గరికి వెళ్ళి సలహా తీసుకుందామని అన్నాడు. దానికి ఆమె అంగీకరించింది.

మరుసటి రోజు నానారావు రాజకుమారి లాయర్ దగ్గరికి వెళ్లి విషయమంతా చెప్పారు. లాయర్ నానారావుకు బాగా తెలిసిన వాడు. అతను ఆమె సమస్యకు

మూడు మార్గాలు చెప్పాడు. లాయర్ చెప్పిందంతా విని తండ్రి కూతురు ఇంటికి వచ్చారు. రాజకుమారి ఆ మూడు మార్గాల గురించి ఆలోచించసాగింది.

లాయర్ చెప్పిన మొదటి మార్గం.

రాజకుమారి భర్త ఇంట్లో నుంచి పుట్టింటికి వెళ్లి తనను భర్త శంకర్రావు అతని వదిన అన్నపూర్ణ అనేక రకాలుగా వేధిస్తున్నారని వాళ్ల మీద కేసు పెట్టి అరెస్టు చేయించి జైల్లో పెట్టించాలి. ఆ తర్వాత తన భర్త తన వదినతో సంసారం చేస్తున్నాడు కాబట్టి నేను అతనితో ఉండలేను. కాబట్టి తనకు విడాకులు కావాలని కోర్టులో విడాకులు కోరాలి. శంకర్రావుకు భాగానికి వచ్చే పది ఎకరాల పొలంలో సగం అంటే ఐదు ఎకరాలు తనకు తన కొడుక్కు భరణంగా ఇవ్వాలని కోరాలి. ఇది పోరుబాట

అయితే ఈ మొదటి మార్గం అనుకున్నంత సులభం కాదని లాయర్ చెప్పాడు. దీనికి ఆమె తల్లిదండ్రులు అంగీకరించకపోవచ్చు. వాళ్లు పేదవాళ్లు, చాలా మామూలు మనుషులు, తాను భర్తను వదిలేసి పుట్టింటికి వెళ్ళిపోతే భర్తను వదిలి వేసిన ఆడది అని లోకం తనను ఆడిపోసుకుంటుంది. కూతురుకు సర్దిచెప్పి కాపురానికి పంపించలేదని తన తల్లిదండ్రులను లోకం నిందిస్తుంది. అందువల్ల ఈ నిర్ణయానికి వాళ్ళు అంగీకరించరు. ఒకవేళ తాను ధైర్యం చేసి తల్లిదండ్రుల మాట వినకుండా భర్తను వదిలివేసి పుట్టింటికి వెళ్ళి పోయి భర్త మీద పోరాటం చేస్తే తన తల్లిదండ్రులు తమ కూతురు సంసారం పాడైపోయిందని దిగులుతో కృషించి చనిపోవచ్చు. తన కారణంగా తన తల్లిదండ్రులు దిగులుతో చనిపోతే తను తట్టుకోగలదా? వాళ్ళు చనిపోతే తాను ఒంటరిగా ఏకాకిగా ఎంతవరకు పోరాటం చేయగలదు? విడాకులు ఇవ్వడానికి శంకర్రావు అంగీకరించకపోతే తనకు కోర్టులో విడాకులు రావడానికి ఏండ్లూపూండ్లూ పట్టవచ్చు, కోర్టు చుట్టూ, లాయర్ల చుట్టూ తిరగాలి. అందుకు చాలా డబ్బులు అవసరం, తనకు పెద్దగా చదువు లేదు, ఉద్యోగం చేసుకునే అవకాశం లేదు, డబ్బులు సంపాదించే మార్గం లేదు, ఒకవేళ విడాకులు వచ్చినా విడాకులు వచ్చే వరకు తను ఎలా జీవితం గడపాలి? తన కొడుకు జీవితం ఏం చేయాలి? వాడిని ఎలా చదివించాలి? వానికి మంచి భవిష్యత్తు ఎలా కల్పించాలి? భర్తను వదిలేసి ఒంటరిగా జీవిస్తున్న స్త్రీ పట్ల పురుష సమాజం ఎలా ప్రవర్తిస్తుందో తనకు తెలియంది కాదు. ఇవన్నీ చాలా కఠినమైన వాస్తవమైన ప్రశ్నలు. వీటికి సమాధానం దొరకడం చాలా కష్టం. తనలాంటి స్త్రీకి ఈ మార్గం ఆచరణలో దాదాపు అసాధ్యమని లాయర్ చెప్పాడు. అందువల్ల రాజకుమారి తాను ఈ పోరుబాటలో వెళ్లే అవకాశం లేదని అనుకుంది.

లాయర్ చెప్పిన రెండవ మార్గం

రాజకుమారి ఆత్మాభిమానాన్ని మనసును చంపుకొని భర్త దగ్గర ఉండటం. సమస్యను కాలానికి వదిలేసి ఓపిగ్గా సహనంతో భర్త దగ్గరే ఉండాలి. కొంతకాలానికి అతని మనసు మరి ఆమెతో ప్రేమగా ఉండవచ్చు. కానీ ఈ మార్గంలో వెళ్లడం తన వల్ల కాదని ఆమె నిర్ణయించుకుంది.

లాయర్ చెప్పిన మూడవ మార్గం.

రాజకుమారి తన భర్త మీద అతని వదిన మీద పోలీస్ స్టేషన్ లో సి.ఐ కి చెప్పి శంకరరావును అన్నపూర్ణను పోలీస్ స్టేషన్‌కు పిలిపించి రాజకుమారిని ఆమె కుమారుని బాగా చూసుకోవాలని సీ.ఐ చేత వాళ్లకు హెచ్చరిక జారీ చేయించాలి. ఆమె మళ్ళీ పోలీస్ స్టేషన్ కు వచ్చి కంప్లైంట్ చేయకుండా ఉండేటట్లుగా బాగా చూసుకోవాలని సీ.ఐ చేత గట్టిగా చెప్పించాలి. దానికి వాళ్ళిద్దరూ భయపడి రాజకుమారిని వేధించకుండా బాగా చూసుకో వచ్చు.

ఈ మూడు మార్గాలలో మొదటి దానికి మూడవ దానికి తాను సాయం చేస్తానని లాయరు చెప్పాడు. రాజకుమారి మూడింటి గురించి బాగా ఆలోచించి తల్లిదండ్రులతో మాట్లాడి మూడవ మార్గంలో వెళ్ళడానికి తండ్రితో కలిసి పోలీస్ స్టేషన్‌కు బయలుదేరింది.

* * *

# ధీర

"అమ్మా, రజనీ నీ భవిష్యత్తు దృష్ట్యా పోలీస్ కంప్లైంట్ ఇవ్వడం మంచిది కాదు. ఇప్పటికే నలుగురు నాలుగు రకాలుగా అనుకుంటున్నారు. పోలీస్ కంప్లైంట్ ఇస్తే అది మళ్ళీ పేపర్ లకు ఎక్కి ఈ విషయం చాలా మందికి తెలుస్తుంది. దాని వల్ల మరెన్నో చిక్కులు వస్తాయి. లోకం గుడ్డిది, ఒక్కొక్కసారి అబద్ధాలే నిజాలుగా చలామణి అవుతాయి. వాడు నీ మీద లేనిపోని నిందలు వేసి అబద్ధ ప్రచారం చేస్తాడు. అవి నమ్మే జనం కూడా ఉన్నారు. వాళ్ళు నలుగురికి ఆ నలుగురు ఇంకా నలుగురికి చెబుతారు. దీనివల్ల చాలా సమస్యలు వస్తాయి. అవి లేకుండా ఉండాలంటే మనం దీని గురించి పోలీస్ కంప్లైంట్ ఇవ్వకుండా మరచి పోవడం మంచిది"

అని వెంకట్రావు తన కూతురు రజనితో చెప్పాడు.

తండ్రి చెప్పినదానికి రజని అంగీకరించలేదు

"నాన్నా, నువ్వు చెప్పింది సరైనది కాదు. నేరం చేసిన వాడు తప్పనిసరిగా శిక్ష అనుభవించాలి. అది చూసి ఇతరులు భయపడి అలాంటి తప్పులు చేయకుండా ఉండాలంటే మనం తప్పనిసరిగా జరిగిన సంఘటన గురించి పోలీస్ కంప్లైంట్ ఇవ్వాలి. ఇవ్వకపోతే దాన్ని అలుసుగా తీసుకుని వాడు మళ్ళీ అలాంటి ప్రయత్నం చేయవచ్చు. ఆడవాళ్లకు ఇలాంటి సంఘటనలు జరిగినప్పుడు లోకానికి భయపడి వారు ఆ విషయాన్ని బయటకు చెప్పుకోలేరు అని తప్పు చేసినవాడు భావించినప్పుడు వాడు మరింత రెచ్చిపోయే అవకాశం ఉంది. కాబట్టి మనం తప్పనిసరిగా జరిగిన సంఘటన గురించి వాడి మీద పోలీస్ కంప్లైంట్ ఇవ్వాల్సిందే. వాన్ని అరెస్టు

చేయించాలి. కోర్టులో శిక్ష పడే లాగా చేయాలి. వానికి గుణపాఠం నేర్పించాలి. ఎవరు అలాంటి పని చేయాలన్నా భయపడే లాగా వాడికి శిక్ష విధించాలి. మీరు రాకపోయినా నేనొక్కదాన్నే వెళ్లి పోలీస్ కంప్లైంట్ ఇస్తాను"అని రజని చాలా నిశ్చయంగా చెప్పింది.

వెంకట్‌రావు శ్రీకాకుళం జిల్లాలో ఒక మారు మూల పల్లెటూరిలో వుంటున్నాడు. అది అతని స్వగ్రామం. అతనికి ఆ ఊర్లో తక్కువ పొలముంది. అతనిది దిగువ మధ్య తరగతి స్థాయి. ఆ ఊరికి దాదాపు 8 కిలోమీటర్ల దూరంలో బస్సులు తిరిగే రోడ్డు ఉంది. బస్సు కోసం వెళ్లాలంటే సుమారు ఎనిమిది కిలోమీటర్లు షేరింగ్ ఆటోలో వెళ్లాలి. దారిలో మరో మూడు పల్లెటూర్లు వస్తాయి. ఆ మూడు ఊర్లు దాటిన తర్వాత బస్సులు తిరిగే రోడ్డు వస్తుంది. ఊరిలోని ప్రజలను రోడ్డు వరకు దింపడానికి తీసుకొని పోవడానికి మూడు షేరింగ్ ఆటోలు తిరుగుతూ ఉంటాయి. మూడు ఆటోలను యువకులే నడుపుతున్నారు.

వెంకట్‌రావు ఏకైక కూతురు రజని. ఆమె అక్కడకు ఇరవై కిలోమీటర్ల దూరంలో ఉన్న ఓ ప్రైవేటు ఇంజనీరింగ్ కళాశాలలో బీ.టెక్ మూడవ సంవత్సరం చదువుతూ వుంది. ఆమె ప్రతి రోజు ఇంటి నుంచి కళాశాలకు పోయి వస్తుంది. ఆమె ఉదయం ఎనిమిది గంటలకు ఇంటి నుంచి షేరింగ్ ఆటోలో బయలుదేరి తొమ్మిది గంటలకు రోడ్డు వరకు వెళుతుంది. అక్కడ ఆర్టీసి బస్సు ఎక్కి సుమారు 9.30 నిముషాలకు కాలేజీకి వెళ్తుంది. సాయంత్రం ఐదింటికి కళాశాల అయిపోతుంది. ఆమె అప్పుడు ఆర్టీసీ బస్సులో రోడ్డు వరకు వచ్చి అక్కడ నుంచి షేరింగ్ ఆటోలో తన ఊరికి వస్తుంది. ఆమె సాధారణంగా ఇంటికి వచ్చేటప్పటికీ సాయంత్రం ఆరున్నర, ఏడు గంటలు అవుతుంది. ఒక్కొక్కరోజు ఇంకా ఆలస్యమవుతుంది. వెళ్ళేటప్పుడు వచ్చేటప్పుడు షేరింగ్ ఆటోలో ఆమెతో పాటు ఇతర ప్రయాణీకులుంటారు. వచ్చేటప్పుడు ఆమెది చివరి స్టాప్ కావటం చేత ఒక్కొక్కసారి ఆమె షేరింగ్ ఆటోలో ఒక్కతే ఉంటుంది. అయినప్పటికీ ఆమె చాలా కాలంగా షేరింగ్ ఆటోలో తిరుగుతూ ఉండటం వల్ల షేరింగ్ ఆటోలు నడిపే ముగ్గురు యువకులు పరిచయస్తులే. అందువల్ల ఆమె ఒంటరిగా ఉన్నప్పటికీ భయపడకుండా షేరింగ్ ఆటోలో వెళ్ళి వస్తుంది.

ఆరోజు ఇంటికి వచ్చేటప్పుడు రజని మోహన్ అనే యువకుని ఆటో ఎక్కింది. దారిలో మూడు ఊర్ల వాళ్ళు దిగిపోయారు. ఆమె ఒక్కతే ఆటోలో ఉంది. సమయం ఏడు గంటలయింది. చీకటిగా ఉంది. అక్కడ నుంచి ఆమె ఊరికి రెండు కిలోమీటర్ల దూరముంటుంది. ఆటో బయలుదేరి కొంచెం దూరం వచ్చిన తర్వాత మోహన్ తన ఆటోను దారి మళ్లించి వేరే ప్రదేశానికి తీసుకుని వెళ్లి ఆమెను బలత్కారం

చేయబోయాడు. ఆమె ప్రతిఘటించి గాట్టిగా కేకలు వేసింది. అంతకు ముందే ఆటో దిగిన వాళ్ళు అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చారు. మోహన్ అక్కడ నుంచి ఆటో వేసుకొని పారిపోయాడు. రజని వేరే ఆటోలో ఇంటికి వచ్చి తండ్రికి విషయమంతా వివరించి మోహన్ మీద పోలీస్ కంప్లైంట్ చేయాలని చెప్పింది. తండ్రి వద్దని దానివల్ల ఆమె బ్రతుకు అల్లరవుతుందని చెప్పాడు. ఆమె ఇంటి చుట్టుపక్కల ఉన్న ఇళ్ల వాళ్ళు కూడా మోహన్ మంచివాడు కాదని కేసు పెడితే అతను ఆమెకు ఏదైనా హాని కలిగించవచ్చని అందువల్ల అతని మీద కేసు పెట్టవద్దని చెప్పారు. కానీ ఆమె వారి మాటలకు అంగీకరించకుండా తనకు జరిగిన అవమానానికి అన్యాయానికి తప్పనిసరిగా వాని మీద పోలీస్ స్టేషన్ లో కేసు పెట్టాలని నిశ్చయించుకుంది.

మరుసటి రోజు వెంకటరావు రజని పోలీస్ స్టేషన్‌కు వెళ్లి జరిగిన విషయమంతా సీ.ఐ గారికి చెప్పి మోహన్ మీద కంప్లైంట్ చేశారు. పోలీసులు ఆమె చెప్పిందంతా రాసుకున్నారు. అదృష్టవశాత్తు సీ.ఐ గా స్త్రీ ఉన్నారు. ఆమె రజని ధైర్యాన్ని అభినందించింది. అన్యాయం జరిగినప్పుడు అమ్మాయిలందరూ రజనీ లాగా పోలీసులకు కంప్లైంట్ చేయాలని చెప్పారు. రజని కేసు విషయంలో తాను ప్రత్యేకమైన శ్రద్ధ వహిస్తానని కూడా సీ.ఐ చెప్పారు. రజని సీ.ఐ గారికి ధన్యవాదాలు తెలియజేసింది.

తనకు రజనీకి చాలా కాలంగా సంబంధం ఉందని ఆమె తల్లిదండ్రులు ఆ విషయం తెలుసుకొని తన మీద ఆమె చేత తప్పుడు కేసులు పెట్టించారని రజనీ మీద తనకు తెలిసిన వాళ్ళ చేత ఊర్లో మోహన్ దుష్ప్రచారం చేయించాడు, అతను గూడా చేశాడు. పోలీసులు అతన్ని పిలిపించి రజని పెట్టిన కేసు గురించి అతనికి చెప్పినపుడు అదే విషయాన్ని పోలీసులకు కూడా చెప్పాడు. సీ.ఐ గారు ఆ విషయం గురించి పోలీసుల చేత ఆవూర్లో పూర్తిగా విచారణ చేసి అతడు చెప్పిందంతా అబద్ధమని తెలుసుకున్నారు. రజని మీద అత్యాచారం చేయడానికి ప్రయత్నించడమే కాకుండా ఆమె వ్యక్తిత్వాన్ని పాడు చేసే విధంగా ఊర్లో దుష్ప్రచారం చేసినందుకు అతనిమీద మరొక కేసు కూడా పోలీసులు పెట్టారు.

పోలీసులు ఈ రెండు కేసులకు సంబంధించిన ఎఫ్.ఐ.ఆర్‌ను తయారు చేసి మోహన్‌ను అరెస్టు చేసి జైల్లో వేశారు. ఆతర్వాత పోలీసులు కేసును కోర్టుకు సమర్పించారు. కోర్టు నుంచి రజనీకి నోటీసులు వచ్చిన తర్వాత ఆమె కోర్టుకు హాజరై జరిగిన విషయమంతా న్యాయమూర్తి గారికి చెప్పింది. న్యాయమూర్తి ఆమె చెప్పిందంతా రాసుకున్నారు. తనకు న్యాయం జరిగేలా చూడమని రజని న్యాయమూర్తి గారికి విన్నవించింది. న్యాయమూర్తి గారు తప్పనిసరిగా న్యాయం జరిగేలా చూస్తానని

చెప్పారు. ఆతర్వాత రజని ప్రభుత్వ న్యాయవాదిని కలిసి విషయమంతా అతనికి తెలియజేసి తనకు న్యాయం జరిగేలా చూడమని అతన్ని కూడా కోరింది. అతను కూడా తప్పనిసరిగా ఆమెకు న్యాయం జరిగేలా చూస్తానని హామీ ఇచ్చారు.

రజని కేసును గురించి పట్టించుకోకుండా ఎలాంటి ఆందోళన చెందకుండా చదువు మీద దృష్టి పెట్టి చాలా కష్టపడి చదివి బీ.టెక్ మంచి మార్కులతో పాస్ అయింది. ఆ తర్వాత ఆమె హైదరాబాద్ వెళ్ళి ఉద్యోగ ప్రయత్నం చేసింది. ఉద్యోగం సంపాదించుకుంది. ప్రతాప్ అనే యువకుని పెళ్లి చేసుకుంది. పెళ్లికి ముందుగానే ఆమె ప్రతాప్‌కు మోహన్ తనను వేధించడం అతని మీద కేసు పెట్టడం మొదలు విషయమంతా చెప్పింది. అతను చాలా మంచివాడు, ఆమెను అర్థం చేసుకున్నాడు, అంతేకాకుండా ఆమె చాలా మంచి పని చేసిందని ఆమె ధైర్యాన్ని అభినందించాడు కూడా. ఆ విధంగా తనకు జరిగిన అన్యాయాన్ని గురించి పోలీస్ స్టేషన్ లో కంప్లైంట్ చేయడం వల్ల ఆమె ఏ విధంగానూ నష్టపోలేదు. తనకు న్యాయం జరుగుతుందనే నమ్మకంతో ఆమె ఉంది.

మోహన్ చాలా కాలం జైల్లో ఉన్నాడు. లాయర్‌ను పెట్టుకొని బెయిల్ కోసం ప్రయత్నించాడు. కేసు గట్టిగా ఉండడం చేత చాలాకాలం అతనికి బెయిల్ రాలేదు. లాయర్ కు చాలా డబ్బులు ఇవ్వవలసి వచ్చింది. తర్వాత అతనికి బెయిల్ వచ్చింది. మోహన్ జైలు నుంచి వచ్చిన తర్వాత సీ.ఐ మేడం గారు అతన్ని పిలిపించి రజనీ విషయంలో ఎలాంటి పొరపాటు చేయకూడదని గట్టిగా హెచ్చరించారు. ఊర్లో అందరూ అతన్ని తిట్టిపోశారు. అతని ఆటోను జనాలు ఎక్కడం మానేశారు. అతనికి జీవితం గడవడం కష్టమైంది. నెలకు, రెండు నెలలకు ఒకసారి కోర్టు వాయిదాలకు వెళ్ళవలసి వచ్చింది. దీనితో అతను చాలా అప్పుల పాలయ్యాడు. మనశ్శాంతి లేకుండా జీవించ వలసి వచ్చింది. పెళ్లి చేసుకోవడానికి పిల్లను ఎవరూ ఇవ్వలేదు. పెద్ద మనుషుల ద్వారా రజనీ నాన్న దగ్గరకు రాజీ చేసుకుందామని బ్రతిమాలుతూ వర్తమానం పంపించాడు. రాజీ చేసుకుంటే లక్ష రూపాయలు డబ్బులు ఇస్తానని ఆశ పెట్టాడు. రజని దాన్ని నిర్ద్వందంగా తోసిపుచ్చింది. కేసు ఐదు సంవత్సరాల వరకు జరిగింది. ఐదు సంవత్సరాలు మోహన్ కోర్టుకు హాజరవుతూనే ఉన్నాడు. చివరకు అతనికి కోర్టు ఏడు సంవత్సరాలు జైలు శిక్ష విధించింది. చేసిన అపరాధానికి తగిన శిక్ష పడిందని రజనీ సంతోషించింది. ఊర్లో ప్రజలు కూడా చాలామంది సంతోషించారు. స్త్రీల పట్ల అమర్యాదగా ప్రవర్తించడానికి ప్రయత్నించే వారికి ఒక గుణపాఠంగా ఆ తీర్పును వాళ్లు భావించి స్వాగతించారు. అంతేకాకుండా రజని తనకు జరిగిన అన్యాయానికి అవమానానికి భయపడకుండా ధైర్యంగా పోలీస్ స్టేషన్ లో కంప్లైంట్ చేసినందుకు ఆమె ధీరత్వాన్ని అందరూ అభినందించారు కూడా.

# పోలీస్ స్టేషన్

పోలీస్ స్టేషన్‌లో శంకరయ్య కేసు పెట్టడానికి వచ్చాడు. శంకరయ్య పొలం పక్కన వెంకటయ్య పొలముంది. పొలం దగ్గర వెంకటయ్యకు అతనికి గొడవ జరిగింది. వెంకటయ్య పోలీస్ స్టేషన్ లో కేసు పెడతాడని భావించి అతని కంటే ముందుగా తానే వెంకటయ్య మీద కేసు పెట్టాలని శంకరయ్య పోలీస్ స్టేషన్‌కు వచ్చాడు. తాను పెట్టదలిచిన కేసు గురించి అతను సి.ఐ తో చెప్పాడు.

"సార్ మా పొలం పక్కన పొలం వెంకటయ్యది. అతను చాలా లిగాడీ మనిషి. మా పొలంలో ఒక గొర్రుపట్టె మోయిన ఎక్కువగా విత్తనం వేసుకున్నాడు. నేను అడిగితే నాతో కొట్లాటకు దిగి అతను అతని కొడుకు కలిసి నన్ను కొట్టినారు సార్, నేను కేసు పెట్టడానికి వచ్చినాను, కేసు రాసుకోండి" అని అన్నాడు.

"ఏమయ్యా నువ్వు చెప్పింది నిజమేనా ?నేను ఎంక్వైరీ చేయిస్తాను, నువ్వు చెప్పింది నిజం కాకపోతే నిన్ను చితగ్గొడతాను, నేను వెంకటయ్యను పిలిచి ఎంక్వయిరీ చేసి నిజమేంటో కనుక్కుంటాను. నువ్వు రేపు రా" అని సి.ఐ శంకరయ్యకు చెప్పి పంపించాడు.

సి.ఐ పోలీస్ కానిస్టేబుల్ పంపించి వెంకటయ్య పిలుచుకుని రమ్మన్నాడు. కానిస్టేబుల్ వెళ్లి వెంకటయ్య పిలుచుకొని వచ్చాడు. సి.ఐ వెంకటయ్యతో మాట్లాడాడు.

"ఏమయ్యా నువ్వు శంకరయ్య పొలంలో గొర్రుపట్టె మోయిన ఎక్కువగా విత్తనం వేసుకున్నావంట, అతడు అడిగితే నువ్వు నీ కొడుకు కలిసి అతన్ని కొట్టారంట, అతను నీ మీద కేసు పెట్టడానికి వచ్చాడు. ఏమిటి సంగతి, చెప్పు, నిజం చెప్పు" అని అడిగాడు.

## పోలీస్ స్టేషన్

"సార్ ఒట్టి అబద్ధం సార్, నేను విత్తనమే వేయలేదు, కావాలంటే మీరు మీ పోలీసు వాళ్ళను మా చేనుకు పంపించి చూసి రమ్మనండి. వాడే విత్తనం వేస్తూ మా పొలంలో ఒక గొర్రుపట్టె మోయిన ఎక్కువగా వేసుకున్నాడు. నేను అడిగితే అతని కొడుకు నన్ను తోసి కింద పడేశాడు. నా కొడుకు వాని మీద కలబడితే నేను ఇడిపించిన, అంతేగాని నేను ఏ తప్పు చేయలేదు సార్, వాడే తప్పు చేసి మళ్లీ వాడే నా మీద కేసు పెట్టడానికి వచ్చినాడా? ఇది చాలా అన్యాయం సార్"అని వెంకటయ్య అన్నాడు.

"అయితే నువ్వు ఒక పని చెయ్, మా కానిస్టేబుల్ ను తీసుకొని పోయి నీ పొలం చూపించు, నీ పొలం ఎంతవరకు ఉందో చూపించి శంకరయ్య ఎంత ఎక్కువగా మీ పొలంలో విత్తనం వేసుకున్నాడో అతనికి చూపించు, మా కానిస్టేబుల్ నాకు చెబుతాడు" అని అన్నాడు. దానికి వెంకటయ్య అంగీకరించి కానిస్టేబుల్‌ను తీసుకొని తన పొలం చూపించడానికి వెళ్ళాడు.

కానిస్టేబుల్ తిరిగి వచ్చి వెంకటయ్య అసలు విత్తనమే వేయలేదని శంకరయ్య తన పొలంలో విత్తనం వేస్తూ గొర్రుపట్టె మోయిన ఎక్కువగా వెంకటయ్య చేలో విత్తనం వేసుకున్నాడని సి.ఐ కి చెప్పాడు.

మరుసటి రోజు సి.ఐ శంకరయ్యను అతని కొడుకును పిలిపించి మాట్లాడాడు.

"ఏంరా శంకరయ్యా, లిగాడి (పేచీకోరు) నా కొడకా, వెంకటయ్య పొలంలో గొర్రుపట్టె మోయిన ఎక్కువగా విత్తనం వేసుకున్నది నువ్వు, పాపం ముసలాయన వెంకటయ్య అడిగితే అతన్ని కింద పడేలాగా తోసింది నీకొడుకు, మీరే తప్పు చేసి మళ్ళీ మీరే వచ్చి వెంకటయ్య మీద అతని కొడుకు మీద కంప్లైంట్ చేస్తారా? పోలీస్‌స్టేషన్‌లో ఉన్నవాళ్ళు అంత గుడ్డివాళ్ళనుకున్నావా? అంత పనికిమాలిన వాళ్ళనుకున్నావా? నువ్వు చెప్పింది విని వెంకటయ్యను పోలీస్ స్టేషన్లో పెడతామను కున్నావా?"అని శంకరయ్యను అతని కొడుకును సెల్ లో వేసి చితక్కొట్టాడు.

శంకరయ్య అతని కొడుకు సి.ఐ చేత దెబ్బలు తింటూ కొట్టొద్దు సార్ కొట్టొద్దు సార్ అని అతన్ని బతిమాలుతూ కాళ్లు పట్టుకున్నారు. ఇంకెప్పుడూ ఇలాంటి పని చేయొద్దు అని సి.ఐ వాళ్ళను పంపించేశాడు. ఈ సంగతి వెంకటయ్యకు తెలిసింది. సి.ఐ చాలా మంచి వాడని, నిజాయితీ పరుడని అతను భావించాడు.

తాము తప్పుడు కంప్లైంట్ చేసి స్టేషన్లో సి.ఐ తో దెబ్బలు తిన్నందుకు శంకరయ్యకు అతని కొడుక్కు చాలా అవమానంగా ఉంది. తాము సి.ఐ కి డబ్బులు ఇవ్వక పోవడం వల్ల సి.ఐ తమ మాట వినలేదని, డబ్బులు ఇచ్చి ఉంటే సి.ఐ తమను కొట్టేవాడు కాదని వాళ్ళు భావించారు. ఈసారి డబ్బులు ఇచ్చి ఎలాగైనా వెంకటయ్యను అతని కొడుకును కూడా పోలీసులతో కొట్టించాలని వాళ్ళు మళ్ళీ ఒక ప్రయత్నం చేశారు.

శంకరయ్య అతని కొడుకు 50 వేల రూపాయలు డబ్బులు తీసుకుని సి.ఐ ఇంటికి వెళ్లారు.

శంకరయ్య సి.ఐ తో చెప్పాడు.

"సార్ మీరు మమ్మల్ని కొట్టినందుకు నాకు బాధగా లేదు. మీ డ్యూటీ మీరు చేశారు, కానీ వెంకటయ్య, వాని కొడుకు వాళ్లే మీకు చెప్పి మమ్మల్ని కొట్టించామని గొప్పలు చెప్పుకుంటున్నారు. అది మాకు చాలా అవమానంగా ఉంది. ఎలాగైనా మీరు వాళ్లను స్టేషన్ కు తీసుకుని వచ్చి మమ్మల్ని కొట్టినట్లే వాళ్లను కూడా కొట్టాలి. అప్పడే మాకు మనశ్శాంతిగా ఉంటుంది. ఈ 50 వేలు తీసుకుని వాళ్ళిద్దర్నీ కొట్టండి. లేకపోతే మేము ఈ అవమానంతో బతకలేం సార్"అన్నాడు శంకరయ్య

సీ.ఐ కొంత మంచివాడే, అయితే యాభై వేల ముందు అతని మంచితనం ఓడిపోయింది.

"సరే, అలాగే, మీరు చెప్పినట్లుగానే వెంకటయ్యను అతని కొడుకును స్టేషన్‌కు పిలిపించి కొడతాను. మీరు వెళ్ళండి, కానీ డబ్బులు తీసుకొని నేను కొట్టిన విషయం మీరు ఎక్కడా ఎవరికీ చెప్పొద్దు, చెప్పారంటే మిమ్మల్ని మళ్లీ పిలిపించి కొడతాను". అని వాళ్లని బెదిరించి డబ్బులు తీసుకొని వాళ్లని పంపించాడు.

మరుసటి రోజు సి ఐ వెంకటయ్యను అతని కొడుకును స్టేషన్ కు పిలిపించి వెంకటయ్య తో చెప్పాడు

"ఏం వెంకటయ్యా, నీకు అన్యాయం జరిగినప్పుడు నువ్వు పోలీస్ స్టేషన్‌కు వచ్చి కంప్లైంట్ చేయాలి గదా, నీ చేలో శంకరయ్య విత్తనం వేయడం వల్ల నీకు అన్యాయం జరిగింది కదా, ఎందుకు మాకు వచ్చి కంప్లైంట్ చేయలేదు? మేమంటే అంత లెక్క లేదా నీకు, లేక కంప్లైంట్ చేసినా సరే మేము ఏమీ చేయలేమనుకున్నావా? అంటే మేమంత చేతకాని వాళ్లమనుకున్నావా? ఇది నువ్వు చేసిన తప్పు, అన్యాయం

జరిగితే తప్పనిసరిగా పోలీస్ స్టేషన్‌కు వచ్చి కంప్లైంట్ చేయాలి, నువ్వు చేయలేదు కాబట్టి నీకు శిక్ష పడాల్సిందే", అని సి.ఐ వెంకటయ్యను రెండు రెబ్బలు కొట్టాడు.

తర్వాత సీ.ఐ వెంకటయ్య కొడుకుతో "శంకరయ్య కొడుకు మీ నాయన్ను కింద పడే లాగా తోస్తే నువ్వు వచ్చి మాకు కంప్లైంట్ చేయాలి, అంతేగాని నువ్వు వాడు ఇద్దరూ కొట్టుకుంటే ఇంక మేమున్నది ఎందుకు? ఇది నువ్వు చేసిన తప్పు, ఇందుకు నీకు శిక్ష పడాలి" అని వెంకటయ్య కొడుకును నాలుగు దెబ్బలు పీకాడు.

"ఇంక వెళ్ళండి, ఎప్పుడూ ఇలాంటి తప్పులు చేయొద్దు, మీకేమైనా అన్యాయం జరిగితే పోలీస్ స్టేషన్‌లో కంప్లైంట్ చేయండి, మీకు మీరుగా ఏమీ చేయకూడదు"అని చెప్పి సి.ఐ వారిని పంపించాడు.

వెంకటయ్యకు అతని కొడుకుకు సి. ఐ తమను స్టేషన్ కు పిలిచి ఎందుకు కొట్టాడో అర్థం కాలేదు. పోలీస్ స్టేషన్ లో కంప్లైంట్ ఇవ్వడం ఇవ్వకపోవడం అనేది తమ ఇష్టం. కంప్లైంట్ ఇవ్వని కారణంచేత సీ.ఐ తమను కొట్టాడని వారు భావించడం లేదు. అందుకు వేరే కారణం ఏదో ఉంటుందని వాళ్ళు ఊహించారు.

శంకరయ్య సి. ఐ కి 50 వేల రూపాయలు డబ్బులిచ్చి తనను తన కుమారుని కొట్టించిన విషయం అతనికి ఆ స్టేషన్ లోని కానిస్టేబుల్ చెప్పడంతో అసలు విషయం తెలిసింది.

పోలీసులందరూ ఇంతేనేమో అని వెంకటయ్య బాధ పడ్డాడు.

* * *

# పోరు

వరలక్ష్మి హత్య గావించబడిందనే వార్త ఆ ఊర్లో నిమిషాల మీద దావానలం లాగా వ్యాపించింది. "పాపం వరలక్ష్మి" ఎవరి జోలికి వెళ్ళేది కాదు. ఎవరినీ పల్లెత్తు మాట అనేది కాదు. తలవంచుకుని తన పని తాను చేసుకుని పోయేది. ఎవరైనా ఏదైనా పని చెబితే వెంటనే చేసేది. ఏమాత్రం స్వార్థం లేకుండా అందరికీ సాయం చేసేది. ఆ ఊర్లో అందరికీ తలలో నాలుక లాగా ఉండేది.

అలాంటి వరలక్ష్మి ఊరి బైట పొలంలో హత్య గావించబడింది. ఎవరో దుర్మార్గులు ఆమెను చెరచి దారుణంగా గొంతు కోసి చంపేశారు. ఊరు ఊరంతా ఆమె శవం దగ్గరకు చేరుకున్నారు. ఆమె శవాన్ని చూసి ఆడవాళ్ళు కన్నీళ్లు పెట్టుకున్నారు. ఎవరు చేశారు ఇంత దుర్మార్గం? అని అక్కడికి చేరిన ఆడా మగా అందరూ తమలో తాము మాట్లాడుకుంటున్నారు. ఎంత మంచి అమ్మాయికి దేవుడు ఎలాంటి రాత రాశాడు? ఇలాంటి చావు ఏర్పాటు చేశాడు? దేవుడున్నాడా? ఉంటే మంచివాళ్ళకు ఇలాంటి ఆపద కలిగిస్తాడా? అని అక్కడ చేరిన వాళ్ళు రకరకాలుగా మాట్లాడుకుంటున్నారు.

అయితే ఆమెను అంత దారుణంగా చంపిన వాళ్ళు ఎవరో అక్కడ చేరిన వారిలో కొంత మందికి తెలుసు. అయితే వాళ్ళు ఎవరూ ఆ పేర్లను బైటికి చెప్పడం లేదు. ఎందుకంటే చంపిన వాళ్ళు ఆ ఊర్లో రాజకీయంగా బాగా పలుకుబడి, అధికారబలం ధనబలం కులబలం ఉన్న వాళ్ళ కొడుకులు. బైటికి చెబితే వాళ్ల ఆగ్రహానికి ఎక్కడ గురికావాల్సి వస్తుందో అని అక్కడ చేరిన వాళ్ళు తమలో తాము గుసగుసలాడుకుంటున్నారు తప్ప వారి పేర్లు బైటికి చెప్పడం లేదు.

వరలక్ష్మి తండ్రి పాపారావు కూతురి శవం దగ్గర కూర్చొని హృదయ విదారకంగా రోదిస్తున్నాడు. అక్కడ ఉన్న వాళ్ళు అతన్ని ఓదార్చే ప్రయత్నం చేస్తున్నారు. ఎంతమంది

ఓదార్చిన అతని దుఃఖం ఆగటం లేదు. పాపారావు మంగలి కులానికి చెందిన వ్యక్తి. వరలక్ష్మి అతని ఏకైక కూతురు. వరలక్ష్మి పుట్టిన రెండు సంవత్సరాలకు ఆమె తల్లి చనిపోయింది. పాపారావు తల్లి తండ్రి అన్నీ తానే అయి వరలక్ష్మిని పెంచి పెద్ద చేశాడు.

పదిహేను రోజుల కిందట ఆ ఊర్లోని మోతుబరుల కుమారులు ముగ్గురు వరలక్ష్మిని శారీరకంగా తమ కోరిక తీర్చాలని బలవంతం చేశారు. ఆమె తిరస్కరించి తప్పించుకుని వచ్చి పాపారావుకు చెప్పింది. పాపారావు మోతుబరుల దగ్గరికి వెళ్లి వారి కుమారులు చేసిన దౌష్ట్యాన్ని గురించి చెప్పాడు. వారు తమ కుమారులను మందలించారు. దానితో ఆ ముగ్గురు వరలక్ష్మి మీద కక్ష పెంచుకుని ఇంత దుర్మార్గానికి ఒడిగట్టారు.

గ్రామంలోని మోతుబరులు వరలక్ష్మి హత్య కేసు తమ కొడుకుల మీదకు రాకుండా జాగ్రత్త పడే ప్రయత్నం చేశారు. నేరం చేసిన ముగ్గురు యువకులను ఊర్లో లేకుండా వేరే ఊరికి పంపించారు. అంతేకాకుండా తమ పలుకుబడిని ఉపయోగించి పోలీసులను హత్యాస్థలానికి రాకుండా చేశారు. అప్పుడు ఆ ఊర్లోని రాంప్రసాద్ అనే యువకుడు తనకు తెలిసిన అభ్యుదయ మహిళా మండలి వారికి ఫోన్ చేసి జరిగిన దారుణం గురించి చెప్పాడు. వాళ్ళు వెంటనే పోలీస్ స్టేషన్‌కు వచ్చి దోషుల మీద కేసు పెట్టి వారిని అరెస్టు చేయాలని, చనిపోయిన అమ్మాయి భౌతికకాయానికి పోస్టుమార్టం నిర్వహించాలని పోలీస్ స్టేషన్ ముందు ధర్నా నిర్వహించారు. దాంతో పోలీసులు వచ్చి వరలక్ష్మి భౌతికకాయాన్ని పోస్టుమార్టంకు తరలించారు. పోస్టుమార్టం అయిపోయిన తర్వాత ఆమె భౌతిక కాయానికి ఆమె తండ్రి పాపారావు అంత్యక్రియలు నిర్వహించాడు.

పాపారావు తన కూతురును హత్య చేసిన ముగ్గురు యువకుల మీద పోలీస్ స్టేషన్ లో కంప్లైంట్ చేయాలని నిశ్చయించుకున్నాడు. హంతకులైన ముగ్గురు యువకుల తండ్రులు పాపారావు పోలీస్ స్టేషన్ లో కంప్లైంట్ చేయకుండా చాలా ప్రయత్నాలు చేశారు. మొదట అతనికి పెద్ద మొత్తంలో డబ్బులు ఆశ చూపారు. పాపారావు దానికి లొంగలేదు. ఊర్లో బతుకుతెరువు లేకుండా చేస్తామని హెచ్చరించారు. చివరకు తమ మాట వినకపోతే చంపుతామని బెదిరించారు. మీరు చంపండీ, నరకండీ నా కూతురును చంపిన కసాయి వారికి శిక్ష పడేవరకు నేను పోరాడుతాను అని స్థిరమైన నిర్ణయంతో అతను పోలీస్ స్టేషన్‌లో ముగ్గురు యువకుల మీద కేసు పెట్టాడు. కేసు పెట్టే విషయంలో కూడా రాంప్రసాద్ పాపారావుకు సాయం చేశాడు.

తర్వాత రాంప్రసాద్ పాపారావును దగ్గరలో ఉన్న పట్టణం లోని మహిళా మండలి వాళ్ళ దగ్గరకు, చాకలి మంగలి మొదలైన వెనుకబడిన తరగతుల కుల సంఘాల

నాయకుల వద్దకు తీసుకుని వెళ్లి వారికి విషయమంతా చెప్పి వారందరితో కలిసి వరలక్ష్మి భౌతిక కాయానికి పోస్టుమార్టం నిర్వహించే ఆస్పత్రి సూపరింటెండెంట్ దగ్గరికి వెళ్లి తమకు న్యాయం జరిగేలా చూడాలని వినతిపత్రం ఇచ్చారు. దానితో ఆసుపత్రి వాళ్ళు ఎలాంటి పలుకుబడులకు లొంగకుండా పోస్టుమార్టం రిపోర్ట్ ఉన్నది ఉన్నట్లుగా ఇచ్చారు. ఆ రిపోర్టులో వరలక్ష్మి ముగ్గురి చేత రేప్ చేయబడిందని, గొంతు కోయడం చేత ఆమె చనిపోయిందని రాశారు.

పోస్టుమార్టం రిపోర్ట్ వచ్చిన తర్వాత పోలీసులు ఆ ముగ్గురు యువకులను అరెస్టు చేసి ఆసుపత్రిలో అవసరమైన పరీక్షలు చేయించారు. ఆ పరీక్షల్లో ఆ ముగ్గురే చనిపోయిన వరలక్ష్మిని రేప్ చేసి చంపారని రుజువయింది. పోలీసులు ముగ్గురు ముద్దాయిలను కోర్టులో ప్రవేశ పెట్టారు. ముద్దాయిల తరపు న్యాయవాది బెయిల్ పిటిషన్ వేశాడు. కోర్టులో ఉన్న ప్రభుత్వ న్యాయవాది గోపాలకృష్ణ చాలా మంచివారు. ఆయన ముగ్గురు ముద్దాయిలకు బెయిల్ ఇవ్వకూడదని గట్టిగా వాదించారు. అతని వాదన విన్న న్యాయమూర్తి వారికి బెయిల్ ఇవ్వలేదు. ముగ్గురు ముద్దాయిలు జైలుకు వెళ్లారు.

తమ కుమారుల మీద కేసు పెట్టి జైలుకి పంపించిన పాపారావు మీద ముగ్గురు ముద్దాయిల తండ్రులు దాడి చేశారు. దానితో వారి మీద కూడా పాపారావు కేసు పెట్టాడు. పోలీసులు వారిని కూడా అరెస్టు చేసి కోర్టులో ప్రవేశపెట్టారు. కోర్టు వారికి జైలు శిక్ష విధించడమే కాకుండా భవిష్యత్తులో పాపారావు మీద ఎలాంటి దాడి జరిగినా దానికి ముద్దాయిల తండ్రులు బాధ్యత వహించాలని తీర్పు ఇచ్చింది. దానితో వారు మళ్ళీ పాపారావు మీద దాడి చేసే ప్రయత్నం చేయలేదు.

వరలక్ష్మి కేసును స్త్రీల మీద జరిగే దాడులకు సంబంధించిన ప్రత్యేక న్యాయస్థానానికి బదిలీ చేశారు. ఆ న్యాయస్థానంలో వాదనలు మొదలయ్యాయి. మోతుబరులు చాలా డబ్బులు ఖర్చు పెట్టి ఢిల్లీ నుంచి పెద్ద లాయర్ ను తెచ్చి వాదనలు వినిపించారు. అంతేకాకుండా వారు మళ్ళీ పాపారావుకు చాలా పెద్ద మొత్తంలో డబ్బులు ఆశ చూపి కేసును నీరు మార్చే ప్రయత్నం చేశారు. అతన్ని ప్రత్యేకంగా కలిసి తమ కొడుకులు చాలా పెద్ద తప్పు చేశారని, వారు ప్రస్తుతం పశ్చాత్తాప పడుతున్నారని, వారిని క్షమించి వదిలెయ్యాలని బ్రతిమాలారు. వారు ఎన్ని ప్రయత్నాలు చేసినా పాపారావు లొంగలేదు. అతను తన పోరు కొనసాగించాడు. కోర్టులో కేసు ఒక సంవత్సరం పాటు విచారణ జరిగింది. పోస్టుమార్టం రిపోర్టు బలంగా ఉండటం వల్ల ముగ్గురు యువకులు వరలక్ష్మిని రేప్ చేసి చంపినట్టుగా న్యాయస్థానం నమ్మి ముగ్గురు యువకులకు యావజ్జీవ కారాగార శిక్షను విధించింది. తన పోరాటం ఫలించినందుకు పాపారావు సంతోషించాడు.

# అమ్మ

ఉదయం ఆరు గంటల సమయంలో "అమ్మా అమ్మా"అంటూ ఎవరో తలుపు కొడుతున్నారు. "తెల్లవారుజామున ఎవరూ" అనుకుంటూ పైడితల్లి నిద్ర లేచి వెళ్లి తలుపు తీసింది. ఎదురుగా సుమారు ఇరవై సంవత్సరాలకు పైగా వయసుతో పొడవుగా ఉన్న కుర్రాడు నిలబడి ఉన్నాడు.

"ఎవరు నువ్వు" అని పైడితల్లి ప్రశ్నించింది.

"నేనమ్మా నీ కొడుకు రమణను" అన్నాడు యువకుడు

పైడితల్లి మొదట ఆశ్చర్యపోయింది. తర్వాత ఆనందంతో ఉక్కిరిబిక్కిరయింది. ఆ తర్వాత అనుమానంతో ఆ యువకుని ఇంట్లోకి తీసుకొని వెళ్లి లైట్ వేసి ముఖాన్ని స్పష్టంగా చూసింది.

అవును, నిజమే, నిజంగా తన కొడుకు రమణే, సుమారు ఏడెనిమిది ఏళ్ల తర్వాత తిరిగి వచ్చిన తన కొడుకు రమణ, ఏడెనిమిది సంవత్సరాలుగా తాను ఎవరి కోసం కళ్ళు కాయలు కాసే లాగా ఎదురు చూసిందో ఆ తన ఏకైక కొడుకు రమణ, ఈ ఏడెనిమిది సంవత్సరాలుగా తాను ఏకొడుకు రాక కోసం గుళ్ళు, గోపురాలు చర్చీల్లో ప్రార్థనలు చేసిందో ఆ కొడుకు రమణను చూసి పైడితల్లి ఆనందంతో కొడుకుని పట్టుకొని కన్నీరు కారుస్తూ "మళ్ళీ నిన్ను చూస్తాననుకోలేదు రమణా, ఎన్నాళ్ళకెన్నాళ్ళకు కనిపించావు కొడుకా" అని సంతోషంతో ఏడుస్తూ కొడుకును కౌగిలించుకుంది.

పైడితల్లి ఒక ప్రభుత్వ కార్యాలయంలో అటెండర్‌గా పని చేస్తూ వుంది. ఆమె చదువుకోలేదు, అయితే కష్టపడి తన పేరును సంతకంగా రాయడం నేర్చుకుంది, ఆమె నెమ్మదైన మనిషి, తన పని తప్ప ఇతరుల జోలికి వెళ్ళేది కాదు. కొంత అమాయకురాలు. కొడుకు రమణ పుట్టిన తర్వాత ఆమె భర్త ఆమెను వదిలేసి వేరే పెళ్లి చేసుకున్నాడు. పైడితల్లి కొడుకే లోకంగా కొడుకు మీదనే అన్ని ఆశలు పెట్టుకొని అతన్ని పెంచుతూ వచ్చింది.

పైడితల్లికి ఆమె పని చేస్తున్న పట్నంలో వంద గజాల స్థలంలో రెండు అంతస్తుల ఇల్లుంది. మొదటి అంతస్తులో ఆమె ఉంటుంది. కింది భాగం, రెండవ అంతస్తు అద్దెకు ఇచ్చుకుంది. తన జీతంతో పాటు ఇంటి అద్దె డబ్బుతో ఆమె జీవితం బాగానే సాగుతోంది. ఆమె దగ్గర కొంత బంగారం నగదు ఉంది. అదంతా ఇంట్లోనే ఉంచుకుంది. ఆమె కొడుకు రమణ ఎనిమిదివ తరగతి చదువుతున్నప్పుడు రెండవ అంతస్తులో ఇద్దరు చిన్నపిల్లలు గల దంపతులు అద్దెకు దిగారు. పిల్లల తల్లి పేరు వెంకటలక్ష్మి. పైడితల్లి కొడుకు రమణ వయసుకు మించి పొడవు పెరిగాడు. మంచి బలంగా చూడడానికి ఆకర్షణీయంగా ఉండేవాడు. వెంకటలక్ష్మి కళ్ళు పైడితల్లి దగ్గరున్న బంగారం డబ్బు మీద పడ్డాయి.

పైడితల్లి ఆఫీసుకు ఉదయం వెళ్లి సాయంత్రం వచ్చేది. వెంకటలక్ష్మి పైడితల్లి కొడుకు రమణతో మాట్లాడుతూ చనువు పెంచుకుని అతన్ని ముగ్గులోకి దింపి ఆ కుర్రవాడితో శారీరక సంబంధం పెట్టుకుంది. పద్నాలుగు సంవత్సరాల రమణ అమాయకంగా ఆమె వలలో పడిపోయాడు. వెంకటలక్ష్మి రమణ ద్వారా పైడితల్లి దగ్గరున్న బంగారం డబ్బు తీసుకొని రమణతో తన కుటుంబంతో కలిసి హైదరాబాదుకు పారిపోవాలని ప్రణాళిక వేసుకుంది. ఒక రోజు ఉదయం పైడితల్లి తన ఆఫీస్‌కు వెళ్ళగానే వెంకటలక్ష్మి తన ప్రణాళిక ప్రకారం పైడితల్లి ఇంట్లో ఉన్న బంగారం డబ్బు తీసుకొని రమణతో తన కుటుంబంతో కలిసి హైదరాబాదుకు పారిపోయింది.

ఆఫీస్ నుంచి సాయంత్రం ఇంటికి వచ్చిన పైడితల్లికి మొదటి రోజు ఎలాంటి అనుమానం కలగలేదు. కొడుకు రమణ బంధువులు ఇంటికి గాని స్నేహితుల ఇంటికి గాని వెళ్లి ఉంటాడని అనుకుంది. రెండు రోజులు అయినా రమణ ఇంటికి రాకపోవడంతో పైడితల్లికి ఏమి చేయాలో తోచలేదు. రెండవ అంతస్తులో ఉన్న ఇల్లు తాళం వేసి వుండడంతో ఆమెకు అనుమానం వచ్చి తన ఇంట్లో ఉన్న బంగారం నగదు గురించి చూసుకుంది, అది లేదు. దానితో ఆమె జరిగిన విషయం గురించి పోలీస్ స్టేషన్ లో ఫిర్యాదు చేసింది. పోలీసులు వచ్చి అన్ని విషయాలు తెలుసుకొని వెంకటలక్ష్మి ప్రణాళిక ప్రకారం పైడితల్లి ఇంట్లో ఉన్న బంగారం నగదు తీసుకొని రమణతో కలిసి పారిపోయిందని పైడితల్లికి చెప్పారు.

బంగారం డబ్బు పోయినందుకు పైడితల్లి పెద్దగా బాధపడలేదు. తన ఒక్కగానొక్క కొడుకు తనకు దూరమైనందుకు ఆమె ఎంతగానో దిగులు పడింది. ఎలాగైనా తన కొడుకును వెదికి తీసుకొని రమ్మని ఆమె పోలీసులను ప్రాధేయపడింది. చాలా కాలం పాటు పోలీసుల చుట్టూ తిరిగింది. కానీ ఎలాంటి ఉపయోగం కనపడలేదు. తన కొడుకు ఎక్కడున్నాడో, ఏమైపోయాడో ఎన్ని కష్టాలు పడుతున్నాడో అని ఆమె అనుక్షణం బాధపడుతూ ఉండేది. రోజులు గడిచేకొద్దీ ఆమె బాధ ఎక్కువైందే గాని తగ్గలేదు. తెలిసిన వాళ్ళందరికీ తన కొడుకు వెళ్లిపోయిన విషయం గురించి చెప్పి ఎక్కడైనాకనిపిస్తాడేమో చూడండి అని ప్రాధేయపడుతూ ఉండేది. ఆమె పడుతున్న బాధను చూసి ఆమె కార్యాలయంలో పనిచేసే వాళ్ళందరూ ఎంతగానో బాధపడేవారు. ఆమెను ఊరడించడానికి తప్పనిసరిగా ఆమె కొడుకు వస్తాడని ఆమెకు ఆశ కలిగించేవారు. దానితో ఆమె ఎప్పటికైనా తన కొడుకు తిరిగి వస్తాడని గంపెడాశతో ఉండేది.

పైడితల్లి తనకు చుట్టుపక్కల ఉన్న సింహాచలం, రామతీర్థాలు, ఉప్మాక, శ్రీకూర్మం మొదలైన పుణ్యక్షేత్రాలకు వెళ్లి తన కొడుకు తిరిగి వస్తే ముడుపు చెల్లిస్తానని మొక్కుకుంది. తాను ఉంటున్న పట్టణంలోని దేవాలయాలకు వెళ్లి పూజలు నిర్వహించేది. వెళ్లిపోయిన కొడుకు పేరుతో అర్చనలు చేయించేది. తన కొడుకు వెళ్లిపోయిన విషయం ఆలయాల్లోని పూజారులకు చెప్పి వారు సూచించిన రకరకాల వ్రతాలను జరిపించింది. వీటికి చాలా డబ్బు ఖర్చు అయింది. జ్యోతిష్యులను, కొండ దొరలను, కోయదొరలను చిలక జోస్యం వారిని అంజనం వేసే వారిని, ఇలా కనబడిన వారినందరిని ఎంతో ఆశతో తన కొడుకు గురించి చెప్పి వాడు ఎక్కడున్నాడో చెప్పుమని ఎంతో ఆశతో అడుగుతూ వుండేది. వారు తూర్పు దిక్కున ఉన్నాడని కొందరు పడమర దిక్కున వున్నాడని కొందరు, ఎప్పటికైనా తిరిగి వస్తాడని కొందరు ఆమెకు చెబుతూ ఆమె దగ్గర్నుంచి డబ్బు గుంజేవారు. డబ్బు ఖర్చు గురించి ఆమె ఆలోచించేది కాదు. తన కొడుకు తిరిగి రావడానికి ఎన్ని రకాలో అవకాశాలున్నాయో అన్ని రకాల ప్రయత్నాలు పైడితల్లి చేస్తూనే ఉంది. ఎన్ని రకాలుగా ప్రయత్నాలు చేసినా ఆమె కొడుకు రాలేదు. సరికదా అతని ఆచూకీ కూడా తెలియలేదు. ఇలా అయిదు ఆరు సంవత్సరాలు గడిచాయి. అయినప్పటికీ ఆమె నిరాశ చెందకుండా తన కొడుకు రమణ ఎప్పటికైనా తిరిగి వస్తాడని గంపెడాశతో ఉండేది.

పైడితల్లి తన కుమారుని రాక కోసం చేస్తున్న ప్రయత్నం తెలిసిన కొంతమంది క్రైస్తవులు ఆమె వద్దకు వచ్చి క్రైస్తవ మతాన్ని స్వీకరించి యేసును నమ్ముకుంటే, ప్రతిరోజు యేసు ప్రార్థన చేస్తూ ఆదివారం చర్చికి వచ్చి ప్రత్యేక ప్రార్థన చేస్తే తప్పకుండా

నీ కొడుకు తిరిగి వస్తాడని ఆమెతో చెప్పారు. వారు చెప్పిన మాటల్లో కొంత ఆశ కలిగి పైడితల్లి క్రైస్తవ మతాన్ని స్వీకరించి ప్రతిరోజు ఏసుక్రీస్తును ప్రార్థిస్తూ ప్రతి ఆదివారం చర్చికి వెళ్లి ప్రార్థన చేస్తూ ఉండేది. క్రైస్తవ మతాన్ని స్వీకరించిన తర్వాత పైడితల్లి హిందూ దేవతలను పూజించడం మానేసింది. కేవలం ఏసుక్రీస్తును మాత్రమే నమ్ముకొని ఆయనను మాత్రమే పూజించేది.

ఇలా ఉండగా పైడితల్లికి కడుపులో నొప్పితో పాటు, ఆకలి మందగించడం జరిగింది. ఆమె డాక్టర్ దగ్గరికి వెళ్ళి మందులు వాడింది. కొద్ది రోజులు తగ్గినట్లు అనిపించేది. ఆ తర్వాత మళ్ళీ కడుపు నొప్పి వచ్చేది. ఇలా ఆమె ఎలాంటి పరీక్షలు చేయించుకోకుండా ఒక సంవత్సరం పాటు ఆమె మామూలు మందులు వాడుతూ వచ్చింది.

ఈ దశలో ఇంట్లో నుంచి వెళ్లిపోయిన అమె కొడుకు రమణ తిరిగి ఇంటికి వచ్చాడు. పైడితల్లి ఆనందం చెప్పనలవి గాకుండా ఉంది. తన కొడుకు తిరిగి వచ్చిన విషయాన్ని ఆమె ఆఫీసులో అందరికీ సంతోషంగా చెప్పి స్వీట్ లు పంచింది. ఆఫీస్ లో వాళ్ళు కూడా ఆమె చేసిన పూజలు వ్రతాలు ఫలించాయని ఆమెను అభినందించారు.

"ఇన్నాళ్లు ఎక్కడున్నావు, ఏం చేస్తున్నావు, ఎలా బతికావు" అని పైడితల్లి తన కొడుకుని ప్రశ్నించింది.

రమణ తల్లితో చెప్పాడు.

"వెంకట్ లక్ష్మి ఆంటీతో కలిసి హైదరాబాదుకు వెళ్ళిపోయాను. కొద్ది రోజుల పాటు వాళ్ళు నన్ను తమతో ఉంచుకున్నారు. ఆ తర్వాత నా దగ్గర ఉన్న బంగారం డబ్బులు తీసుకొని నాకు చెప్పకుండా ఎక్కడికో వెళ్ళిపోయారు. నాకు ఏం చేయాలో తోచలేదు, ఇంటికి రావాలంటే నువ్వేమంటావోనని భయం. అందుకని ఇంటికి రాలేదు. హైదరాబాదులోనే ఒక చిన్న హోటల్‌లో ప్లేట్లు కడిగే పని, టేబుల్‌లు తుడిచే పని చేశాను. ఆ హోటల్లోనే పడుకునేవాన్ని. నాతోపాటు మరో ఇద్దరు కూడా హెూటల్ లో పనిచేసే వాళ్లు అక్కడే పడుకునేవాళ్ళు. ఆ తరువాత ఇంకొక పెద్ద హోటల్లో సర్వర్ గా చేరాను. రాత్రిపూట ఆ హోటల్ లోనే పడుకునే వాన్ని. ఇంటికి తిరిగి వచ్చే వరకు ఆ హోటల్ ల్లోనే పని చేశాను. హెూటల్ యజమాని చాలా మంచివాడు. నేను ఇంట్లో నుంచి పారిపోయి వచ్చానని తెలుసుకుని చాలా రోజుల నుంచి నన్ను మన ఇంటికి వెళ్ళమని చెబుతూ వున్నాడు. నేనే భయపడి రాలేదు. చివరికి అతను చెప్పగా చెప్పగా ధైర్యం చేసి ఇంటికి వచ్చాను" అని రమణ చెప్పాడు.

"మీ హోటల్ యజమాని చల్లగా ఉండాలి నాన్న, అతని పుణ్యమా అని నువ్వు మళ్ళీ ఇంటికి వచ్చావు, అంతే చాలు తండ్రి" అని పైడితల్లి సంతోషంగా పలికింది.

పైడితల్లి కొడుకు రమణకు మోటార్ బైక్ కొనిచ్చింది. రమణ పైడితల్లిని బైకు మీద ఆఫీస్‌కు తెచ్చి మళ్ళీ ఆఫీస్ నుంచి ఇంటికి తీసుకుని వెళ్ళేవాడు. రమణ ప్రైవేటుగా ఇంటర్మీడియట్ కట్టి పాస్ అయ్యాడు. తన కొడుకుకు ఏదైనా ఉద్యోగం ఇప్పించుమని ఆమె తన ఆఫీసులో చాలా మందిని కోరింది. కానీ కుదరలేదు. ఆమె తన కొడుకు ఉద్యోగం గురించి దిగులు పడుతూ వుండేది.

ఆమె జీవితం ఇలా సాగుతున్నప్పుడు ఆమెకు కడుపులో నొప్పి ఎక్కువ అయింది. రమణ ఆమెకు అన్ని రకాల పరీక్షలు చేయించగా ఆమెకు కడుపులో కాన్సర్ ఉన్నట్లుగా తేలింది. అంతేకాకుండా అది చివరి దశలో ఉందని ఆమె ఎంతోకాలం బ్రతకదని  డాక్టర్లు చెప్పారు.

పైడితల్లి తన కొడుకు రమణకు తన అన్న కూతురునిచ్చి పెళ్లి చేసింది. ఆమెకు తన కొడుకు ఉద్యోగం గురించి దిగులు ఎక్కువైంది. పైడితల్లి తన జబ్బుకు మందులు వాడుతూనే ఉంది. అయినా ఏమీ తగ్గలేదు,ఆమె చివరి దశకు చేరుకుంది, ఒక వారం రోజులపాటు మంచం మీదే ఉండి చనిపోయింది. పైడితల్లి ఆఫీసులో పనిచేస్తున్న సిబ్బంది అందరూ వచ్చి ఆమెకు నివాళులర్పించారు. కొడుకు రమణ ఆమెకు అంతిమ సంస్కారాలు చేశాడు.

పైడితల్లి చనిపోయిన పదిహేను రోజులకు ఆమె పని చేసిన ఆఫీస్ నుంచి రమణకు ఒక కవర్ వచ్చింది. ఆ కవరు తెరిచి చూసిన రమణ మొదట ఆశ్చర్యపోయాడు. తర్వాత అపరిమితమైన ఆనందాన్ని పొందాడు. పైడితల్లి ఉద్యోగం చేస్తూ చనిపోయినందువల్ల ఆమె చేస్తున్న ఉద్యోగాన్ని కారుణ్య భర్తీ కింద రమణకు ఇస్తున్నట్లుగా అపాయింట్మెంట్ లెటర్ ఆ కవర్ లో ఉంది. ఆ కాగితాన్ని గుండెకు హత్తుకొని అమ్మను తలుచుకుంటూ అలాగే ఉండిపోయాడు రమణ.

* * *

# చదువు

"నువ్వు సదివింది సాలు, ఇంగ బడికి పోవద్దు, అన్న గొర్లను సూసుకుంటాడు, నువ్వు సేద్యం జూస్కో, ఎన్నాళ్ళని సేద్యానికి జీతగాళ్ళ మీద ఆదారపడతాం, మన పని మనం జేసుకోడం మంచిది." అన్నాడు బాలగురప్ప తండ్రి పుల్లన్న.

బాలగురప్పది చాకరాజువేముల గ్రామం. ఈ గ్రామానికి మూడు కిలోమీటర్ల దూరంలో ఉన్న దొర్నిపాడు గ్రామంలోని జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో అతను ఎనిమిదవ తరగతి ఉత్తీర్ణుడయ్యాడు. తొమ్మిదవ తరగతి పుస్తకాలు కొనడానికి డబ్బులు ఇవ్వమని అడిగితే తండ్రి చెప్పిన సమాధానమది.

పుల్లన్న గారు చండశాసనుడు. తండ్రి అంటే బాలగురప్పకు చాలా భయం. తండ్రి మాటకు ఎదురు చెప్పే ధైర్యం అతనికి లేదు. కానీ చదువు మానుకోవడం అతనికి ఏ మాత్రం ఇష్టం లేదు. ఎలాగైనా సరే బడికి పోవాలని నిర్ణయించుకున్నాడు. ఊర్లో ఉన్న ఒక పెద్ద మనిషి దగ్గరకు వెళ్లి తన పరిస్థితి వివరించి ఎలాగైనా తాను చదువుకోడానికి తన తండ్రిని ఒప్పించవలసిందిగా కోరాడు. అతని కొడుకు కూడా బాలగురప్పతో పాటు ఎనిమిదవ తరగతి పాస్ అయ్యాడు. అతని కొడుకు కంటే బాల గురప్పకు ఎక్కువ మార్కులు వచ్చాయి. ఆ పెద్దమనిషి పుల్లన్నను పిలిపించి "మీ వాడు శానా బాగా సదువుతండాడు. మంచి మార్కులు వచ్చుండాయి, అట్టాంటి పిల్లోన్ని సదువు మాన్పించడం మంచిది కాదు. నీ కొడుకు గూడా నీ మాదిరిగానే గొర్లుగాసుకుని సేద్యం జేసుకుని బతకాల్నా? నీ కొడుకు నీ కంటే మంచి పొజిషన్లో ఉండాల, దానికి సదువు ఒక్కటే మార్గం, మీవాడు బాగా సదువుతండాడు, నా

కొడుకు కంటే నీ కొడుకుకు మంచి మార్కులు వచ్చినాయి కావట్టి సదివించబ్బా" అని గట్టిగా చెప్పాడు.

పుల్లన్నగారిది విచిత్రమైన మనస్తత్వం. అతనికి ఆర్థిక ఇబ్బందులేవీ లేవు. కొడుకును చదివించలేక అతను బడి మానిపించడం లేదు. ఆయన మంచి కష్టజీవి. సోమరితనం అనేది ఎరుగడు. ఒకవైపు గొర్రెలను కాస్తూ మరొక వైపు వ్యవసాయం కూడా చేస్తున్నాడు. అతనికి కష్టపడి పని చేసే వాళ్ళంటే చాలా ఇష్టం. తన కొడుకులు కూడా కష్టపడి పని చేయాలని అతని ఉద్దేశం. కష్టపడి పని చేసే వారిని నెత్తి మీద పెట్టుకుని వారిని గురించి గొప్పగా పొగుడుతూ వుంటాడు. అతనికి చదువుకున్న వాళ్ళ మీద ఏమాత్రం సదభిప్రాయం లేదు. వాళ్లు సోమరిపోతులని, ఉద్దరి తిండి తింటున్నవారని, భూమికి భారమని ఆయన ఉద్దేశం. అందువల్ల పెద్దమనిషి చెప్పిన మాటలను పుల్లన్నగారు అంగీకరించలేదు.

"కట్టపడి పని జేచ్చే తప్పేముందన్నా? మన పని మనం చేసుకోకపోతే ఎవరు జేచ్చారు? కూలోల్లు జీతగాళ్లు ఇంటి వాళ్ళు చేసినంత బాగా మన పని జేచ్చారా? అయినా ఇప్పుడు శానా మంది సదువుకుంటండారు. సదువుకున్నోళ్ళందరికీ ఉద్యాగాలు యాడొచ్చండాయి. సదువుకున్నోళ్ళు సుకం మరిగి పని సేయలేరు. ఉద్యాగాలు రాకపోతే వాళ్లు రెంటికి చెడ్డ రేవడిగా మిగిలిపోతండారు. మాకు పలుకుబడి లేదు. పలుకుబడి లేకపోతే ఉద్యాగం రాదు. అప్పుడేం జేయాల? మావాడు ఇప్పుడు బడికి పోడానికి ముందు బడికి పోయి వచ్చినాక ఇంటి దగ్గర పని బాగా సేచ్చండాడు. బడి మానిపించి సేద్యానికి పంపితే మంచి సేద్దిగాడైతాడు. నా పెద్ద కొడుకు గొర్లు గాచ్చండాడు. సిన్న కొడుకు సేద్దెం జూసుకుంటే నాకు దిగులుండదు." అని పుల్లన్నగారు ఆ పెద్దమనిషికి చెప్పాడు.

అతని మాటలకు పెద్ద మనిషి అంగీకరించకుండా "ఇప్పుడు నీ కొడుకు సిన్నపిల్లోడు, సేద్యానికి పనికిరాడు, పదో తరగతి దాకా సదివించి అప్పుడు సేద్యానికి పంపించు. ఈ రోజుల్లో పదో తరగతి వరకు సదవడం అన్ని రకాలుగా మంచిదబ్బా, కాబట్టి పది వరకు సదివించు." అన్నాడు.

పెద్దమనిషి ఇలా ఎంత చెప్పినప్పటికీ పుల్లన్నగారు ఆయన మాట వినలేదు. ఇంటికి వచ్చిన తర్వాత బడి మానుకోమంటే మానకుండా నాకు ఊర్లో పెద్ద మనుషుల చేత చెప్పిస్తావా అని పుల్లన్నగారు బాల గురప్పను కొట్టబోయాడు. బాలగురప్ప అతనికి అందకుండా పారిపోయాడు. ఇది మామూలుగా జరుగుతున్నదే. చాలా రోజులుగా పుల్లన్న గారు కొడుకును బడికి వెళ్లవద్దని చెప్పడం, బాలగురప్ప తండ్రి మాట వినకుండా బడికి పోతూ ఉండటం, పుల్లన్న గారు అతన్ని కొట్టడానికి ప్రయత్నిస్తే తండ్రికి దొరక్కుండా పారిపోవడం జరుగుతూనే ఉంది.

పుల్లన్న గారు తరచుగా ఇంట్లో ఉండకుండా బయట తిరుగుతూ ఉంటారు. అతనికి పెద్ద గొర్రెల మంద ఉంది. వాటిని చూసుకోవడానికి వ్యవసాయం పనులు చూసుకోడానికి బయటకు వెళ్తూ ఉంటారు.  ఆ సమయంలో బాలగురప్ప ఇంట్లోని పనులన్నీ చేసి తండ్రికి తెలియకుండా దొర్నిపాడులో ఉన్న పాఠశాలకు పోతుంటాడు. అయితే అతనికి బడి ఎప్పుడైనా మాని వేయవలసి వస్తుందనే భయం ఉంది. అందుకని తన తోటి విద్యార్థులతో “మానాయన చదువు మానుకోమంటున్నాడు, నేను ఎంత వరకు చదువుకుంటానో తెలియదు. ఎప్పుడైనా బడి మానేయొచ్చు”అని దిగులుగా బాలగురప్ప చెప్పేవాడు.

బాలగురప్ప తండ్రికి తెలియకుండా వాళ్ళ అమ్మనడిగి డబ్బులు తీసుకొని తొమ్మిదవ తరగతి పుస్తకాలు కొనుక్కుని బడికి పోవడం మొదలుపెట్టాడు. పుల్లన్న గారికి ఏడు, ఎనిమిది గేదెలు, రెండు ఆవులు, జత ఎద్దులు ఉన్నాయి. బాలగురప్ప తెల్లవారుజామునే లేచి పశువుల కింద వున్న పేడ రొచ్చు తీసి దిబ్బలో వేసి, గేదెలను గంటసేపు అలా తిప్పుకొచ్చేవాడు. తర్వాత తమ ఇంటికి దగ్గర వున్న గిలకల బావి నుంచి నీళ్లు చేదుకొని తెచ్చి ఇంట్లో బాన, పొంత, తొట్టి అన్నీ నింపేవాడు. కళ్ళంలో నుంచి ఎద్దులకు గేదెలకు అవసరమైన ఎండు వరిగడ్డిని సొప్పను తెచ్చి మచ్చు మీద పెట్టేవాడు. ఈపనులన్నీ బడికి పోవడానికి ముందు బాలగురప్ప చేసేవాడు. బడికి వెళ్లి వచ్చిన తర్వాత కూడా ఇంట్లో ఏ పని ఉన్నా ఆపనంతా చేసేవాడు. ఇలా చేయటం వల్ల పుల్లన్న  గారికి బాలగురప్ప మీద కోపం కొంచెం తగ్గేది. అప్పుడప్పుడు తన మాట వినడం లేదని కోపం వస్తూ వుండేది. కోపం వచ్చినప్పుడు బాల గురప్ప తండ్రికి దూరంగా ఉండేవాడు. ఈ విధంగా బాలగురప్ప తండ్రికి దూరంగా ఉంటూ, ఇంట్లోని పనులన్నీ బాగా చేస్తూ తండ్రి కోపాన్ని తగ్గిస్తూ పదో తరగతి పూర్తి చేశాడు.

అసలు సమస్య ఇక్కడ మొదలైంది. పుల్లన్నగారు బాలగురప్పను పదో తరగతి వరకు చదివించి ఆ తర్వాత తప్పనిసరిగా బడి మాన్పించి సేద్యానికి పంపించాలని ముందుగానే నిర్ణయించుకున్నారు. అందువల్ల పదవ తరగతి వరకు బడి మానుకోమని బాలగురప్ప మీద పెద్దగా ఒత్తిడి తేలేదు. పది పాస్ అయిన తర్వాత ఎట్టి పరిస్థితుల్లోనూ చదువు అవసరం లేదని పుల్లన్న గారు బాలగురప్పకు చెప్పేశారు.

బాలగురప్పకు ఏం చేయాలో తోచలేదు. ఏది ఏమైనా చదువు మాత్రం మానగూడదని చాలా గట్టిగా నిర్ణయించుకున్నాడు. తండ్రికి తెలియకుండా ముందుగానే కోయిలకుంట్ల ఆళ్లగడ్డ లో ఉన్న గవర్నమెంట్ జూనియర్ కళాశాలలో ఇంటర్మీడియట్ అప్లికేషన్ ఫారాలు తెప్పించి వాటిని పూర్తిచేసి ఆ కళాశాలలకు పంపించాడు. రెండు

ఊర్లలోని జూనియర్ కళాశాలల్లో బాలగురప్పకు ఇంటర్మీడియెట్ లో చేరడానికి సీటు వచ్చింది. ఇంటర్మీడియట్‌లో సీటు వచ్చినట్లుగా తన తల్లికి అన్నకు చెప్పాడు. వాళ్లు పుల్లన్న గారికి చెప్పారు. పుల్లన్న గారు వారి మాటలను లెక్కచేయలేదు. తర్వాత బాలగురప్ప తన ఊర్లో ఉన్న నలుగురు పెద్ద మనుషుల దగ్గరికి వెళ్లి తన పరిస్థితి వివరించి తాను చదువుకోవడానికి తన తండ్రిని ఒప్పించి వలసిందిగా కోరాడు. పెద్ద మనుషులు పుల్లన్న గారిని పిలిపించి అనేక రకాలుగా చెప్పారు. తర్వాత బాల గురప్ప తాను చదువుకున్న ఉన్నత పాఠశాల హెడ్మాస్టర్ ను కలిసి తన పరిస్థితి వివరించి, తన చదువు కొనసాగడానికి తన తండ్రిని ఒప్పించ వలసిందిగా కోరాడు. పాఠశాల హెడ్మాస్టర్ చాలా మంచివారు. ఆయన పనిగట్టుకుని దొర్నిపాడు నుంచి చాకరాజువేములకు వచ్చి పుల్లన్న గారిని కలుసుకుని బాలగురప్పను చదివించుమని అనేక రకాలుగా చెప్పారు. బడి మానుకోవాల్సి వస్తుందనే అనుమానంతో బాలగురప్పకు అన్నం నీళ్లు సహించేవి కాదు. నిద్ర పట్టేది కాదు. దానివల్ల అతను బాగా చిక్కిపోయాడు. బాలగురప్ప తల్లి వెంకటమ్మ గారు కొడుకు పరిస్థితిని పుల్లన్న గారికి చెప్పి బాలగురప్పను చదివించమని పోరుతూ వుండేది.

ఇంతమంది చెప్పడం వల్ల పుల్లన్న గారికి బాల గురప్పను చదివించక తప్పలేదు. అతను అయిష్టంగానే బాలగురప్ప చదువుకోవడానికి అంగీకరించాడు. అప్పుడు బాలగురప్ప తన తండ్రితో "నేను పాస్ అయి పైతరగతికి పోతున్నంత కాలం ఉద్యోగం వచ్చేవరకు చదువుకుంటాను, ఫెయిల్ అయితే వెంటనే చదువు మానేసి సేద్యం జేస్తాను. ఎంత చదువుకున్నా సెలవులకు ఇంటికి వచ్చినప్పుడు ఇంటి దగ్గర పనులన్నీ చేస్తాను" అని చెప్పాడు. పుల్లన్న గారు తన కొడుకు చెప్పిన దానికి సరేలే అన్నారు. తాను చదువుకోడానికి తండ్రి అంగీకరించడంతో బాలగురప్పకు ఎక్కడ లేని సంతోషం కలిగింది.

బాలగురప్ప ఆళ్లగడ్డ లోని ప్రభుత్వ జూనియర్ కళాశాలలో ఇంటర్మీడియట్ చేరాడు. పదవ తరగతిలోని తన సహాధ్యాయులైన కొందరితో కలిసి ఆళ్లగడ్డలో గది తీసుకుని వంట చేసుకుంటూ ఇంటర్మీడియట్ చదువుతున్నప్పుడు అతని చదువుకు జై ఆంధ్రా ఉద్యమ రూపంలో గండం వచ్చింది. జై ఆంధ్రా ఉద్యమం ముమ్మరంగా సాగుతున్న సమయంలో కళాశాలలన్నింటికీ రెండు నెలలకు పైగా శెలవులు వచ్చాయి. ఆ సమయంలో బాలగురప్ప ఇంటి వద్దనే ఉండి వ్యవసాయం పనులను బాగా చేశాడు. రెండున్నర నెలల తర్వాత ఉద్యమం సద్దు మనగడంతో మళ్లీ కళాశాలను ప్రారంభించారు. బాలగురప్ప కళాశాలకు పోవడానికి సిద్ధం కాగా పుల్లన్నగారు అందుకు ఒప్పుకోలేదు. "సేద్యానికి అలవాటు పడినావ్ కదా పూర్తిగా సదువు మానుకొని

సేద్యం జెయ్యి" అని చెప్పారు. బాలగురప్ప చదువుకుంటానని ఎంత బతిమాలినా పుల్లన్నగారు  అంగీకరించలేదు. బాలగురప్ప కూడా చదువు మీద ఆశ వదిలివేసి వ్యవసాయం పనులు చేస్తున్నాడు.

అంతకుముందు పుల్లన్న గారు పొట్టేళ్లను కొంతమంది వ్యాపారస్తులకు అమ్మారు. ఆ వ్యాపారస్తులు పుల్లన్న గారి కుటుంబానికి సన్నిహితులు. వారు డబ్బులు తీసుకొని పుల్లన్న గారికి ఇవ్వడానికి వచ్చారు. బాలగురప్పను చూసి ఇంకా కాలేజీకి పోలేదేమి ? అని అడిగారు. నాయన చదువు మానిపించినాడని బాలగురప్ప చెప్పాడు. వాళ్లు వెంటనే "నీ కొడుకు కూడా నీ మాదిరిగానే గొర్లు గాసుకుంటూ ఎండకు వానకు చలికి తట్టుకొని బతకాల్నా?"అని పుల్లన్న గారికి గట్టిగా చీవాట్లు పెట్టి కొంత డబ్బు బాలగురప్పకు ఇచ్చి వెంటనే చదువుకోవడానికి వెళ్లిపొమ్మని చెప్పారు. బాలగురప్ప బతుకు జీవుడా అని ఆలస్యం చేయకుండా వెంటనే బట్టలు సర్దుకుని అత్యంత సంతోషంతో ఆళ్లగడ్డకు వెళ్లి చదువుకోవడం ప్రారంభించాడు. దానితో అతని చదువు కొనసాగింది. ఆ వ్యాపారస్తులను తన చదువు కొనసాగించడానికి వచ్చిన దేవతలుగా అతను భావిస్తుంటాడు.

ఇంటర్మీడియట్ ఆళ్లగడ్డలో పూర్తి చేసిన తర్వాత బాలగురప్ప గుంటూరు జిల్లా నరసరావుపేటలో ఉన్న ఎస్ ఎస్ ఎన్ కళాశాలలో బి.ఏ. చదువుకున్నాడు. విశాఖపట్నం లో ఉన్న ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఎం.ఏ. తెలుగు పూర్తిచేశాడు. తర్వాత అక్కడే పిహెచ్.డి. కూడా చేశాడు. పిహెచ్.డి. అయ్యేవరకు సెలవులకు ఇంటికి వచ్చినప్పుడు అన్ని రకాల పనులు చేస్తూ ఉండేవాడు. పశువుల కింద పేడా రొచ్చు తీసి దిబ్బలో వేయడం, బర్రెలను కాయడం, వరిమడి గెనాలను కొట్టడం, వరినారు పీకడం, జొన్నసొప్ప కోసి సొప్పగూళ్ళు వేయడం, జొన్నకంకులు కోయడం, వేరుశెనగకట్టె పీకడం, దిబ్బను తవ్వి ఎరువును బండిలో పోసి బండికి ఎద్దులను కట్టి ఎరువును చేనులో వదిలిపెట్టడం మొదలైన అన్ని పనులను చేసేవాడు. బాలగురప్ప ఏ తరగతిలోనూ ఫెయిల్ కాలేదు. అందువల్ల అతను చదువు మానుకోవలసిన అవసరం కలగలేదు.

బాలగురప్ప తర్వాత ఒరిస్సాలో ఉన్న బరంపురం విశ్వవిద్యాలయంలో డి.లిట్. పూర్తి చేశాడు. డాక్టర్ ఆఫ్ లిటరేచర్(డి.లిట్.) ప్రస్తుతం భూమి మీద ఉన్న అత్యున్నతమైన డిగ్రీ. దీని తర్వాత మరో డిగ్రీ లేదు. ఈ విధంగా బాల గురప్ప చదువు మీద వున్న ఆసక్తితో తన తండ్రిని ఒప్పించి ఆర్ట్స్ లో శిఖర స్థాయిలో ఉన్న డి.లిట్. డిగ్రీ వరకు చదువుకున్నాడు.

తన చదువుకు ఆటంకం కలిగించినందుకు బాలగురప్ప ఏనాడు తన తండ్రిని మనసులో గానీ బయట గానీ నిందించలేదు. తన తండ్రి చిన్నప్పటినుంచి గొర్రెలు మేకలు కాస్తూ వ్యవసాయం చేస్తూ కష్టపడి పని చేయడమే జీవితంగా భావించాడు. మనిషికి చదువు అవసరమని దాని వల్ల జ్ఞానం చైతన్యం కలుగుతాయని చదువు వల్ల బతుకులు బాగుపడి పై స్థాయికి వెళ్ళవచ్చని ఆయన వూహించలేదు. తన కొడుకు కూడా తన లాగే కష్టపడి బతకాలని ఆయన భావించాడు. అంతకంటే ఎక్కువగా అతని ఆలోచనలు సాగలేదు. అది ఆయన తప్పు కాదు. ఆయన పుట్టి పెరిగిన వాతావరణం, చుట్టూ ఉన్న వాతావరణం అందుకు కారణం. అందువల్ల బాలగురప్ప తండ్రిని అర్థం చేసుకొని ఆయనను ఏనాడు నిందించలేదు.

బాలగురప్ప ఇంటర్మీడియట్ పాస్ అయిన తర్వాత బి.ఏ., లో చేరడానికి, ఎం.ఏ. చదవడానికి, పిహెచ్.డి. చేయడానికి పుల్లన్నగారు ఎలాంటి ఆటంకం కలిగించలేదు. ఆ వూర్లో పిహెచ్.డి. చేసిన మొదటి వ్యక్తి బాలగురప్పనే. తన కొడుకు తన వూర్లో అందరి కంటే పెద్ద చదువులు చదివినందుకు ఆయన చాలా సంతోషించారు. అలాగే తన కొడుకు ఊర్లో అందరి కంటే పెద్ద చదువులు చదివినప్పటికీ ఏమాత్రం సిగ్గుపడకుండా గర్వం లేకుండా ఇంట్లోని పనులన్నీ చేయడం, వ్యవసాయ పనులు చేయడం ఆయనకు మరింత సంతోషాన్ని కలిగించింది.

తన చదువు విషయంలో ఎదురైన ఆటంకాలు అధిగమించి విశ్వవిద్యాలయంలో పీహెచ్.డి. చేయడం, డి.లిట్. చేయడం బాలగురప్పకు కలలో జరిగినట్లుగా అనిపిస్తూ ఉంటుంది. ఈవిషయం తలుచుకున్నప్పుడు అతనికి ఆశ్చర్యంతో పాటు ఆనందం కూడా కలుగుతూ ఉంటుంది.

* * *

# పేరు మార్పు

బాలగురప్ప ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తెలుగు ఎం.ఏ. రెండవ సంవత్సరం చదువుతున్న రోజుల్లో ఆ సంఘటన జరిగింది. ఆ సంఘటన చిన్నదే అయినప్పటికీ అది అతని మీద పెద్ద ప్రభావాన్నే చూపించింది. ఒక రోజు ఉదయం అతను టిఫిన్ చేయడానికి తన గది నుంచి డైనింగ్ హాల్ కు వెళ్తున్నాడు. ఆ హాస్టల్ లోనే ఉంటున్న అతనికి పరిచయం లేని ఒక విద్యార్థి అతనితో పాటు వస్తూ "మీ పేరు ఆరు జిల్లాలకు అందగాడుగా ఉందండి" అని ఎగతాళిగా అన్నాడు. బాలగురప్ప వెంటనే "మీరు కూడా ఆరు జిల్లాలకు అందగాడుగా ఉన్నారండి" అన్నాడు. వెంటనే అతని ముఖం మాడిపోయింది. అతను నల్లగా కొంత వికారంగా ఉన్నాడు. భౌతికమైన అతని రూపాన్ని వ్యాఖ్యానించి ఆవిద్యార్థిని బాధపెట్టినందుకు బాలగురప్ప చాలా విచారించాడు. అలాగే తన పేరు ఇతరులు ఎగతాళి చేసే విధంగా ఉన్నందుకు అతను చాల బాధ పడ్డాడు.

పేర్ల విషయంలో బాలగురప్పకు కొన్ని ఖచ్చితమైన అభిప్రాయాలున్నాయి. పేర్లు అందంగా అర్థవంతంగా చిన్నవిగా ఉండాలనేది అతని అభిప్రాయం. అంతేకాకుండా తన పేరు గురించి పేరు గలవారు నా పేరు చాలా బాగుంది అని గర్వించే లాగా సంతోషించే లాగా ఉండాలనేది కూడా అతని అభిప్రాయం. కానీ తన పేరు మాత్రం అలా లేనందుకు ఇతరులు ఎగతాళి చేసే లాగా ఉన్నందుకు అతను బాధపడుతూ వుండేవాడు. అందుకని అతను తన పేరును మార్చుకోవాలని గట్టి నిర్ణయానికి వచ్చాడు

బాలగురప్ప రాయలసీమలోని నంద్యాల జిల్లాకు చెందినవాడు. అతను ఒకటవ తరగతి నుంచి ఐదవ తరగతి వరకు అతని అమ్మమ్మ గారి ఊరైన ఇటిక్యాలలో చదువుకున్నాడు. ఆరవ తరగతి ఇటిక్యాలకు నాలుగు కిలోమీటర్ల దూరంలో ఉన్న

కొలిమిగుండ్లలో, ఏడవ తరగతి నుంచి పదవ తరగతి వరకు తన సొంత ఊరైన చాకరాజువేములకు మూడు కిలోమీటర్ల దూరంలో ఉన్న దొర్నిపాడులో, ఇంటర్మీడియట్ ఆళ్లగడ్డలో చదువుకున్నాడు. అతను చదువుకొన్న ఈ ప్రాంతాల్లో బాలగురప్ప అనే పేరు కొత్తది కాదు. కొంత మంది గురప్ప అనే పేరును ఆ ప్రాంతాల్లో పెట్టుకున్నారు. అందువల్ల ఆ పేరు అందరికీ సుపరిచితమే. ఎవరూ ఆ పేరును కొత్తగా చూసేవారు కాదు. బాలగురప్ప బి.ఏ. గుంటూరు జిల్లా నరసరావుపేటలో ఎం.ఏ. విశాఖపట్నంలో ఉన్న ఆంధ్ర విశ్వవిద్యాలయంలో చదువుకున్నాడు. ఈ ప్రాంతాల్లో బాలగురప్ప పేరును విన్నవారు చాలా కొత్తగా వింతగా చూసేవారు. అంతేకాకుండా అతని పేరును మామూలుగా కాకుండా "ర"కు "ర"వత్తు ఇచ్చి బాలగుర్రప్ప అని కొంచెం ఎబ్బెట్టుగా పలికేవారు, పిలిచేవారు. ఇది అతనికి చాలా ఇబ్బందిగా ఉండేది. అసలే అతను మొదటి నుంచి చాలా సిగ్గరి. ఈ పేరు వల్ల అతను మరింత సిగ్గుపడుతూ ఉండేవాడు. తన పేరు ఎవరికీ తెలియకుండా, తనను ఎవరూ పిలువకుండా ఉండేందుకు ప్రయత్నిస్తూ ఉండేవాడు.

బాలగురప్ప నరసరావుపేటలో బి.ఏ. చదువుతున్నపుడు రాయలసీమ ప్రాంతానికి చెందిన మద్దయ్య అనే అతను అతనితో పాటు చదువుతున్నాడు. మద్దయ్య చాలా తెలివైనవాడు. కర్నూలు జిల్లా బనగానపల్లి దగ్గర మద్దిలేటి స్వామి అనే పేరు గల దేవుడున్నాడు. అతని పేరుతో ఆ ప్రాంతంలోని ప్రజలు మద్దిలేటి, మద్దిలేటి రెడ్డి, మద్దయ్య, మద్దమ్మ అనే పేర్లు పెట్టుకుంటారు. సాధారణంగా కాలేజీలో అటెండెన్స్ రిజిస్టర్‌లో పేర్లు ఇంగ్లీష్‌లో రాస్తూ ఉంటారు. మద్దయ్య పేరు ఇంగ్లీషులో Maddayya అని గాని Maddaiah అని గాని ఉంటుంది. ఆ ప్రాంతంలోని లెక్చరర్లకు ఆ పేరుతో పరిచయం లేకపోవడం వల్ల క్లాసులో అటెండెన్స్ వేసేటప్పుడు అతని పేరును మడ్డయ్య అని పిలిచేవారు. క్లాసులో అందరూ గొల్లున నవ్వేవారు. అమ్మాయిలు సిగ్గుతో తలవంచుకునేవారు. మద్దయ్యకు అది చాలా అవమానంగా ఉండేది. కొంతమంది అతన్ని అవమానించడానికి బయట కూడా మడ్డయ్య అని పిలిచేవారు. అతని బాధ వర్ణనాతీతంగా ఉండేది. చివరకు అవమానం తట్టుకోలేక అతను చదువు మానేసి వాళ్ల ఊరికి వెళ్ళిపోయాడు. ఆ సంగతి గుర్తుకు వచ్చినప్పుడు బాలగురప్పకు చాలా బాధగా ఉంటుంది. పేరు కారణంగా ఒక తెలివైన విద్యార్థి చదువు మానేసి వెళ్లిపోవడం చాలా శోచనీయమైన విషయం.

పాఠశాల రికార్డుల ప్రకారం గొల్ల బాలగురప్ప అనేది అతని పూర్తి పేరు. గొల్ల అనేది అతని కులం పేరు. అతని ఇంటి పేరు మర్రిబోయిన. అతను ప్రాథమిక పాఠశాలలో చదువుతున్నప్పుడు అక్కడి ఉపాధ్యాయుడు కులం పేరును ఇంటిపేరుగా

చేర్చి అతని పేరు గొల్ల బాలగురప్పఅని పాఠశాల రికార్డులలో నమోదు చేశారు. ఆరోజుల్లో చాకలి మంగలి కుమ్మరి మొదలైన వెనుకబడిన కులాలకు చెందిన పిల్లల విషయంలో తరచుగా ఇది జరుగుతూ ఉండేది. ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయులకు తమ పాఠశాలలో చదివే ప్రతి విద్యార్థికి ఒక ఇంటిపేరు ఉంటుందని వారి ఇంటి పేరుతోనే విద్యార్థుల పేర్లు నమోదు చేయాలనే జ్ఞానం ఉండేది కాదు. అయితే అందరి విషయంలోనూ అలా జరిగేది కాదు. రెడ్డి కమ్మ బలిజ బ్రాహ్మణ మొదలైన అగ్ర కులస్తుల పిల్లలకు వారి వారి ఇంటి పేరుతోనే పేరు నమోదు చేసేవారు. వెనుకబడిన తరగతుల కులాలకు చెందిన విద్యార్థుల విషయంలోనే ఈ విధమైన సమస్య అప్పట్లో తరచుగా జరిగేది. వెనుకబడిన తరగతుల కులాల వారు తమ పిల్లలను తీసుకొని వచ్చి బడిలో చేర్చడం జరిగేది కాదు. పిల్లలు బడికి తమంత తాముగా వచ్చేవారు. తమకు ఇంటిపేరు ఉంటుందనే విషయం కూడా ఆ పిల్లలకు తెలియదు. వారు ఉపాధ్యాయులకు తమ పేరు చెప్పేవారు. ఉపాధ్యాయులు ఆ పేరుకు ముందు కులం పేరును తగిలించేవారు. బాలగురప్ప పేరును కూడా  అలాగే గొల్ల బాలగురప్ప అని పాఠశాలలో నమోదు చేశారు. ఇంటి పేరుగా ఉన్న కులం పేరును తొలగించి దాని స్థానంలో తన అసలైన ఇంటి పేరు అయిన మర్రిబోయిన పదాన్ని తన ఇంటి పేరుగా మార్చుకోవాలని కూడా అతను భావించేవాడు.

గురప్ప అనేది దేవుని పేరు. బాలగురప్ప కుటుంబానికి ఇంటి దేవుడు గురప్ప స్వామి. ఈ స్వామి కడప జిల్లా జమ్మలమడుగుకు సమీపంలో గండికోట దగ్గర ఉన్న తురకల చెరువు అనే పేరు గల చెరువు కింద ఉన్నాడు. ఈ స్వామిని "తురకల చెరువు గురప్పడు" అని కూడా పిలుస్తారు. బాలగురప్ప కుటుంబంలోని అందరి పుట్టు వెంట్రుకలు ఈ స్వామి దగ్గర తీస్తారు. అతని ఇంట్లో పేర్లన్నీ ఈ స్వామి పేరుతోనే ఉన్నాయి. ఆడవారి పేర్లు గురమ్మ అని మగవారి పేర్లు గురప్ప అని పెట్టడం జరుగింది. వాళ్ళను గుర్తించడానికి వీలుగా పెద్ద, చిన్న, బాల లాంటి విశేషణ పదాలను పేరుకు ముందు చేర్చేవారు. అతని తల్లిదండ్రులకు ఏడుగురు సంతానం. మొదటి సంతానం పేరు గురప్ప.  తర్వాత ముగ్గురు ఆడపిల్లలు. మొదటి ఆమె పేరు పెద్దగురమ్మ. రెండవ ఆమె పేరు చిన్నగురమ్మ. మూడవ ఆమె పేరు బాలగురమ్మ. తర్వాత సంతానం బాలగురప్ప. అతని తర్వాత ఇద్దరు ఆడపిల్లలు, వారి పేర్లు కూడా గురమ్మలే. వీరిద్దరూ ఆ ఇంట్లో అందరి కంటేచిన్నవాళ్ళు కావటం వల్ల వీరిద్దరినీ పెద్దక్కయ్య, చిన్నక్కయ్య అని పిలిచేవారు. రాయలసీమలో తమకంటే చిన్నవారైన ఆడపిల్లలను అక్కయ్య అని పెద్దవారిని అక్క అని పిలుస్తారు.

తెలుగు ఎం.ఏ. అయిపోయిన తర్వాత బాలగురప్ప ఆంధ్ర విశ్వవిద్యాలయంలో పరిశోధనలో చేరాడు. అప్పుడు అతను తన పేరును, ఇంటిపేరును గూడా

మార్చుకోవాలని నిర్ణయించుకున్నాడు. జయదేవ్ అనే పేరు అతనికి చాలా ఇష్టం. ఆ పేరు చిన్నది, మంచి అర్ధవంతమైనది, అందమైనది కూడా. ఇంటి పేరు మర్రిబోయిన కాబట్టి అతను తన పేరును “మర్రిబోయిన జయదేవ్” గా మార్చుకోవాలని నిర్ణయించుకున్నాడు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో విచారించగా విశ్వవిద్యాలయంలోనే పేరు మార్చుకోవచ్చని తెలుసింది. దానికోసం దరఖాస్తు చేసుకున్నాడు. తన ఇంటి పేరు మర్రిబోయిన అని నిరూపించడానికి సాక్ష్యంగా అనేక రకాల డాక్యుమెంట్‌లను చూపించిన తర్వాత అతని పేరును గొల్ల బాలగురప్ప నుంచి మర్రిబోయిన జయదేవ్‌గా మార్చినట్లుగా ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి అతనికి ఆర్డర్ కాయితం వచ్చింది. ఆ తర్వాత అతను ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి బి.ఏ., ఎం.ఏ. మార్క్స్ లిస్ట్ లను కొత్త పేరుతో తీసుకున్నాడు. అతను పరిశోధన చేస్తున్న తెలుగు శాఖలో అతని పేరును మర్రిబోయిన జయదేవ్‌గా మార్చారు. అప్పటి నుంచి అతన్ని బాలగురప్పఅని కాకుండా జయదేవ్ అని పిలవడం ప్రారంభించారు. తన పేరు మారిపోయినందుకు అతను చాలా సంతోషించాడు.

అయితే పేరు మార్చుకున్న సంతోషం అతనికి ఎంతో కాలం నిలవలేదు. ఎందుకంటే పేరును ఆధికారికంగా మార్చగల అధికారం విశ్వవిద్యాలయాలకు లేదు. అది ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చేయాలి. అంటే ఆంధ్ర ప్రదేశ్ రాజపత్రం (గజిట్) లో పేరును మార్చినట్లుగా ప్రకటించాలి. అలా ప్రకటించడానికి ఒక పద్ధతి ఉంది. తాసిల్దార్ కార్యాలయంలో గానీ కలెక్టర్ కార్యాలయంలో గానీ పేరు మార్పుకు సంబంధించిన అప్లికేషన్ ఫారం తీసుకొని అందులో వివరాలు నమోదు చేసి అవసరమైన సాక్ష్యాలను తెలిపే కాయితాలను జతచేసి ఆయా కార్యాలయాల్లో ఇస్తే వాళ్ళు “సిటిజన్ ఆఫ్ ఇండియా” సర్టిఫికెట్ ఇస్తారు. ఆ సర్టిఫికెట్ తో పాటు నేను నా పేరును ఫలానా పేరు నుంచి ఫలానా పేరుకు మార్చుకోవాలనుకుంటున్నాను. దయచేసి దానికి అనుగుణంగా గజిట్ లో ప్రకటించండి అనే ఒక అభ్యర్ధన పత్రాన్ని, దానికి అవసరమైన రుసుము చెల్లించిన డిమాండ్ డ్రాఫ్ట్‌ను సర్టిఫికెట్ కు జతచేసి రాష్ట్ర ప్రభుత్వ గజిట్ కార్యాలయానికి పంపాలి. గజిట్ కార్యాలయం వారు ఆమేరకు గజిట్ లో ప్రకటిస్తారు. తర్వాత పేరును మార్చుకున్నట్లుగా ఒక ప్రాంతీయ దినపత్రికలోను, ఒక జాతీయ ఆంగ్ల దినపత్రిక లోనూ ప్రకటన ఇవ్వాలి. దాంతో పేరు మార్పు ప్రక్రియ పూర్తి అవుతుంది. పేరు మార్పుకు సంబంధించి అప్పట్లో ఉన్న పద్ధతి ఇది.

పేరు మార్పుకు (అది ఇంటి పేరు గానీ పేరు గాని) సిటిజన్ ఆఫ్ ఇండియా సర్టిఫికెట్ పొందడం ముఖ్యం. అది పొందితే ఇంటి పేరు గాని, పేరు గాని సులభంగా మార్చుకోవచ్చు. పేరు మార్పు ప్రక్రియ పూర్తయిన తర్వాత దాన్ని ఆధారం చేసుకుని

విశ్వవిద్యాలయాలు అభ్యర్థి పేరును మార్చినట్లుగా ప్రకటించాలి. ఆంధ్ర విశ్వవిద్యాలయం అధికారులకు ఈ సంగతి తెలియక పోవడం వల్ల బాలగురప్ప పేరును మర్రెబోయిన జయదేవ్ మార్చినట్లుగా విశ్వవిద్యాలయం వారు ఆర్డర్ ఇచ్చారు. ఆ ఆర్డర్ చెల్లదు. అయినప్పటికీ అతను విశ్వవిద్యాలయంలోనూ తెలుగు శాఖలోనూ మర్రెబోయిన జయదేవ్ పేరుతోనే పిలువబడుతూ వున్నాడు.

తర్వాత బాలగురప్ప ఆంధ్రప్రదేశ్ రాజపత్రంలో తన పేరును మార్చుకున్నట్టుగా ప్రకటించడం ద్వారా ఆధికారికంగా పేరును మార్చుకునే ప్రయత్నం చేశాడు. అప్పట్లో అంటే 1981లో తాలూకా వ్యవస్థ అమలులో ఉండేది. అతని సొంత ఊరు చాకరాజువేముల గ్రామం కోయిలకుంట్ల తాలూకాలో ఉండేది. అందువల్ల అతను తన పేరును మార్చుకోవడానికి కోయిలకుంట్ల తాలూకా కార్యాలయంలో సంప్రదించాడు. రెండు కారణాల చేత ఇంటి పేరు మార్చుకోవడానికి అవకాశముందని కార్యాలయం వారు చెప్పారు. ఒకటి, ఆడవారు పెళ్లయిన తర్వాత తమ ఇంటి పేరును భర్త ఇంటి పేరుగా మార్చుకోవడం. రెండు, మగవాళ్ళు వేరే ఇంటికి దత్తత వెళ్ళినప్పుడు దత్తత తీసుకున్న వారి ఇంటిపేరును తన ఇంటిపేరుగా మార్చుకోవడం. ఈ రెండు కారణాల చేత మాత్రమే ఇంటి పేరును మార్చడానికి అవకాశముందని, మరో రకంగా ఇంటి పేరు మార్చడానికి అవకాశం లేదని వారు చెప్పారు. కానీ బాలగురప్ప విషయం ఈ రెండింటికి సంబంధించినది కాదు. అందువల్ల అతని ఇంటిపేరును "గొల్ల" నుండి "మర్రెబోయిన"గా మార్చడానికి అవకాశం లేదని కోయిలకుంట్ల తాలూకా కార్యాలయంలో చెప్పారు. అయితే అతని పేరును జయదేవ్ మార్చుకోవడానికి ఎలాంటి అభ్యంతరం లేదు. కానీ బాలగురప్ప తన పేరుతో పాటు ఇంటి పేరును కూడా మార్చుకోవాలనుకున్నాడు. అందువల్ల అతను కర్నూలు జిల్లా కలెక్టర్ కార్యాలయంలో ఇంటి పేరు మార్పుకు అవకాశం ఉంటుందేమోనని అక్కడ ప్రయత్నం చేశాడు. ఇంచుమించుగా రెండు వారాల పాటు కర్నూల్ లోనే ఉండి ఇంటిపేరు మార్పు కోసం చాలా ప్రయత్నించాడు. అక్కడ కూడా ఇంటి పేరు మార్పు సాధ్యం కాలేదు. కలెక్టర్ కార్యాలయంలో  కలెక్టర్ గారి వ్యక్తిగత కార్యదర్శి సిటిజన్ ఆఫ్ ఇండియా సర్టిఫికెట్ ఇస్తారు. ఆయన తెలిసి ఉంటే సిటిజన్ ఆఫ్ ఇండియా సర్టిఫికెట్ పొందవచ్చు. అయితే బాలగురప్పకు కలెక్టర్ కార్యాలయంలో తెలిసిన వాళ్ళు ఎవరు లేకపోవడం వల్ల అతను తన ప్రయత్నంలో సఫలం కాలేక పోయాడు.

1983లో వాసుదేవరావు గారు అనే అడ్వకేట్ కొత్తగా విశాఖపట్నం ఎమ్మెల్యే అయ్యారు. ఆయన బాలగురప్పకు చాలా బాగా తెలుసు. అతను తన సమస్య గురించి ఎం.ఎల్.ఏ గారికి చెప్పాడు. వారు వెంటనే బాలగురప్పను తీసుకొని కలెక్టర్ గారి

వ్యక్తిగత కార్యదర్శి దగ్గరికి వెళ్లి బాలగురప్పను వారికి పరిచయం చేసి ఇతని పని చేసి పెట్టండి అని కోరారు. బాలగురప్ప కలెక్టర్ గారి వ్యక్తిగత కార్యదర్శి గారికి తన ఇంటి పేరుకు సంబంధించిన సమస్యను చెప్పాడు. ఆయన వెంటనే తన కింది వారికి బాలగురప్ప పేరుతో సిటిజన్ ఆఫ్ ఇండియా సర్టిఫికెట్ తయారు చేసి తీసుకొని రమ్మని చెప్పారు. వారు అరగంటలోనే సిటిజన్ ఆఫ్ ఇండియా సర్టిఫికెట్ తెచ్చి బాలగురప్పకు ఇచ్చారు. బాలగురప్ప కలెక్టర్ గారి వ్యక్తిగత కార్యదర్శి గారికి అనేక ధన్యవాదాలు చెప్పుకున్నాడు. తరువాత ఎం.ఎల్.ఏ గారికి కూడా ధన్యవాదాలు తెలియజేశాడు. సిటిజన్ ఆఫ్ ఇండియా సర్టిఫికెట్‌కు తన పేరును మర్రిబోయిన జయదేవ్ గా మార్చాలని కోరుతూ ఒక వినతిపత్రాన్ని, రాజపత్రంలో ప్రకటించడానికి అవసరమైన రుసుము చెల్లించిన డి.డి ని పొందుపరచి హైదరాబాదులో ఉన్న గజిట్ కార్యాలయానికి పంపించాడు. వారు అతని పేరును గొల్ల బాలగురప్ప నుంచి మర్రిబోయిన జయదేవ్ మార్చినట్లుగా గజిట్‌లో ప్రకటించారు. తర్వాత బాలగురప్ప ఒక తెలుగు దినపత్రికలోనూ ఒక ఆంగ్ల దినపత్రికలోనూ తన పేరును గొల్ల బాలగురప్ప నుంచి మర్రిబోయిన జయదేవ్ గా మార్చుకున్నట్లుగా ప్రకటన ఇచ్చాడు. దానితో అతని పేరు మార్పు ప్రక్రియ పూర్తయింది.

బాలగురప్ప తన పేరుతో పాటు ఇంటి పేరు గూడా మారినందుకు చాలా సంతోషించాడు. మొత్తానికి బాలగురప్ప పట్టువదలని విక్రమార్కుని లాగా ప్రయత్నించి ఇంటి పేరుగా ఉన్న కులం పేరును తొలగించి దాని స్థానంలో తన అసలైన ఇంటి పేరును, తన  పేరును మార్చుకోగలిగాడు. అయితే బాలగురప్ప అనే అచ్చమైన తెలుగు పేరును మార్చకుండా ఉంటే బాగుండేదేమో అని అతనికి అప్పుడప్పుడు అనిపిస్తూ వుంటుంది.

* * *

# నాయన

ఆ రోజు సాయంత్రం జయదేవ్ బైటికి వెళ్లి ఆరు గంటల ప్రాంతంలో ఇంటికి వచ్చి తలుపు తీయగానే ఒక కాయితం కింద పడింది. అది "ఫాదర్ సీరియస్ స్టార్ట్ ఇమ్మీడియేట్లీ" అన్న టెలిగ్రామ్ కాయితం. దాన్ని చదువుకొని వెంటనే ఆయన దుఃఖంతో కుర్చీలో కూలబడిపోయాడు. కాసేపటి తర్వాత ఆయన తన్ను తాను ఓదార్చుకొని ఇంటికి తాళం వేసి సైకిల్ ఎక్కి తోటి అధ్యాపకుల దగ్గరికి వెళ్లి కంగారు కంగారుగా విషయం చెప్పాడు. వాళ్ళు ఆయనకు ధైర్యం చెప్పి జయదేవ్ తో పాటు ఇంటికి వచ్చి ఆయనను ప్రయాణానికి సన్నద్ధం చేసి బస్టాండు వరకు వచ్చి విజయవాడ వెళ్ళే బస్సు ఎక్కించారు.

ఆరోజు1987 డిసెంబర్ 15 వతేదీ. అప్పుడు జయదేవ్ గుడివాడలో ఉన్న అక్కినేని నాగేశ్వరావు కళాశాలలో ఆంధ్రోపన్యాసకుడుగా పని చేస్తున్నాడు. ఆయన ఊరు నంద్యాల జిల్లా దొర్నిపాడు మండలంలోని చాకరాజువేముల అనే గ్రామం. కృష్ణాజిల్లా గుడివాడ నుంచి ఆ ఊరికి వెళ్లడానికి నాలుగు బస్సులు మారాలి. గుడివాడ నుంచి విజయవాడ వరకు ఒక బస్సు, విజయవాడ నుంచి నంద్యాలకు ఇంకో బస్సు, నంద్యాల నుంచి ఆళ్లగడ్డకు మరో బస్సు, ఆళ్లగడ్డ నుంచి కోయిలకుంట్లకు వెళ్ళే బస్సు ఎక్కి దొర్నిపాడు దగ్గర దిగి మూడు కిలోమీటర్లు ఆ ఊరికి నడుచుకుంటూ వెళ్లాలి. ఇదంతా మొత్తం పండ్రెండు గంటల ప్రయాణం.

గుడివాడలో జయదేవ్ ఎక్కిన బస్సు విజయవాడకు బయలుదేరింది. బస్సులో కూర్చున్నాడన్నమాటే గానీ అతని మనస్సు ప్రయాణం మీద లేదు. టెలిగ్రామ్ ఆ రోజు  ఉదయం ఇచ్చారు. ఇప్పటిలాగా ఆనాడు సెల్ ఫోన్లు లేవు. బి ఎస్ ఎన్ ఎల్ వారి లాండ్ లైన్ టెలిఫోన్ ధనవంతుల దగ్గర మాత్రమే ఉండేది. టెలిఫోన్ కోసం

ధరావత్తు( డిపాజిట్) చెల్లించి దరఖాస్తు చేసుకుంటే ఐదు సంవత్సరాల తర్వాత టెలిఫోన్ వచ్చేది. అందువల్ల అత్యవసర సమాచారం తెలుపడానికి టెలిగ్రామ్ ఒక్కటే మార్గం. టెలిగ్రామ్ చేరడానికి సుమారు 8 గంటల సమయం పట్టేది.

బస్సులో కూర్చున్న జయదేవ్ తన తండ్రి ఆరోగ్యం ఎలా ఉందో? అతను ఏస్థితిలోఉన్నాడోఅని పరిపరి విధాలుగా ఆలోచిస్తూ ఉన్నాడు.

జయదేవ్ నాయన పేరు పుల్లన్న. ఆయన చాలా కష్టజీవి, ఒక రకంగా చెప్పాలంటే పని రాక్షసుడు అనాలి. కాయకష్టం చేయడమంటే ఆయనకు చాలా ఇష్టం. అంతే కాదు ఆయన లాగా కాయకష్టం చేసేవాళ్లను చాలా ఇష్టపడే వారు, వాళ్ళను గురించి బాగా పొగిడేవారు. పెత్తనం చేయడం ఆయనకు ఏ మాత్రం నచ్చేది కాదు. ఆరుగాలం శ్రమపడడమే ఆయనకు ఇష్టం.

"చెమట కారు నట్లు శ్రమ చేసి దేహంబు

గడన చేసి కూడు కుడువవలయు

తల్లిదండ్రి సొమ్ము తాదింట కారాదు"

అనే వేమన పద్యం పుల్లన్న గారి మనస్తత్వానికి చాలా బాగా సరిపోతుంది. కష్టపడకుండా తిని కూర్చునేవారిని ఆయన ఏ మాత్రం ఇష్టపడేవారు కాదు. ఉద్దరి తిండిపోతులని వారిని గురించి ఈసడించుకునే వారు. అలాంటి వారు భూమికి భారమని ఆయన భావించేవారు.

పుల్లన్న గారు చిన్నప్పట్నుంచి గొర్రెల మేకల పాలన చేసేవారు. రాయలసీమలో గొర్రెలు మేకలను కలిపి జీవాలు అంటారు. పుల్లన్న గారికి మూడు వందల దాకా జీవాల మంద ఉండేది. జీవాల కాపరి వృత్తి చాలా కష్టమైనది, ఎంతో సహనంతో ఓపికతో కూడుకున్నది. జీవాల కాపర్లు ఎండకు ఎండుతూ వానకు తడుస్తూ చలికి వణుకుతూ రాత్రింబవళ్లు జీవాల వెంట ఉంటారు. కులవృత్తులన్నింటిలోకి ఇది చాలా కష్టమైనది. నిజానికి ఈ వృత్తి అతి పురాతనమైనది. ఆదిమానవుడు మొట్టమొదట ప్రారంభించింది ఈ వృత్తినే. అడవి జంతువులైన ఆవులు గేదెలు మేకలు గొర్రెలను పట్టుకొని వాటిని పెంపుడు జంతువులుగా మార్చి తన ఇంటి పరిసరాల్లో కట్టివేయడం ప్రారంభించాడు. ఆదిమానవులు ప్రారంభించిన ఆ వృత్తిని యాదవుల స్వీకరించి నేటికీ కొనసాగిస్తున్నారు. పాల కోసం గేదెలను అన్ని కులాల వారు పెంచుతున్నప్పటికీ ఆవుల పాలన గొర్రెల మేకల పాలన యాదవులు మాత్రమే చేస్తున్నారు. మిగిలిన కుల వృత్తుల వారందరూ కాలక్రమానుసారంగా వచ్చిన మార్పులను స్వీకరించి తమ

వృత్తులను ఆధునీకరిస్తూ సౌకర్యవంతంగా కష్టం లేకుండా సాధ్యమైనంత సుఖంగా తమ వృత్తులను చేసుకుంటున్నారు. అంతే కాకుండా మిగిలిన వృత్తి కులాల వారు తమ గ్రామంలోని తమ ఇంట్లోనే తమ కుటుంబ సభ్యుల మధ్య వుంటూ వృత్తులు చేస్తూ ఉంటారు. కానీ యాదవులు మాత్రం ఆనాడు ఆదిమానవులు చేసిన పద్ధతిలోనే నేటికి గొర్రెల మేకల పెంపకం చేస్తున్నారు. ఈ వృత్తిలో వీరు తమ గ్రామాన్ని తమ కుటుంబ సభ్యులను వదిలిపెట్టి పగలంతా అడవుల వెంట పొలాల వెంట గుట్టల వెంట తిరుగుతూ ఉంటారు. ఈ కారణం చేతనే యాదవులు సామాజికంగా రాజకీయంగా విద్యాపరంగా చాలా వెనుకబడి ఉన్నారు. అంతేకాకుండా అమాయకులుగా, అజ్ఞానులుగా అనేక మూఢనమ్మకాలతో జీవిస్తున్నారు.

యాదవులు అర్ధసంచార జీవనులు. వీరు జీవాల పాలనలో సంవత్సరంలో సగం కాలం కంటే ఎక్కువగా కొండలు అడవులు ఉన్న ప్రాంతాల్లో ఉంటారు. మైదాన ప్రాంతంలోని తమ ఊర్లలో కేవలం నాలుగైదు నెలలు మాత్రమే వీరు ఉంటారు. జూన్ నెలలో వర్షాలు ప్రారంభమవుతాయి. అప్పటి నుంచి రైతులు తమ పొలాల్లో వ్యవసాయ పనులు ప్రారంభించి పంటలు వేస్తారు. ఈ సమయంలో మైదాన ప్రాంతంలో జీవాలకు మేత లభించదు. అందువల్ల యాదవులు తమ జీవాల మందను అడవులు కొండలు గుట్టలు ఉన్న ప్రాంతాలకు తరలిస్తారు. జూన్ నెల చివరి నుంచి జనవరి నెలాఖరు వరకు అంటే దాదాపు ఏడు నెలలు వీరు తమ సొంత ఊర్లకు తమ కుటుంబాలకు దూరంగా అడవుల్లో కొండల్లో నివసిస్తూ జీవాలను మేపుతారు. జనవరి నెల చివరకు మైదాన ప్రాంతంలో పంటలన్నీ పండిపోయి కోతలు కోసి అన్ని రకాల ధాన్యాలు ఇళ్ళకు చేరతాయి. పొలం ఈటు పోతుంది. అప్పుడు యాదవులు తమ జీవాల మందను తమ ఊళ్లకు తరలిస్తారు. మైదాన ప్రాంతంలో జనవరి చివరి నుంచి జూన్ నెల వరకు వుంటారు.

పుల్లన్న గారు చిన్నప్పటి నుంచి జీవాలను కాయడం చేత జీవాలకు సంబంధించిన అన్ని విషయాలు ఆయనకు బాగా తెలుసు. జీవాలకు తగిన మేత ఎక్కడ లభిస్తుంది, వాటిని ఎక్కడ ఎలా మేపాలి, వాటికి వచ్చే రోగాలకు ఎలాంటి వైద్యం చేయాలి, జీవాల వెంట ఉండే కుక్కలను ఎలా సాకాలి, వాటి చేత నక్కల నుంచి తోడేళ్ళ నుంచి జీవాలను ఎలా రక్షించాలి మొదలైన అన్ని విషయాలు ఆయనకు బాగా తెలుసు. రాత్రిపూట ఎలా కాపలా ఉండాలి, జీవాలను ఎక్కడ ఉడిగించాలి. ఉడిగినందుకు రైతుల దగ్గర నుంచి ఎంత డబ్బులు తీసుకోవాలి మొదలైన అన్ని విషయాలు ఆయనకు చాలా బాగా తెలుసు.

## నాయన

పుల్లన్న గారి ఊరు చాకరాజువేముల గ్రామం, ఆయన ఇంటి పేరు మర్రిబోయిన, ఆ వూర్లో ఆయనను అందరూ గొల్ల పుల్లన్న అని పిలిచేవారు. ఎవరూ ఇంటి పేరుతో పిలిచేవారు కాదు. ఆ వూరు మైదాన ప్రాంతంలో ఉంది. పుల్లన్న గారి జీవాలు జనవరి చివరి నుంచి జూన్ నెల వరకు చాకరాజువేముల గ్రామంలో ఉండేవి. ఆవూరి పొలంలో జీవాలను మేపుకున్నందుకు ఊరికి పుల్లరి కట్టాలి. జయదేవ్ చిన్నతనంలో ఆ వూర్లో ఫ్యాక్షన్ తగాదా ఉండేది. ఊర్లో నాయకులు రెండు గ్రూపులుగా ఉండి పరస్పరం కొట్లాడుకునేవారు. చంపుకునేవారు. పుల్లన్న ఇరు వర్గాల వారికి పుల్లరి సమానంగా ఇచ్చేవారు. నాయకుల అనుచరులు జీవాల మంద మీద బడి నాలుగైదు జీవాలను బలవంతంగా ఎత్తుకొని పోయేవారు. పుల్లన్న వారిని బతిమాలి ఒక జీవాన్ని వాళ్ళకు ఇచ్చి మిగిలిన జీవాలను విడిపించుకుని వచ్చేవారు. జీవాల కాపరులు ఎంత జాగ్రత్తగా ఉన్నా జీవాలు తెలివి లేని ప్రాణులు కాబట్టి ఒక్కొక్కసారి పంట పొలాల్లో పడి మేస్తూ వుంటాయి. పొలాల యజమానులు జీవాల కాపరులను బూతులు తిట్టి రెండు మూడు జీవాలను పట్టుకొని కట్టేస్తారు. పుల్లన్న గారు ఆ పంట పొలాల యజమానుల దగ్గరికి వెళ్లి వారితో మాట్లాడి జీవాలను విడిపించుకుని వచ్చేవారు. ఇలాంటి విషయాల్లో ఆయన చాలా నేర్పుగా వ్యవహరించి జీవాలను తీసుకొని వచ్చేవారు.

చాకరాజువేముల పొలం చాలా పెద్దది. జనవరి నెలాఖరు నుంచి జూన్ నెల వరకు ఆ పొలంలో జీవాలను మేపుకున్నందుకు పుల్లన్న గారు పుల్లరి కట్టేవారు. ఈ కాలంలోనే ఇటిక్యాల, చింతరాపల్లె, ఉమ్మాయిపల్లె, కోర్నెపల్లె మొదలైన కొండ ప్రాంతాల్లోని యాదవులు ఆ వూరి పొలంలో తమ జీవాలను మేపుకోవడానికి వచ్చేవారు. వారు కొంత పుల్లరి కట్టేవారు. ఇలా కొత్తగా వచ్చిన వారికి పుల్లన్న గారు పూర్తి అండగా ఉండేవారు. వాళ్లకు కావాల్సిన అన్ని రకాల సహాయం చేసేవారు. వాళ్లు ఉండడానికి ఇల్లు, వంట చేయడానికి మనిషిని ఏర్పాటు చేసేవారు. వాళ్ల జీవాలు రాత్రిపూట ఉడగడానికి ఊర్లో రైతుల పొలాలను మాట్లాడేవారు. వాళ్ల జీవాలను ఎవరైనా రైతులు పట్టుకొనిపోతే పుల్లన్న గారు వెళ్లి రైతులతో మాట్లాడి జీవాలను విడిపించుకొని తెచ్చేవారు. కొత్తగా వచ్చిన వాళ్లకు ఇల్లు దొరికేవరకు వాళ్లకు ఆయన తన ఇంటి నుంచి భోజనాలు పంపించేవారు. పుల్లన్న గారి ఇంట్లో వాళ్ళందరూ ఈ విషయంలో ఆయనకు చాలా అండగా ఉండేవారు. జీవాల కాపరులు జీవాలను తోలుకొని వేరే ఊరికి పోతే ఉండే కష్టాలు ఆయనకు బాగా తెలుసు. అందుకని పుల్లన్న గారు తన ఊరికి వచ్చిన కొత్తవారికి ఎలాంటి కష్టాలు లేకుండా వారికి అన్ని రకాల సహాయం చేసేవారు.

పుల్లన్న గారికి సహాయం చేసే గుణం చాలా ఎక్కువ. తల్లిదండ్రులు లేని నరసమ్మ అనే పేరు గల ఒక అమ్మాయిని, అమాయకుడు మానసికంగా ఎదుగుదల లేని వెంకటేశ్వర్లు అనే పేరు గల ఆమె అన్నను కొంతకాలం పాటు తన ఇంట్లోనే ఉంచుకొని తన కూతుళ్ళతో సమానంగా ఆమెను చూశారు. అంతేకాదు ఆయన ఇంట్లోనే ఉంటున్న పేదవాడైన వెంకటయ్య అనే పేరు గల అతనికి ఆమె నిచ్చి పెళ్లి చేసి ఆ దంపతులకు తన ఇంటి దగ్గర్లోనే కొట్టం వేయించి అందులో వారు కాపురం ఉండేలాగా ఏర్పాటు చేశారు.

జూన్ నెల నుంచి మైదాన ప్రాంతాల్లోని రైతులు తమ పొలాల్లో వ్యవసాయ పనులు ప్రారంభిస్తారు. అప్పుడు యాదవులు తమ జీవాలను కొండ ప్రాంతానికి తోలుకొని పోతారు. పుల్లన్న గారు తమ జీవాలను కొండ ప్రాంతాలైన ఇటిక్యాల, చింతరాపల్లె, కోర్నెపల్లె, ఉమ్మాయిపల్లె, తోల్లమడుగు మొదలైన ఊర్లలోని కొండల మీద మేపేవారు. చాకరాజువేముల నుంచి కోయిలకుంట్ల,ముదిగేడు, ముక్కమల్ల, ఆల్వకొండ, రామిరెడ్డిపల్లె, పేరుసోమల, కోటపాడు, నందిపాడు, కల్వటాల, కొలిమిగుండ్ల మీదుగా ఇటిక్యాలకు నడుచుకుంటూ జీవాలను తోలుకుని వెళ్లేవారు. ఇది దాదాపు 50 కిలోమీటర్ల పైగా దూరముంటుంది. ఈ దూరాన్ని దాదాపు మూడు రోజుల్లో వెళ్లేవారు. పుల్లన్న గారు ఆయన పెద్ద కొడుకు గురప్ప జీవాల వెంట వెళ్ళేవారు.

ఇటిక్యాల జయదేవ్ అమ్మమ్మ గారి ఊరు. అక్కడ పుల్లన్న గారి కుటుంబం వుండేది. అంటే ఆయన భార్య కూతుళ్ళు కొడుకులు ఉండేవారు. అప్పట్లో వారిది ఉమ్మడి కుటుంబం. చాకరాజువేములలో పుల్లన్న గారి అన్న, తమ్ముడు కుటుంబాలు ఉండేవి. జీవాలు కొండ ప్రాంతంలో ఉన్న సమయంలో పుల్లన్న గారు ఇటిక్యాలలో తన కుటుంబంతో కలిసి వుండేవారు. ఇటిక్యాలలో ఆయనను శాకరజామల (చాకరాజువేముల) పుల్లన్న అని పిలిచేవారు. ఇటిక్యాలలో కూడా పుల్లన్న గారు జీవాలకు సంబంధించిన అన్ని విషయాలను స్వయంగా చూసుకునేవారు.

ఇటిక్యాలలో వారికి అయిదు ఎకరాల పొలం ఉండేది. పొలం పనులను కూడా ఆయనే చూసేవారు. ఇటిక్యాలలో వారికి ఎద్దులుండేవి కాదు. పుల్లన్న గారు బాడుగతో వ్యవసాయం చేయించేవారు. ఎక్కువగా జొన్న ధనియాలు పంటలు వేసే వాళ్ళు. ఈ పైర్ల మధ్యలో కంది పంట వేసేవారు. ఈ పంటలకు సంబంధించి విత్తనం వేయడం కలుపు తీయడం కోత కోయడం మొదలైన అన్ని పనులు పుల్లన్న చేసేవారు. జొన్నసొప్ప కోసిన తర్వాత దాన్ని గూళ్ళు వేసేవారు. వారం రోజులు పాటు జొన్నకంకులు ఎండిన తర్వాత కంకులను కోసి ఆ కంకులను కళ్ళంలో చేర్చి కొద్దిరోజుల తర్వాత కంకులను కంకులగుండ్లతో తొక్కించి జొన్నలను చేసేవారు. కల్లంలో కంకులు కుప్పగా

వేసినప్పుడు వాటిని తొక్కించడానికి పది పదిహేను రోజులు ఆగవలసి వుంటుంది. ఈ పదిహేను రోజులు జయదేవ్ రాత్రి పూట కంకులకు కాపలాగా కల్లంలో పడుకునే వాడు. మిగిలిన అన్ని పనులు పుల్లన్న గారు చేసేవారు. ఈ పనులన్నీ ఆయన చాకరాజువేములలో కూడా చేసేవారు.

ఇటిక్యాలలో జీవాల మంద ఉన్నప్పుడు పుల్లన్న తెల్లవారు జామున నాలుగు గంటలకే లేచి తన కూతుర్లను జయదేవ్ ను అతని అన్నను లేపేవాడు. అందరు కలిసి జొన్నచేలల్లో ఉన్న అలుము అనే తీగ జాతి మొక్కలను వేళ్ళతో సహ పీక్కొని రావడానికి వెళ్ళేవాళ్ళు. ఒక్కొక్కరు ఒక్కొక్క మోపు అలుమును పీక్కొని ఉదయం ఏడు గంటలకల్లా ఇంటికి వచ్చి ఆ అలుము వేళ్ళను ముడివేసి గొర్రెపిల్లలు మేక పిల్లలకు ఆహారంగా కట్టేవాళ్ళు. అవి ఎంతో ఇష్టంగా తినేవి. అప్పుడు జయదేవ్ కు కేవలం పది సంవత్సరాల వయస్సు వుంటుంది. ఇటిక్యాలలో జీవాలు ఉవున్నప్పుడు జీవాల కాపరులు పగలంతా జీవాలను మేపి రాత్రి ఇంటికి వచ్చి స్నానం చేసి పడుకొని పొద్దున లేచి భోజనం చేసి సద్దిమూట కట్టుకొని మళ్లీ జీవాల దగ్గరికి వెళ్ళేవారు.

ఇటిక్యాలలో జీవాల మందకు ఎక్కువ రోజులు మేత లభించేది కాదు. అక్కడ మేత అయిపోయిన తర్వాత కోర్నెపల్లె, ఉమ్మాయిపల్లె, తోళ్ళమడుగు గ్రామాల ప్రాంతాలకు జీవాల మందతో వెళ్లేవారు. ఈ ప్రాంతాలకు వెళ్లినప్పుడు జీవాల కాపరుల బతుకు చాలా దయనీయంగా ఉండేది. తోల్లమడుగు ఇటిక్యాలకు ఇంచుమించు 20 కిలోమీటర్ల దూరంలో ఉండేది. ఒకసారి జీవాలను కాయడానికి ఆ ఊరికి వెళితే మళ్లీ వారం పది రోజుల వరకు తిరిగి వచ్చేవారు కాదు. ఈ వారం పది రోజులు వారికి స్నానం ఉండదు, బట్టలు మార్చుకోవడం ఉండదు. అక్కడ భోజనం కూడా సరిగ్గా దొరకదు. జొన్నలను విసుర్రాతిలో విసిరి పగలగొట్టి ఆపగలగొట్టిన నూకతో అన్నం వండుకునేవారు. ఆ నూక సన్నగా వుండదు, లావుగా ఉంటుంది. ఆ నూకతో వండిన అన్నాన్ని పగలగొట్టిన సంగటి అనేవారు. ఆ అన్నాన్ని పచ్చిమిరపకాయ ఉల్లిగడ్డ ఉప్పు వేసి దంచిన పచ్చికారంతో తినేవారు. ఆ భోజనం ఏమాత్రం రుచిగా ఉండదు. అయినా తప్పనిసరై వారు ఆ భోజనాన్ని తినేవారు. గొర్రెల మేకల పాలు కూడా అన్నంలో వేసుకునేవారు. ఆ భోజనం కూడా సరైన సమయంలో చేయడానికి వీలుండేది కాదు. తోల్లమడుగు నుంచి ఇటిక్యాలకు రాకపోకలన్నీ కాలి నడకతోనే. అలాగా ఇంచుమించుగా ఐదు నెలల పాటు జీవాల కాపరులు గడిపేవారు. నిజంగా ఆ జీవితం చాలా దయనీయమైనది. ఒకసారి జయదేవ్ కూడా అక్కడికి వెళ్లి మూడు రోజులు జీవాల మంద దగ్గర ఉన్నాడు

జయదేవ్ ఆరవ తరగతి చదువుతున్నప్పుడు అతని నాన్న వాళ్ళు ఆస్తులు పంచుకొని వేరు పోయారు. అప్పుడు పుల్లన్న కుటుంబం ఇటిక్యాలను వదిలి చాకరాజువేములకు వచ్చింది. విడిపోయిన తర్వాత పుల్లన్న 18 ఎకరాల పొలం కొన్నారు. పొలం కొనడానికి కొంత అప్పు చేసేవారు. అప్పు తీరే వరకు ఆయనకు మనశ్శాంతి ఉండేది కాదు. నిద్రలో కూడా అప్పు అప్పుఅని కలవరించేవారు. అంత గొప్ప నిజాయితీపరుడు పుల్లన్న గారు. చాకరాజువేములలో వీరికి జత ఎద్దులు 8,9 గేదెలు ఉండేవి. వ్యవసాయ పనులు చేయడానికి వీరికి జీతగాడు వుండేవాడు. వేరుశనగ జొన్న కంది ధన్యాలు వరి మొదలైన పంటలను వేసేవారు. పుల్లన్న మొదటినుంచి గొర్రెల కాపరి గా ఉండటంవల్ల ఎడ్లతో నాగలి దున్నడం, గొర్రు, గుంటక తోలడం మొదలైన పనులు తెలియవు. మిగిలిన అన్ని పనులు ఆయన చేసేవారు. విత్తనం వేయడం కలుపు తీయడం కోత కోయడం దాన్యం తూర్పు పట్టడం మొదలైన అన్ని పనులు చేసేవారు. పని ఉంటే ఒక్క నిమిషం కూడా ఊరుకునేవారు కాదు. ఎల్లప్పుడూ పనిలోనే ఉండేవారు.

పుల్లన్న బీడీలు కాల్చేవారు. అది గాకుండా సారాయి తాగే అలవాటు ఉండేది. రాత్రిపూట దాదాపు ప్రతిరోజు తాగేవారు. భోజనం సరైన సమయానికి లేకపోవడం, ఎక్కువ శ్రమ పడటం, సారాయి తాగడం వల్ల కాబోలు పుల్లన్న గారికి దాదాపు 50 ఏళ్ల వయసులో షుగర్ వ్యాధి వచ్చింది. ఆయన తన ఆరోగ్యాన్ని గురించి ఏ మాత్రం శ్రద్ధ తీసుకునేవారు కాదు. ఏనాడు చెప్పులు వేసుకోలేదు. ఆయన నడిచే ప్రాంతాలన్నీ కొండలు గుట్టలు చేలు. అయినప్పటికీ ఆయన చెప్పులు ధరించేవారు కాదు. ఎంత ఎండలో కాళ్ళు కాలుతున్నా అలాగే చెప్పులు లేకుండా నడిచేవారు. షుగర్ వ్యాధి మందులు సరైన సమయంలో వేసుకునే వారు కాదు. ఆ కారణం చేత షుగరు ఎక్కువగా ఉండేది. ఒకసారి కాలులో ముళ్ళు గుచ్చుకొని షుగర్ అదుపులో లేకపోవడం చేత సెప్టిక్ అయి కుడికాలు మోకాలు కింది భాగం వరకు తీసివేయవలసి వచ్చింది. అప్పటికీ షుగరు అదుపులోకి రాకపోవడం వల్ల మళ్ళీ మోకాలు పైభాగం వరకు తీసివేయవలసి వచ్చింది. దానితో పుల్లన్న గారు పూర్తిగా మంచంలోనే ఉండవలసి వచ్చింది. కాలకృత్యాలు ఇతరుల సాయంతో మంచంలోనే జరిగేవి. అది ఆయనకు చాలా బాధగా ఉండేది. ఇతరుల సహాయం తీసుకోవడం ఆయనకు ఏమాత్రం ఇష్టం ఉండేది కాదు. కానీ తప్పని సరి అయి తనను తాను తిట్టుకుంటూ ఇతరులు సహాయం తీసుకునేవారు. ఆ సమయంలో జయదేవ్ విశాఖపట్నంలో పరిశోధన చేస్తున్నాడు. ఇంటికి వచ్చినప్పుడు తండ్రికి అన్ని సపర్యలు జయదేవ్ చేసేవాడు. కానీ అతనున్నది తక్కువ కాలమే.

జయదేవ్ పరిశోధన పూర్తి చేసుకుని 1984 ఆగస్టు నెలలో గుడివాడలోని అక్కినేని నాగేశ్వరరావు కళాశాలలో ఆంధ్రోపన్యాసకునిగా చేరాడు. అక్కడ పని చేస్తున్నప్పుడు పుల్లన్న గారి అనారోగ్యం గురించిన టెలిగ్రాం వచ్చింది. ఈ విధంగా జయదేవ్ తన తండ్రి జీవితాన్ని గుర్తు చేసుకుంటూ విజయవాడలో నంద్యాలకు వెళ్లే బస్సు, నంద్యాలలో ఆళ్లగడ్డకు వెళ్లే బస్సు, ఆళ్లగడ్డలో కోయిలకుంట్లకు వెళ్లే బస్సులు మారి  మరుసటి రోజు తెల్లవారిన తర్వాత ఆరు గంటలకు దొర్నిపాడులో దిగాడు. అక్కడ నుంచి నడుచుకుంటూ ఊరికి వెళ్ళాడు. జయదేవ్ ఇంటికి  వెళ్ళిన తర్వాత అతని దురదృష్టం అతనికి తెలిసింది. అంతకు ముందు రోజు సాయంత్రమే పుల్లన్న గారి భౌతికకాయాన్ని వారి కళ్ళంలో భూస్థాపితం చేశారు. జయదేవ్ కు చివరి చూపు కూడా అందలేదు.  టెలిగ్రాం ఇవ్వడానికి ముందే అంటే డిసెంబరు 15వ తేదీ తెల్లవారుజామున పుల్లన్న గారు చనిపోయారు. చనిపోయారు అని చెప్పడం ఇష్టంలేక ఫాదర్ సీరియస్ అని టెలిగ్రామ్ ఇచ్చారు. ఆ రోజుల్లో భౌతిక కాయాన్ని భద్రపరిచే సౌకర్యం ఆ వూర్లో లేకపోవడం వల్ల చనిపోయిన రోజు సాయంత్రమే పుల్లన్న గారి భౌతికకాయాన్ని భూస్థాపితం చేశారు. చిన్న దినం పెద్ద దినం అయిపోయిన తర్వాత పుల్లన్న గారి భౌతికకాయాన్ని భూస్థాపితం చేసిన దగ్గర సమాధి కట్టించారు. ముద్రించిన పిహెచ్.డి. సిద్ధాంత గ్రంథాన్ని జయదేవ్ ఆయనకు అంకితమిచ్చాడు. ఆ పుస్తకం చూసినప్పుడల్లా జయదేవ్ కు తండ్రి గుర్తుకు వస్తాడు. ఆయన చనిపోయిన డిసెంబర్ 15వ తేదీన ఏదో ఒక అనాధాశ్రమంలో భోజనాలు పెట్టిస్తూ జయదేవ్ తండ్రిని తలుచుకుంటూ ఉంటాడు.

* * *

# రైలు ప్రేమ

ఆచార్య శివప్ప మూడవ తరగతి ఏ సీ రైలు బోగీలో తనకు కేటాయించిన బెర్త్ దగ్గర కూర్చున్నారు. అది ఢిల్లీలోని నిజాముద్దీన్ రైల్వే స్టేషన్. దక్షిణ్ లింక్ సూపర్ ఫాస్ట్ ఎక్స్ ప్రెస్ రైలు బయలుదేరడానికి ఇంకా అరగంట పైగా సమయం ఉంది. ప్రయాణికులు ఒక్కరొక్కరుగా వచ్చి తమ సామాన్లు సర్దుకుని తమకు కేటాయించిన సీట్లలో కూర్చుంటున్నారు. ప్లాట్ ఫాం ప్రయాణికులతో, ప్రయాణికులను సాగనంపడానికి వచ్చిన బంధుమిత్రులతో విక్రేతలతో చాలా సందడిగా ఉంది. ప్రయాణికులు తెలుగు, హిందీ, ఆంగ్ల భాషల్లో మాట్లాడుకుంటున్నారు. కూలీలు ప్రయాణికుల సామాన్లను వారి వారి బెర్త్ల కింద సర్దుతూ హిందీలో మాట్లాడుతున్నారు. రైల్లో కూర్చున్న శివప్ప తన ప్రయాణాన్ని గురించి ఆలోచించసాగారు. నిజాముద్దీన్ లో రాత్రి 10 గంటలకు బయలుదేరే ఆరైలు, ఆ రాత్రి, మరుసటి రోజు పగలు రాత్రి, ఆ మరుసటి రోజు పగలు ప్రయాణించి అంటే నలభై గంటలు ప్రయాణించి మధ్యాహ్నాం రెండు గంటలకు విశాఖపట్నం చేరుకుంటుంది. ఈరైలు ఢిల్లీ నుంచి కాజీపేట వరకు అడ్డమైన ప్రతి స్టేషన్లో ఆగుతూ పోతుంది. దీని వెనకాల వచ్చే ఎక్స్ప్రెస్ రైళ్ళు వెళ్ళడానికి వీలుగా దీన్ని ఏదో ఒక స్టేషన్ లో పక్కన పెడుతూ వుంటారు. అందువల్లనే ఈ రైలును దున్నపోతుల బండి అని పిలుస్తారు. ఇలాంటి రైలును రైల్వే వారు సూపర్ ఫాస్ట్ ఎక్స్ప్రెస్ రైలుగా ఎందుకు ప్రకటించారో శివప్పకు అర్థం కాలేదు. ప్రయాణం సమయం ఎక్కువగా ఉండడం వల్ల ఈ రైల్లో విశాఖపట్నం నుంచి ఢిల్లీకి వెళ్ళే ప్రయాణికులు తక్కువ మంది ఉంటారు. అయితే ఢిల్లీలో ఇది రాత్రి పది గంటలకు బయలుదేరుతుంది కాబట్టి ఢిల్లీలో పగటి పూట పని చూసుకుని బయలుదేరడానికి వీలుగా వుండడం వల్ల విశాఖపట్నం వెళ్ళే ప్రయాణికులు ఈ

రైల్లో ఎక్కువ మందే ఉంటారు. ఆకారణంగానే ఆచార్య శివప్ప గూడా విశాఖపట్నం వెళ్ళడానికి ఈ రైల్లో రిజర్వేషన్ చేయించుకున్నారు.

ఆచార్య శివప్ప విశాఖపట్నంలోని ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆచార్యులుగా పని చేస్తున్నారు. అప్పుడప్పుడు అధికారికమైన పని మీద ఢిల్లీకి వెళ్ళి వస్తుంటారు. ఆరోజు కూడా అధికారికమైన పని మీద ఢిల్లీకి వచ్చి పగలు ఆపని చూసుకుని తిరుగు ప్రయాణం ఈరైల్లో చేస్తున్నారు. శివప్ప గారికి నలభై అయిదు సంవత్సరాలుంటాయి. చిన్నవయసులోనే ఆచార్యులయ్యారు. అయిదడుగుల పది అంగుళాల ఎత్తుతో చామనచాయను మించిన ఎరుపు రంగులో ఉండే శివప్ప అమాయకంగా హుందాగా ఉంటారు. సున్నిత మనస్కులు. తనవల్ల, తన ప్రవర్తన వల్ల ఇతరులకు ఎలాంటి ఇబ్బంది కలిగించకుండా వుండేందుకు అతను ప్రయత్నిస్తూ ఉంటారు. ఎలాంటి భేషజాలు లేకుండా సాధ్యమైనంత సాధారణమైన జీవితం గడపడం, తనకు సంబంధించిన పనులన్నీ తానే చేసుకోవడం, శాయశక్తులా ఇతరులకు సహాయం చేయడం, పుస్తకపఠనం అతనికిష్టమైన అంశాలు. రైల్లో కూర్చున్న తర్వాత ఆరోజు గూడా కథానికల పుస్తకాన్ని చదువుతూ కూర్చున్నారు. ఆధునిక సాహిత్యంలో కథానికలు, అందులోనూ మానవ మనస్తత్వంలోని వివిధ కోణాలను చిత్రించిన కథానికలంటే అతనికి చాలా ఇష్టం.

రైలు అయిదు నిమిషాల్లో బయలుదేరుతుందనంగా తొందర తొందరగా ఒక యువతి శివప్ప కూర్చున్న ఎదురు బెర్త్ లోకి పెద్ద సూట్‌కేస్ తో ఇంకా కొంత సామానుతో వచ్చింది. సూట్‌కేస్ ను బెర్త్ కింద పెట్టడానికి ఆమె తంటాలు పడుతుంటే శివప్ప సాయం చేసి మళ్ళీ పుస్తక పఠనంలో నిమగ్నమయ్యారు. ఇంతలో ఒకతను వచ్చి తమ సామాన్లు పెట్టుకోవడానికి స్థలం లేకుండా ఆమె సామాను పెట్టుకుందని ఆ యువతి తో తగాదాకు దిగాడు. శివప్ప బెర్త్ కింద ఉన్న సామాన్లనింటినీ అటూ ఇటూ జరిపి అతని సామాన్లని సర్దారు. అతను చేసిన సహాయానికి ఆమె ఆంగ్లంలో కృతజ్ఞతలు తెలిపింది. ఇంతలో రైలు బయలుదేరింది. సమయం పది గంటలు కావడంతో అందరూ తమ తమ బెర్త్ లు సర్దుకుని పడుకున్నారు. శివప్పగారిది అప్పర్ బెర్త్. ఆయువతిది ఎదురుగా ఉన్న మధ్య బెర్త్.

శివప్పగారికి తెల్లవారు జామున ఐదు గంటలకు లేచి ఐదున్నరకు నడకకు వెళ్ళటం అలవాటు. అతనికి తెల్లవారు జామున ఐదు గంటల తర్వాత నిద్ర పట్టదు. ఈ అలవాటు ప్రకారం శివప్ప గారు తెల్లవారు జామున అయిదింటికి లేచి పళ్ళు తోముకుని రైల్లో నడక కుదరదు కాబట్టి రెండు బెర్త్ ల మధ్యలో నిల్చుని ఏమి చేయాలో పాలుపోక అటూ ఇటూ చూస్తూ మధ్య బెర్త్ లో పడుకున్న యువతి వైపు

చూశారు. ఆమె అతని వైపే చూస్తూవుంది. శివప్ప ఆమె వైపు ఒక క్షణం చూచి వెంటనే చూపు మరల్చుకున్నారు. ఆమె తన వైపే చూస్తూ ఉండడం గమనించారు. కాసేపైన తర్వాత శివప్ప గారు పై భాగాన ఉన్న తన బెర్త్ లోకి వెళ్లి పడుకున్నారు. శివప్ప గారు సిగ్గరి. ఆడవాళ్ళ పట్ల కొంత పిరికితనం ఉన్నవారు.

తెల్లవారిన తర్వాత ఏడు గంటల నుంచి మొదలుకొని ఒక్కొక్కరు లేచి పళ్ళు తోముకోవడం ఇతర కాలకృత్యాలు తీర్చుకోవడం అల్పాహారం తీసుకోవడం ప్రారంభించారు. మొత్తానికి పది గంటలకల్లా అందరూ లేచి బెర్త్ లను పైకి లేపి కింద తమ తమ సీట్లలో కూర్చున్నారు. కొందరు సెల్ ఫోన్లలో మాట్లాడుకుంటూ వుంటే మరికొందరు పక్క వాళ్లతో మెల్లగా సంభాషణ ప్రారంభించారు. శివప్ప గారు ఎదురుగా కూర్చున్న యువతి వైపు కొంత పరిశీలనగా చూశారు. ఆమెకు ముప్పై అయిదు నలభై సంవత్సరాల మధ్య వయస్సుండవచ్చు. సన్నగా మంచి ఎరుపు రంగుతో కళ గల నవ్వు ముఖంతో అందంగా ఎలాంటి ఆభరణాలు లేకుండా చాల సాధారణంగా ఉంది. యువతి శివప్ప గారి వైపు చూసి చిన్నగా నవ్వి సంభాషణ మొదలు పెట్టి మొదట అతణ్ణి గురించి అడిగింది. శివప్ప గారు విశాఖపట్నంలోని ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తాను ప్రొఫెసర్ నని, అధికారికమైన పనిమీద ఢిల్లీకి వచ్చానని చెప్పారు. శివప్ప గారు ఆమెను గురించి అడిగారు. ఆమె తమ సొంత ఊరు ఢిల్లీ అని, అక్కడనే తను మెడిసిన్ ఆతర్వాత గైనకాలజీలో పీ.జీ చేశాననీ, తన భర్త విశాఖపట్నంలో నావల్ ఆఫీసరని, సంవత్సరం కిందట తన భర్తకు విశాఖపట్నానికి ట్రాన్స్ఫర్ అయిందని, ఒక సంవత్సరం నుంచి విశాఖపట్నంలో ఉంటున్నామని, ప్రస్తుతం విశాఖపట్నం పోతున్నానని చెప్పారు. వారి సంభాషణ ఆంగ్ల భాషలో సాగింది. ఆమె చెప్పింది విన్న తర్వాత శివప్పగారికి కొంత ఆశ్చర్యం వేసింది. మెడిసిన్ లో పోస్ట్ గ్రాడ్యుయేషన్ చేసిన ఆమె ఎలాంటి భేషజాలు లేకుండా చాలా మామూలుగా సర్వసాధారణంగా ఉంది. అదే విషయం ఆమెతో చెప్పారు. ఆమె చిరునవ్వు నవ్వి ఊరుకున్నారు. ఆమె మీద శివప్ప గారికి గౌరవం ఏర్పడింది. తర్వాత మాటల సందర్భంలో ఆమె విశాఖపట్నంలో పెదవాల్తేరు నుంచి జాలారి పేటకు వెళుతున్న రోడ్డులో క్లినిక్ ప్రారంభించి నామమాత్రమైన ఫీజుతో వైద్యం చేస్తున్నానని, తెలుగు కొంచెం కొంచెం నేర్చుకుంటున్నాని చెప్పింది. శివప్ప గారికి ఆమె మీద గౌరవం రెట్టింపయ్యింది. ఎందుకంటే జాలారి పేట పూర్తిగా చేపలు పట్టే జాలర్లు నివాసమున్న ప్రదేశం. వాళ్ళందరూ పేదవారు, ఏ రోజుకారోజు చేపలు అమ్ముకొని జీవించేవారు. ఆ ప్రాంతంలో డబ్బును ఆశించే డాక్టర్లు ఎవరు క్లినిక్ పెట్టరు. ఈమె పెట్టిందంటే తప్పనిసరిగా డబ్బు కోసం కాకుండా సేవా దృక్పథంతోనే క్లినిక్ ప్రారంభించి ఉంటుందని భావించారు. ఆమె మాట్లాడేటప్పుడు శివప్ప గారి పట్ల ప్రేమ, ఇష్టం

స్పష్టంగా వ్యక్తం చేస్తూ మాట్లాడటం అతను గమనించాడు. శివప్పగారికి ఆమె ప్రవర్తన ఆశ్చర్యం కలిగించింది. ఎందుకంటే చుట్టుపక్కల ప్రయాణీకులు ఉన్నారు. అదేమీ పట్టించుకోకుండా ఆమె తన పట్ల ప్రేమ చూపించడం అతనికి నిజంగా ఆశ్చర్యం వేసింది. అయితే శివప్ప మాత్రం ఆమె మీద గౌరవ భావంతోనే మాట్లాడుతున్నారు. శివప్ప గారు ఆమెతోనే కాకుండా తన పక్కన కూర్చున్నమగవాళ్ళతో ఆ మాట ఈ మాట మాట్లాడుతూ కాసేపు, పుస్తకం చదువుకుంటూ కాసేపు కాలక్షేపం చేశారు.

ఈలోగా మధ్యాహ్నం భోజన సమయం కావడంతో అందరూ భోజనం ముగించి విశ్రాంతి తీసుకోవడానికి బెర్త్ లనుకిందకి దింపి పడుకోవడం ప్రారంభించారు. లేడీడాక్టర్ తన మధ్య బెర్త్ లో పడుకున్నారు. శివప్పగారికి మధ్యాహ్నం పడుకునే అలవాటు లేదు. కింద కూర్చోడానికి అవకాశం లేకపోవడంతో మధ్యన వున్న ఖాళీ ప్రదేశంలో నిలబడి ఒక చెయ్యి డాక్టర్ గారు పడుకున్నా బెర్త్ మీద పెట్టారు. కాసేపు అయిన తర్వాత లేడీడాక్టరుశివప్ప గారి చేతి మీద తన చెయ్యి పెట్టి చిరునవ్వుతో అతని వేపు చూశారు. శివప్ప ఆశ్చర్యపోయి వెంటనే తన చేయి తీసివేస్తే ఆమె బాధ పడుతుందని భావించి ఆమె వైపు చిరునవ్వుతో చూసి కాసేపైన తర్వాత మెల్లగా తన చేయిని తీసుకొని తన బెర్త్ పైకి వెళ్లి పడుకుని లేడీ డాక్టర్ తన మీద చూపిస్తున్న ఇష్టాన్ని గురించి ఆలోచిస్తూ పడుకున్నారు. శివప్పకు పెళ్లయింది. ఇద్దరు పిల్లలున్నారు. అతని భార్య అందంగానే వుంటుంది. లేడీ డాక్టరుకు కూడా పెళ్లయ్యింది. శివప్ప సున్నిత మనస్కుడు. అతని చదువు సంస్కారం హోదా ఇవన్నీ లేడీ డాక్టర్ చూపిస్తున్న ఇష్టం పట్ల సుముఖుడు కాలేకపోతున్నారు.

రైలు ప్రయాణాల్లో అబ్బాయిలు అమ్మాయిల చేత అమ్మాయిలు అబ్బాయిల చేత ఆకర్షితులు కావడం శివప్పకు తెలుసు. గతంలో కొన్ని సంఘటనలు అతనికి అనుభవమే. ఒకసారి అతనికి జీవితంలో మరిచిపోలేని అనుభవం కలిగిన సంఘటన గుర్తుకు వచ్చింది. శివప్ప విశాఖపట్నం ఆంధ్రవిశ్వవిద్యాలయంలో ఎం.ఏ. చదివేటప్పుడు నంద్యాల నుంచి విశాఖపట్నం వెళ్తూ నంద్యాల్లో అర్ధరాత్రి పన్నెండు గంటలకు ఒక ప్యాసింజర్ రైల్లో అన్ రిజర్వుడు బోగీలో ఎక్కాడు. బోగీలో చాలామంది ప్రయాణికులు నిలబడి ఉన్నారు. కూర్చోవడానికి స్థలం లేదు. చాలా సేపు అతను నిలబడే ఉన్నాడు. ఆరోజు అతను వ్యక్తిగతమైన ఏదో సమస్య కారణంగా చాలా విచారంగా దిగులుగా ఉన్నాడు. మంచి నిద్ర సమయం. అసలే అమాయకంగా కనిపించే అతని ముఖం నిద్ర కారణంగా, దిగులు కారణంగా మరింత అమాయకంగా ఉంది. అతను నిలబడిన ప్రదేశంలో కొందరు అమ్మాయిలు సీట్లలో ఇరుకుగా కూర్చుని అంత రాత్రి సమయంలో కూడా మాట్లాడుకుంటున్నారు. అతను ఒక సీటు చివర

నిలబడ్డాడు. చివర్లో కూర్చున్న అమ్మాయి తన తోటి అమ్మాయిలను జరగమని చెప్పి తాను కూడా జరిగి తన పక్కన కూర్చోమని శివప్పకు చెప్పింది. అమ్మాయి పక్కన కూర్చోవడం ఇష్టం లేక అతను కూర్చోలేదు. ఆ అమ్మాయి అతని చెయ్యి పట్టుకొని లాగి బలవంతంగా తన పక్కన కూర్చోబెట్టుకుంది. ఆమె తింటున్న వేరుశెనక్కాయలు కొన్ని అతని చేతిలో పోసింది. శివప్ప వాటిని తినకుండా తిరిగి ఆఅమ్మాయి చేతిలో పోశాడు. నిద్ర మత్తులో జోగుతున్న అతని కళ్ళజోడు కింద పడితే తీసి శివప్ప జేబులో పెట్టింది. కాసేపటి తర్వాత అతనికి నిద్రమత్తు వదిలిపోయింది. శివప్ప మీరందరూ ఎక్కడ నుంచి ఎక్కడికి వెళ్తున్నారని తన పక్కన కూర్చున్న అమ్మాయిని అడిగాడు. దానికి ఆ అమ్మాయి తామందరం గుంటూరు లోని ఒక కళాశాలలో బి.ఎస్సీ మూడవ సంవత్సరం చదువుతున్నామని బెంగళూరుకు విహారయాత్రకు వెళ్లి వస్తున్నామని చెప్పింది. నాకు ఇష్టం లేకపోయినా ఎందుకు నన్ను మీ పక్కన కూర్చోపెట్టుకున్నారని అతను ఆ అమ్మాయిని అడిగితే నాకు ఇష్టమైంది కాబట్టి కూర్చోబెట్టుకున్నానని ఆమె చెప్పింది. ఆమె శివప్పను గురించిన వివరాలను అడిగింది. విశాఖపట్నంలో ఎం.ఏ. చదువుతున్నానని శివప్ప చెప్పాడు. ఆ అమ్మాయి సన్నగా ఎర్రగా అందంగా ఉంది. ఆమె శివప్ప పక్కన ఎలాంటి సంకోచం లేకుండా చాలా దగ్గరగా అతని ఒడిలో కూర్చున్నట్టుగాకూర్చుంది. మాట్లాడేటప్పుడు అతని తొడల మీద చేతులు వేస్తూ మాట్లాడుతూ వుంది. ఒక విధంగా చెప్పాలంటే భర్త పక్కన భార్య ఎంత చనువుగా దగ్గరగా కూర్చుంటుందో అంత చనువుగా దగ్గరగా ఆ అమ్మాయి శివప్ప పక్కన కూర్చుంది. శివప్ప ఆమెకు దూరంగా జరిగే కొద్దీ ఆమె అతనికి మరింత దగ్గరగా జరుగుతూవుంది. ఆమె స్నేహితురాండ్రు నవ్వుతూ ఆమె ప్రవర్తనను ఆసక్తిగా చూస్తూ వున్నా ఆమె వారిని ఏమాత్రం పట్టించుకోలేదు. తెల్లవారిన తర్వాత గుంటూరులో దిగి వెళ్ళిపోతున్నప్పుడు ఆమె శివప్పతో కరచాలనం చేసి వెళ్ళిపోయింది. ఇలాంటి సంఘటనలు మరికొన్ని అతనికి జరిగాయి. తన అమాయకమైన ముఖం ఆడవారిని ఆకర్షిస్తుందేమోనని అతని ఉద్దేశం. అందుకని అమాయకంగా కనిపించకుండా ఉండటానికి అతను ప్రయత్నిస్తూ ఉంటాడు. తనకు కలిగిన ఇలాంటి అనుభవాలను అతను ఎవరికీ చెప్పలేదు. అలా చెప్పడం ఆ స్త్రీలను అవమానించడమని అతని ఉద్దేశం.

శివప్ప గారు తన పై బెర్త్ లో పడుకొని సాయంత్రం ఆరు గంటల వరకు కిందికి దిగలేదు. ఆరు గంటల తర్వాత కిందికి దిగి తన సీట్లో కూర్చోకుండా ఆ బోగీలో నుంచి దాని పక్కనున్న బోగీలోకి నడవడం ప్రారంభించారు. ఏడు గంటలకు తన సీటు దగ్గరికి వచ్చారు. ఎదురుగా ఉన్న లేడీ డాక్టర్ కొంత ముభావంగా ఉండడం గమనించారు. ఆమెను బాధ పెట్టడం ఇష్టం లేక శివప్ప గారు తానే

చొరవ తీసుకొని ఆమెతో విశాఖపట్నం లోనూ విశాఖపట్నం చుట్టుపక్కల ఏయే ప్రదేశాలు చూశారని ఆమెతో మాటలు కలిపారు. ఆమె అరకు, భీమిలి, లంబసింగి, రామకృష్ణ బీచ్, వుడా పార్క్ మొదలైన ప్రదేశాలు చూశానని చెప్పారు. ఇలా మాట్లాడుకుంటూ ఉండగా రాత్రి భోజనం సమయం అయింది. అందరూ భోజనం చేసి తొమ్మిది గంటలకు పడుకున్నారు. అర్ధరాత్రి శివప్ప గారు బాత్ రూమ్ కు వెళ్ళడానికి కిందికి దిగి బాత్ రూమ్ కు వెళ్లి వచ్చారు. అదే సమయంలో లేడీ డాక్టర్ గారు తన బెర్త్ నుంచి కిందికి దిగి శివప్ప గారి వైపు చూశారు. శివప్ప కూడా ఆమె వైపు చూశారు. వెంటనే ఆమె శివప్పగారిని కౌగిలించుకున్నారు. ఆమె చేసిన ఆపని శివప్పగారికి చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆమె అలా చేయడం అతనికి ఇష్టం లేకపోయినా ఆమెను బాధ పెట్టడం ఇష్టం లేక తాను కూడా రెండు చేతులు ఆమె వీపు మీద వేసి అలాగే ఒక నిమిషం పాటు ఉన్న తర్వాత ఆమె వీపు రెండు సార్లు తట్టి తన చేతులను ఆమె నుంచి తీసి ఆమెకు సంతోషం కలిగించడానికి థ్యాంక్యూ మేడం అన్నారు. ఆమె అతని మీద నుంచి చేతులు తీసివేసి అతనికి షేక్ హ్యాండ్ ఇచ్చి మళ్లీ ఒకసారి కౌగిలించుకొని థాంక్స్ చెప్పి తన బెర్త్ పైకి వెళ్ళి పడుకున్నారు. తర్వాత అతను ఆమెకు గుడ్ నైట్ చెప్పి తన బెర్త్ పైకి వెళ్లి పడుకున్నారు. శివప్పగారికి ఇదంతా కలలో జరిగినట్లుగా ఉంది. చాలా సేపటి వరకు అతనికి నిద్ర పట్టలేదు. ఎప్పుడో తెల్లవారుజామున నిద్ర పట్టింది. ఆ రోజు బాగా ఆలస్యంగా అంటే ఉదయం ఎనిమిది గంటలు దాటిన తర్వాత అతనికి మెలకువ వచ్చింది. అతను పైనుంచి లేడీ డాక్టర్ వైపు చూశారు. ఆమె ఇంకా పడుకునే ఉన్నారు. ఒక అరగంట ఆగిన తర్వాత శివప్ప కిందికి దిగి పళ్ళు తోముకోవడం మిగిలిన కాలకృత్యాలుతీర్చుకున్నారు. లేడీ డాక్టర్ తొమ్మిది గంటల ప్రాంతంలో కిందికి దిగి పళ్ళు తోముకుని వచ్చి కూర్చున్నారు. రాత్రి జరిగిన సంఘటన గుర్తుకు వచ్చి శివప్ప ఆమె వైపు సరిగ్గా చూడలేకపోయారు. ఆమె మామూలుగానే అతనితో మాట్లాడారు. శివప్ప కూడా కాసేపటి తర్వాత ఆమెతో స్నేహపూర్వకంగా మాట్లాడారు. విశాఖపట్నంలో ఆమెను తీసుకుని వెళ్ళడానికి ఆమె భర్త స్టేషన్ కు వస్తారని ఆమె మాటల సందర్భంలో చెప్పారు. ఆమెతో కలిగిన రైలు ప్రయాణ పరిచయాన్ని పొడిగించడం ఇష్టం లేక శివప్ప గారు ఆమె పేరు ఫోన్ నెంబర్ విశాఖపట్నం లో ఆమె చిరునామా మొదలైనవేవీ తీసుకోలేదు. ఆమె గూడా అతణ్ణి అడగలేదు. మధ్యాహ్నం రెండు గంటలకు రైలు విశాఖపట్నం చేరుకుంది. శివప్ప వెళ్లి వస్తానని ఆమెకు చెప్పి రైలు దిగి ముందుగా బయలుదేరి వెళ్ళిపోయారు.

ఇంటికి వచ్చిన తర్వాత శివప్పగారికి లేడీ డాక్టర్ తన పట్ల చూపిన ఇష్టం, ప్రేమ, కౌగిలించుకోవడం మొదలైనవి ఎంత వద్దనుకున్నా గుర్తుకు వస్తున్నాయి.

రెండు మూడు రోజులకు ఆ జ్ఞాపకాలు అతన్ని మరింత కలవరపెట్టి ఆమె మీద చాల ఎక్కువ ప్రేమను ఇష్టాన్ని కలిగించాయి. అతను ఆమెను చూడకుండా వుండలేని స్థితికి వచ్చారు. మూడు రోజుల తర్వాత అతను ఆమె చెప్పిన క్లినిక్ కోసం పెద్ద వాల్తేరుకు వెళ్లి ఆమె కోసం ప్రయత్నించారు. ఆమె క్లినిక్ ఎక్కడా కనిపించలేదు. ఆ దగ్గరలో ఉన్న మెడికల్ షాపుల్లో ఆమెను గురించి వాకబు చేశారు. ఒక మెడికల్ షాపులో కొన్ని రోజుల క్రితం ఒక హిందీ ఆవిడ ఆ ప్రాంతంలో క్లినిక్ తెరిచారని తర్వాత మూసివేశారని చెప్పారు. శివప్ప రైల్లో ఆమె పేరు గానీ ఆమె చిరునామా కూడా అడగలేదు. ఆమె కూడా ఏమీ చెప్పలేదు. చివరికి శివప్పకు ఆమెను కలుసుకునే అవకాశమే లేకపోయింది. పది పదిహేను రోజుల పాటు శివప్ప భగ్న ప్రేమికుడు లాగా ఆమె కోసం చాలా పరితపించారు. ఆహారం రుచించేది కాదు. నిద్ర పట్టేది కాదు. ఆ తర్వాత మెల్లమెల్లగా ఆమెను మరిచిపోయారు. ఈ సంఘటన గుర్తొచ్చినప్పుడు అతనికి ఆశ్చర్యంగానూ ఆనందంగానూ ఉంటుంది.

మానవ మనస్తత్వం చాలా చిత్రమైంది. లేడీ డాక్టర్ రైల్లో తన మీద ఇష్టం ప్రేమ వ్యక్తం చేసినప్పుడు అతను వాటిని పెద్దగా పట్టించుకోలేదు. అయితే ఇంటికి వచ్చిన తర్వాత ఆమె జ్ఞాపకాలు అతనికి పదేపదే గుర్తుకు వచ్చి ఆమె మీద ప్రేమ పుట్టి, పెరిగి అతణ్ణి తీవ్రంగా బాధ పెట్టడం చాలా ఆశ్చర్యంగా ఉంది. దాన్ని గురించి ఆలోచిస్తే అతనికి ఒక విషయం అర్థమైంది. లేడీ డాక్టర్ పట్ల తనకు కూడా ఇష్టం ప్రేమ వున్నాయి. అయితే తన చదువు సంస్కారం హోదా సున్నిత మనస్తత్వం ఆమె మీద ఉన్న ప్రేమను ఇష్టాన్ని బైటికి వెలిబుచ్చకుండా చేశాయి. ఆమె పట్ల తనకు ఇష్టం ఉండడం వల్లనే ఆమె తన పట్ల చూపించిన ఇష్టాన్ని ప్రేమను పూర్తిగా కాదనలేక కొంతవరకు సహకరించారు. ఆమె పట్ల తనకు ఇష్టం కలగడానికి ఎలాంటి భేషజాలు లేని ఆమె వ్యక్తిత్వం, సింప్లిసిటీ, సేవా దృక్పథంతో పాటు ఆమె అందం గూడా కారణం కావచ్చు. తన పట్ల ఆమె అంతగా ఆకర్షితురాలు కావడానికి తన ముఖంలో కనిపించే అమాయకత్వం, హుందాతనం అడగకుండానే సాయం చేసే గుణం కారణం కావచ్చునని అతను భావించారు. శివప్ప గారు ఆమె ప్రేమ బంధం నుంచి విముక్తులైన తర్వాత, రైలు ప్రయాణం అనంతరం ఆమెను తాను కలుసుకోలేక పోవడం మంచిదేనని ఆయన భావించారు. ఒకవేళ తాను ఆమెను కలుసుకుని ఉంటే ఆమె తనతో ప్రేమాయణం సాగించేందుకు ఇష్టపడేదో? లేదో? ఒకవేళ ఇష్టపడితే ఆప్రేమాయణం ఎంతకు వరకు వెళ్ళేదో? దాని పరిణామాలు ఎలా ఉండేవో? తామిద్దరూ వివాహితులు కాబట్టి తమ సంబంధాన్ని లోకం ఏమనుకుంటుది? ఆ ప్రేమాయణం కారణంగా తన జీవితంలో ముఖ్యంగా ఆమె జీవితంలో ఎన్ని ఆటుపోట్లు, సమస్యలు వచ్చేవో? ఇలా ఆలోచించిన తర్వాత ఆమెను తాను కలవలేకపోవడమే అన్నివిధాలా మంచిదిగా భావించి అతను స్థిమితపడ్డారు.

# కాకి కూటం

ఆచార్య జయదేవ్ గారు ఆంధ్ర విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో ఆచార్యులు. విశ్వవిద్యాలయాల్లో ఆచార్యులుగా పని చేసేవారు బోధనతో పాటు తమకిష్టమైన, ఆసక్తి ఉన్న అంశాల మీద పరిశోధన చేస్తుంటారు. తాము చేసిన పరిశోధన గురించి తోటి అధ్యాపకులతో చర్చించుకుంటూ ఉంటారు. జయదేవ్‌కు జానపద విజ్ఞానం ఇష్టమైన అంశం. దానిమీద ఆయన పరిశోధన చేస్తుంటాడు. జానపద విజ్ఞానంలో నమ్మకాలు ఒక భాగం. ఆయన తన జీవితంలో తాను చూసిన ఒక నమ్మకాన్ని గురించి తన సహాధ్యాపకుడైన మోహన్ గారితో చెప్పాడు.

ఆ సంఘటన 'నేను ఏడవ తరగతి చదువుతున్నప్పుడు జరిగింది. మా అన్న నా కంటే సుమారు పది సంవత్సరాలు పెద్దవాడు. అతను ప్రధానంగా గొర్రెల మేకల కాపరి. అతని పేరు గురప్ప. అతను ఒకరోజు గొర్రెలు మేకలను తోలుకుని పొలానికి వెళ్ళాడు. అతనితో పాటు జీవాల కాపరిగా ఉన్న ఒక వ్యక్తి మధ్యాహ్నం మూడు గంటల ప్రాంతంలో హడావిడిగా పరుగెత్తుకుంటూ ఏడుస్తూ మా ఇంటికి వచ్చి "గురప్ప మ్యాకలకు యాపకొమ్మలు నరకడానికి యాపచెట్టెక్కి కొమ్మలు నరుకుతూ ప్రమాదవశాత్తు చెట్టు మీద నుంచి కింద పడి కాళ్ళు చేతులు ఇరిగినాయి, లేయలేక కిందపడి ఉండాడ" ని చెప్పాడు. వెంటనే మా అమ్మ నాన్న నేను మా అక్కాచెల్లెళ్ళు బంధువులు చుట్టుపక్కల వాళ్ళు అందరం ఏడ్చుకుంటూ ఆర్తనాదాలు చేస్తూ మా అన్న కింద పడిన ప్రాంతానికి బయలుదేరి వెళ్తూ దారిలో ఎదురు పడ్డ వాళ్ళదరికీ ఆ విషయాన్ని చెబుతూ వెళ్లాం. ఆ విషయం విన్న చాలామంది మా వెంట బయలుదేరి వచ్చారు. ఇంచుమించు ఒక యాబై మందిమి ఊరు దాటి ఒక కిలో మీటరు పైగా

దూరం వెళ్ళాం. ఆశ్చర్యంగా కాళ్ళు చేతులు విరిగినాయని చెప్పబడిన మా అన్న మాకు ఎదురుగా దారిలో నడుచుకుంటూ వస్తున్నాడు. అతను దగ్గరికి వచ్చిన తర్వాత మేమందరం అతని చుట్టూ గుమికూడి నువ్వు బాగానే ఉన్నావు కదా ఎందుకు కాళు ్ల చేతులు విరిగినాయని చెప్పి పంపించావు అని అడిగాం. దానికి అతను "నేను కాకి కూటకం సూసినా, కాకి కూటకం సూచ్చే మంచిది గాదు, అది దోసం, ఆ దోసం పోడానికి అట్టా సెప్పి పంపించినా" అన్నాడు. అతని మాటలు విన్న తర్వాత మేమందరం సంతోషంగా ఊపిరి పీల్చుకుని ఆసంఘటన గురించి మాట్లాడుకుంటూ అతనితో కలిసి ఇంటికి వచ్చాం.

ఇంటికి వచ్చినాక నేను మా అన్నను "కాకికూటకం అంటే ఏమిటి?" అని అడిగాను. దానికి మా అన్న "ఆడకాకులు మగకాకులు గుంపుగా కల్సివుండి ఆడకాకుల మీద మగకాకులు ఎక్కుతా దిగుతా ఎగురుతా ఉంటాయి. అది కాకుల సామూహిక సంభోగం. కాకులు అట్లా ఎగురుతున్నప్పుడు కరెంటు వెలుగు మాదిరిగా ఒక వెలుగు కనిపిస్తాది. దాన్ని మనుషులు సూడగూడదు. సూస్తే అది పెద్ద దోషం. ఆ దోషం పోవడానికి దాన్ని చూసిన వాళ్ళు తమకు పెద్ద కీడు కలిగినట్లుగా తమ వారికి తెలియజేస్తారు. వాళ్ళు బంధు మిత్రులతో కలిసి దుఃఖంతో బాధపడితే ఆ దోషం పోతుందని మన పెద్దలు అంటారు. అందువల్లనే కాకికూటకం చూసిన వాళ్లు అట్లా చేస్తారు" అని చెప్పాడు

జయదేవ్ ఆ సంఘటన గురించి చెప్పి నిఘంటువులో కూటకం అనే పదానికి అర్థాన్ని వెతికాడు. కూటకం పదం నిఘంటువులో లేదు. కూటం అనే పదం ఉంది. నిజానికది కాకికూటకం కాదు. కాకికూటం అనే పదబంధం. గ్రామీణులు కాకికూటం అనే పదబంధాన్ని కాకికూటకం అని వ్యవహరిస్తున్నారు. కూటం పదానికి నిఘంటువులు రతి, సంభోగం, సమూహం మొదలైన అర్థాలతో పాటు కొలువుకూటం మొదలైన ఇతర అర్థాలను కూడా ఇచ్చాయి. వీటిలో రతి, సంభోగం, సమూహం అనే అర్థాలు ఇక్కడ సరిపోతాయి. దీని ప్రకారం కాకికూటం అంటే కాకుల సామూహిక సంభోగం లేక కాకుల సామూహిక రతి అని అర్థం చెప్పవచ్చునని జయదేవ్ మోహన్ గారితో చెప్పారు.

మోహన్ గారు "కాకుల సంభోగం చూస్తే ఏమవుతుంది? ఏమీ కాదు, అదొక మూఢనమ్మకం, గ్రామీణుల్లో ఇలాంటి మూఢనమ్మకాలు చాలా ఉంటాయి. వాటికి ఎలాంటి హేతుబద్ధత లేదు" అన్నారు.

"అవును అది మూఢ నమ్మకమే, ఊర్లలో ఉండే పిచ్చుకలు పావురాలు పిల్లులు గేదెలు ఆవులు మొదలైన పక్షుల పశువుల సంభోగం మనుషులు చూస్తూనే ఉన్నారు.

వాటిమీద ఇలాంటి నమ్మకాలు లేవు. కానీ కాకులు ఊర్లలో ఉన్నప్పటికీ వాటి సంభోగం ఊర్లలో ఎవరూ చూడలేదు. వాటి సామూహిక సంభోగం పొలాల్లోనే జరుగుతూ వుంటుంది. దీనికి కారణం ఏమిటో పక్షి శాస్త్రవేత్తలు చెప్పాలి. ఈ నమ్మకం ప్రస్తావన కృత్యమంజరి అనే సంస్కృత గ్రంథంలో ఉన్నట్లుగా పురాణ ప్రలాపం అనే అనువాద గ్రంథంలో చదివాను. కాకుల మైథునం చూసినవారు బ్రాహ్మణ దేవతకు పరిహారం చెల్లించాలని ఆ సంస్కృత గ్రంథంలో ఉందని, బ్రాహ్మణులు స్వార్థబుద్ధితో ఇలాంటి రాతలు రాశారని పురాణ ప్రలాపం గ్రంథంలో ఉంది. హరి మోహన్ ఝా గారు రాసిన "ఖట్టర్ కాకా" అనే హిందీ గ్రంథాన్ని ఆచార్య లక్ష్మిరెడ్డి గారు పురాణ ప్రలాపం అనే పేరుతో తెలుగులోకి అనువదించారు.

వేమన పద్యాల్లో కూడా ఈ నమ్మకం ప్రస్తావన ఉంది.

"కాకి పక్షులందు కడుహీనమందురు
కాకి పెండ్లి నెవరు కనరు భువిని
కాకి కన్నముంచి కాళ్ళకు మొక్కేరు
విశ్వదాభిరామవినురవేమ"

కాకిని మనుషులు హీనంగా చూస్తారు. కాకి ఇంట్లోకి వస్తే అపశకునంగా భావిస్తారు. కాకుల పెండ్లిని లేక కాకుల సంభోగాన్ని అపశకునంగా భావించి ఎవరూ చూడరు. అలాంటి కాకులకు పితరుల కోసం పెట్టిన అన్నం ముద్దలను పెడుతుంటారని "పిండములను చేసి పితరుల తలపోసే" ఆచారం లోని హేతుబద్ధతను వేమన ప్రశ్నించాడు. దీన్ని బట్టి ఈ నమ్మకం ప్రాచీన కాలం నుంచి ఉన్నట్లుగా మనం గ్రహించవచ్చు" అని జయదేవ్ అన్నాడు.

(ఈ నమ్మకాన్ని గురించి కె. సభా గారు పునర్జన్మ అనే కథలో చెప్పారు. అందులోని పాత్రల ద్వారా వారు ఈ నమ్మకాన్ని సమర్థించారు. ఈ కథలో సభా గారు కాకికూటం అనే పదబంధాన్ని కాకుండా కాకులజంట అనే పదబంధాన్ని ఉపయోగించారు. ఈ పునర్జన్మ కథ కేతు విశ్వనాథరెడ్డి గారు సంపాదకత్వంలో వచ్చిన కె.సభా ఉత్తమ కథలు అనే పుస్తకంలో ఉంది. ఈ కథను చదివిన తర్వాత గతంలోని నా అనుభవాన్ని పురస్కరించుకుని ఈ కాకికూటం అనే ఈ కథను రాశాను)

* * *

# సొంత వూరు

ఆచార్య జయదేవ్ చాలా కాలం తర్వాత తన సొంత ఊరికి వెళ్ళాడు. అది నంద్యాల జిల్లాలో ఒక మారుమూల ఉన్న చాకరాజు వేముల అనే పల్లెటూరు. ఆ ఊరికి బస్సు సౌకర్యం లేదు. బస్సు దిగి మూడు కిలోమీటర్ల దాకా ఆ ఊరికి నడవాలి. ఆయన ఉద్యోగ విరమణ చేసిన తర్వాత కొంతకాలం పాటు స్వగ్రామంలో ఉండాలని ఆ ఊరికి వెళ్ళాడు. ఊర్లోకి వెళ్ళిన తర్వాత ఆవూర్లో చాలా మోటర్ బైకులు ట్రాక్టర్లు కార్లు తిరుగుతూ ఉండటం గమనించాడు. ఆయన చిన్నతనంలో సైకిల్ ఉండడం గొప్పగా ఉండేది. ప్రస్తుతం చాలా మోటర్ సైకిల్ లు ఊర్లో తిరుగుతూ ఉండటం చూసి ఆశ్చర్యపోయాడు. ఆయన వచ్చినట్లు తెలుసుకొని చిన్ననాటి మిత్రుడు క్రిష్ణ ఆయన దగ్గరికి వచ్చాడు. క్షేమ సమాచారాలు మాట్లాడుకున్న తరువాత జయదేవ్ క్రిష్ణతో"మన ఊరు చాలా మారిపోయింది. బాగా అభివృద్ధి చెందింది" అన్నారు. క్రిష్ణ కూడా "అవును అప్పటికీ ఇప్పటికీ మన ఊరు చాలా మారిపోయింది. అన్ని రంగాల్లోనూ మార్పులు వచ్చాయి" అని అన్నాడు.

నీ వ్యవసాయం ఎలా ఉంది అని జయదేవ్ మిత్రున్ని అడిగాడు.

క్రిష్ణ జయదేవ్ తో చెప్పాడు.

"బాగానే ఉంది, అయితే మన చిన్నప్పుడు చేసిన వ్యవసాయానికి ఇప్పుడు చేస్తున్న వ్యవసాయానికి చాలా తేడా ఉంది. అప్పటికీ ఇప్పటికీ పొంతనే లేదు. అప్పుడు మెట్ట ప్రాంతంలో రాయచూర్ జొన్న, వేరుశనగ ధనియాలు కంది పెసర మిరప మాగాణి ప్రాంతంలో వరి వేసే వాళ్ళం. ఇప్పుడు ధనియాలు రాయచూరు జొన్న

వేరుశనగ కంది పెసర ఎవరూ వేయడం లేదు. వ్యాపార పంటలైన పత్తి, సీడ్ జొన్న, శనగ, మిరప పంటలు వేస్తున్నారు. మాగాణి ప్రాంతంలో మాత్రం వరి సాగు చేస్తున్నారు. అప్పుడు వ్యవసాయం పనులన్నీ ఎద్దులతో చేసేవాళ్ళం. కానీ ఇప్పుడు ఎద్దులు చాలా తక్కువ మందికి మాత్రమే ఉన్నాయి. ఎక్కువ మంది అంటే తొంబై ఎనిమిది శాతం ట్రాక్టర్ లతో వ్యవసాయం చేస్తున్నారు. దున్నడం పాయడం విత్తనం వేయడం క్రిమిసంహారక మందులు కొట్టడం మొదలైన పనులన్నీ ట్రాక్టర్లతోనే చేస్తున్నారు. నాట్లు వేయడం కోతల కోయడం మొదలైన పనులన్నిటికీ వేరే యంత్రాలు వచ్చాయి. ఈ యంత్రాలను మన ఊర్లో కొందరు కొని అద్దెకు నడుపుకుంటున్నారు. అది మంచి వ్యాపారంగా కూడా ఉంది. మిరప, పత్తి పంటలకు సంబంధించిన పనులు మాత్రం మనుషులతో చేస్తున్నారు.

గతంలో వంద ఎకరాల వరకు పొలం ఉన్న ఆ సాములు (మోతుబరి రైతులు) మన ఊర్లో ఉండే వారు. వాళ్లు అన్నదమ్ములు ఆస్తులు పంచుకొని ప్రస్తుతం 25, 30 ఎకరాలకు పరిమితమై పోయారు. గతంలో వంద ఎకరాలు పైబడి ఉన్న ఆసాములకు నాలుగైదు గాండ్ల ఎద్దులు ఇద్దరు ముగ్గురు జీతగాళ్లు ఉండేవారు. ప్రస్తుతం ఎవరూ జీతగాళ్ళుగా ఉండటం లేదు. సొంతంగా కష్టపడి వ్యవసాయం చేసుకోలేని రైతులు వ్యవసాయం చేయడం మానేసి పొలాన్ని గుత్తకు ఇచ్చుకుంటున్నారు. పొలం లేని చాలా మంది బీదవాళ్ళు రైతుల దగ్గర పొలాన్ని గుత్తకు తీసుకొని కష్టపడి వ్యవసాయం చేస్తున్నారు. కొంతమంది రైతులు ఇలాంటి వారికి డబ్బును వడ్డీకి ఇస్తున్నారు. ఇలా వడ్డీ వ్యాపారం చేసే వాళ్ళు బాగా ధనవంతులవుతున్నారు. గుత్తకు వ్యవసాయం చేసేవాళ్ళు ఒక ఆటోను కూడా కొనుక్కుంటున్నారు. కూలీలను ఊరి దగ్గర నుంచి పొలానికి తీసుకొనిపోయి తీసుకొని రావడానికి, పత్తి మిరప శనగ జొన్న మొదలైన ధాన్యాలను పొలం నుంచి ఇంటికి తీసుకుని రావడానికి ఆటోలను ఉపయోగిస్తున్నారు. ఇలాంటి వాటికి ఆటోలను అద్దెకు తీసుకుంటే చాలా డబ్బు ఖర్చు అవుతుంది. అందువల్ల వ్యవసాయం చేసే వాళ్ళు చాలామంది ఆటోలు కూడా కొంటున్నారు.

మన చిన్నప్పుడు మాగాణి పొలానికి గుత్త ఎక్కువగా ఉండేది. వెలి పొలానికి అంటే మెట్ట పొలానికి తక్కువగా ఉండేది. కానీ ఇప్పుడు పరిస్థితి తారుమారైంది. మెట్ట పొలానికి గుత్త ఎక్కువ, మాగాణి పొలానికి తక్కువ. మెట్ట పొలంలో శనగ పత్తి మిరప సీడ్ జొన్న మొదలైన వ్యాపార పంటలు వేయడమే దీనికి కారణం. మాగాణి పొలంలో వరి మాత్రమే వేస్తున్నారు. అంతేకాకుండా మెట్ట పొలానికి గుత్త మునుగుత్త, అంటే పంట వేసుకోవడానికి ముందుగానే గుత్త డబ్బులు ఇవ్వాలి. మాగాణి పొలానికి

పంట పండి వచ్చిన తర్వాత వరి ధాన్యాన్ని ఇస్తారు. మెట్ట పొలంలో నీటిపారుదల సౌకర్యం వుంటే గుత్త ఎక్కువగా వస్తుంది. నీటిపారుదల లేకపోతే గుత్త కొంత తగ్గుతుంది.

గతంలో పంటలకు వేసే యూరియా అమోనియా మొదలైన రసాయినిక మందులు క్రిమిసంహారక మందులు దగ్గరలో ఉన్న ఆళ్ళగడ్డకు వెళ్లి తెచ్చుకునే వాళ్ళం. కానీ ఇప్పుడు ఇలాంటివన్నీ మన ఊర్లోనే దొరుకుతున్నాయి. ఇలాంటి ఫర్టిలైజర్స్ షాపులు మన ఊర్లో నాలుగున్నాయి.

గతంలో కూలి మనుషులు ఇంటి నుంచి చేల వరకు నడుచుకుంటూ వెళ్లి చేలో పనిచేసి మళ్లీ నడుచుకుంటూ ఇంటికి వచ్చేవాళ్ళు. కానీ ఇప్పుడు కూలీలు ఎవరూ నడవడం లేదు. వాళ్ళను ఊరి దగ్గర నుంచి ట్రాక్టర్ లో గానీ ఆటోలో గానీ చేలకు తీసుకొనిపోయి మళ్ళీ తీసుకొని రావాలి. కూలీలే గాదు ఇప్పుడు ఎవరూ నడవడం లేదు. చాలామందికి మోటర్ బైక్ లు ఉన్నాయి. గతంలో బస్సులో ప్రయాణించడానికి దొర్నిపాడు రోడ్డు దాకా నడుచుకుంటూ వెళ్లేవాళ్లు. కానీ ఇప్పుడు ఎవరూ నడవడం లేదు. షేరింగ్ ఆటోలో  రోడ్డు మీదకు వెళ్తున్నారు. ఇంట్లో ఎంత మంది మగవాళ్ళుంటే దాదాపు అంతమందికి మోటర్ బైక్‌లు ఉన్నాయి. కొందరు ఆడ పిల్లలు కూడా మోటార్ బైక్ లు నడుపుతున్నారు. ఊర్లో ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతానికి వెళ్లడానికి కూడా మోటార్ బైక్ మీదనే వెళ్తున్నారు. పనికి ఆహార పథకం కింద పని చేసేవాళ్ళు కూడా తట్ట, పికాశి, సలికెపార బైక్ మీద పెట్టుకొని భార్యతో కలిసి ఆ పనికి బైక్ మీద వెళ్ళివస్తున్నారు. 50, 60 కిలోమీటర్లు దూరంలో ఉన్న ఊర్లకు కూడా బైక్ ల మీద వెళ్లి వస్తున్నారు. యువకులు ఎవరూ బస్సుల కోసం చూడడం లేదు. ప్రస్తుతం మన ఊర్లో కార్లు కూడా చాలా ఉన్నాయి. కొంతమంది కార్లను జీప్ లను వ్యాన్ లను అద్దెకు నడుపుతున్నారు.

దాదాపు ఊర్లో ఉన్న మనుషులందరికీ సెల్ ఫోన్లు ఉన్నాయి. ఇంటర్నెట్ ద్వారా యూట్యూబ్ లో ఉన్న సినిమాలను, హాస్య సన్నివేశాలను మంచి మంచి పాటలను డౌన్లోడ్ చేసుకొని చాలామంది యువకులు చూస్తున్నారు. ఇలాంటి వాళ్లు టీ.వీలు చూడటం లేదు. సెల్ ఫోన్ ద్వారా కొత్త సినిమాలు, ఇష్టమైన పాత సినిమాలు చూస్తూ ఆనందిస్తున్నారు. చాలామంది యువకులు సెల్ ఫోన్ లో మాట్లాడం, చాటింగ్ చేయడం, వాట్సప్ చూసుకోవడం, యూట్యూబ్ లో ఇష్టమైన ప్రోగ్రాంలు చూడడం చేస్తూ సెల్ఫోనే లోకంగా బతుకుతూ దానికి బానిసలవుతున్నారు. ఆ కారణంగా వారిలో అనేక రకాల మానసిక సమస్యలు వస్తున్నాయి.

## సొంత వూరు

మన ఊరు నలువైపులా పెరిగిపోయింది. గతంలో ఊరికి ఉత్తరం వైపున ఉన్న పేలగడ్డ (ప్రాంతం పేరు) ప్రాంతాన్ని పురుషులు బహిర్భూమిగా వాడేవారు. ఆ ప్రాంతమంతా చాలా అసహ్యంగా ఉండేది. ప్రభుత్వం ఆ ప్రాంతాన్ని బీ.సీ వాళ్లకు ఇళ్ల పట్టాలు ఇచ్చి ఇల్లు కట్టించింది. విశాలమైన రోడ్లు వేయించింది. ఆ మట్టి రోడ్లను తర్వాత సిమెంట్ రోడ్డుగా వేయించింది. దాన్ని బీ.సీ కాలనీ అని పిలుస్తున్నారు. అది ఇప్పుడు మంచి అందమైన కాలనీగా తయారైంది.

ఆ కాలనీలో ప్రభుత్వం ఒక ప్రాథమిక పాఠశాలను ఏర్పాటు చేసింది. మూడు సంవత్సరాల కిందట ఆ బడికి రామకృష్ణ అనే అతను హెడ్మాస్టర్ గా వచ్చాడు. అతను అంకితభావం గల మంచి టీచర్. అతను రాకముందు ఆ బడిలో ఒకటవ తరగతి నుంచి 5వ తరగతి వరకు మొత్తం ఐదు తరగతుల్లో కేవలం ఇరవై లోపల విద్యార్థులుండేవారు. బడి ఆవరణ పల్లంగా వుండడం చేత నీళ్ళు నిల్వ ఉండిపోయి దోమలు పెరిగి పోయాయి. పిచ్చి మొక్కలు చెట్లు పెరిగిపోయాయి. పిల్లలు ఆడుకోవడానికి తిరగడానికి వీలు లేకుండా అసహ్యంగా ఉండేది. చుట్టూ ప్రహరీ గోడ లేక పోవడం చేత చుట్టుపక్కల వాళ్ళు బడి ఆవరణలో గేదెలను కట్టేవాళ్ళు.

రామకృష్ణ వచ్చిన తర్వాత ఊర్లో పెద్ద మనుషులతో మాట్లాడి వారి సాయంతో చెట్లను మొక్కలను కొట్టించాడు. పల్లంగా ఉన్న ప్రాంతంలో మట్టి పోయించి చదును చేయించాడు. ఊర్లోని దాతల సాయంతో బడి గదులకు రంగులు వేయించి కటాంజనం (గ్రిల్స్) వేయించాడు. మన ఊరు నుంచి దొర్నిపాడులో ఉన్న ప్రైవేటు బడికి వెళ్తున్న పిల్లల తల్లిదండ్రులను కలిసి బీ.సీ కాలనీ బడిని బాగా అభివృద్ధి చేశామని, పిల్లలకు బాగా చదువు చెబుతామని వాళ్లకు చెప్పి ఒప్పించి తమ బడిలో చేర్పించారు. ప్రస్తుతం ఆ బడిలో 140 మందికి పైగా పిల్లలున్నారు. ఆ స్కూల్లో ఇద్దరు గవర్నమెంటు టీచర్లున్నారు. మరో ఇద్దరిని తాత్కాలిక పద్ధతిలో టీచర్లుగా నియమించుకున్నారు.

అతని ప్రయత్నం వల్ల బడి బాగా అభివృద్ధిలోకి వచ్చింది. రాష్ట్ర ప్రభుత్వం కొత్తగా ప్రవేశపెట్టిన నాడు నేడు పథకానికి ఎంపికయింది. ఆ పథకం కింద ఆ బడికి 20 లక్షల రూపాయలు కేటాయించారు. మహాత్మా గాంధీ జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకం కింద తొమ్మిది లక్షలతో ప్రహరీ గోడను, సర్వ శిక్ష అభియాన్ వార్షిక ప్రణాళిక కింద 11 లక్షలతో అదనపు తరగతి గది నిర్మించారు. ఆడ పిల్లలకు మగ పిల్లలకు ప్రత్యేకంగా మూత్రశాలలను ఏర్పాటు చేశారు. పిల్లలు మంచినీళ్ళు తాగడానికి ఆర్.ఓ ప్లాంట్ ఏర్పాటు చేశారు.బడి ఆవరణలో మంచి చెట్లను పెంచుతున్నారు. అంకితభావం గల మంచి వ్యక్తి ఒక సంస్థను నడిపే వ్యక్తిగా వస్తే ఆ సంస్థ ఎంత బాగా అభివృద్ధి చెందుతుందో ఆ బడిని బట్టి తెలుసుకోవచ్చు.

బడి అభివృద్ధికి చాలా కృషి చేసిన రామకృష్ణ గారి గురించి క్రిష్ణ చెప్పగానే జయదేవ్ చాలా సంతోషించాడు. రామకృష్ణ గారిని వ్యక్తిగతంగా కలిసి అభినందిస్తానని, బడికి ఇంకా ఏమైనా అవసరం ఉంటే తాను సాయం చేస్తానని కూడా జయదేవ్ చెప్పాడు

తర్వాత క్రిష్ణ ఊరు గురించి ఇంకా చెప్పాడు.

ఆ బడికి ఎదురుగా గంగమ్మ గుడికి స్థలం కేటాయించగా ఊర్లోని యాదవులు చందాలు వేసుకుని గంగమ్మ తల్లికి గుడితో పాటు ప్రహరీ గోడను కట్టించారు.

మన ఊర్లో షెడ్యూల్డ్ కులాల వారికి వాళ్ల ఇళ్ళ దగ్గర ప్రత్యేకంగా ఇంకో బడి వుంది. అందులో కూడా ఒకటవ తరగతి నుంచి ఐదవ తరగతి వరకు ఉంది. ఈ రెండు బడులు కాకుండా మొదటి నుంచి ఉన్న మరొక బడి దొర్నిపాడుకు వెళ్లేదారిలో ఉంది. ఆ బడికి చాలా తరగతి గదులున్నాయి. విశాలమైన ఆవరణ, చెట్లు, చుట్టూ ప్రహరీ గోడ మొదలైనవి ఉన్నాయి. కానీ ఆ బడికి అంకితభావం గల ఉపాధ్యాయులు, హెడ్ మాస్టర్ లు చాలా కాలం లేకపోవడం చేత విద్యార్థులు చేరకుండా దాదాపు శిధిలావస్థలో ఉంది. ఆ బడిలోనే ఉర్దూ పాఠశాల కూడా వుంది. ఒక ఉర్దూ టీచర్ కూడా ఉన్నారు.

దొర్నిపాడుకు వెళ్ళే దారి వేపు మన ఊరు బాగా పెరిగింది. ప్రస్తుతం జంబులవంక అని పిలువబడే కాలువ వరకు పెరిగిపోయింది. కొద్దిరోజుల్లోనే మన ఊరికి దగ్గరగా వున్న గురువారెడ్డి పల్లె మన ఊరు రెండు కలిసిపోయే అవకాశం ఉంది. ఆ దారిలో బ్రాయిలర్ చికెన్ షాపులు, మటన్ షాపులు ఉన్నాయి. మోటర్ బైకులు ట్రాక్టర్లు బాగుచేసే మెకానికల్ షాపులు పంక్చరు వేసే షాపు ఉన్నాయి. షామియానా షాపు కూడా ఉంది. కోడిగుడ్లు టోకుగా అమ్మే షాపు ఉంది. అక్కడి నుంచి చుట్టుపక్కల ఉన్న ఊర్లకు కోడిగుడ్లను పంపిస్తున్నారు. ఆ దారిలోనే కోల్డ్ స్టోరేజ్ గోడౌన్ కూడా ఉంది.

కొత్త పల్లెకు వెళ్లేదారిలో పడిగెల రాముడు అనే యాదవ కులస్తుడు కాశినాయన ఆశ్రమం కట్టిస్తున్నాడు. రాయలసీమలో ఇప్పుడు చాలా గ్రామాల్లో కాశీనాయన ఆశ్రమాలు కడుతున్నారు. కర్నూలు జిల్లాలోనే సుమారు వందకు పైగా కాశిరెడ్డి నాయన ఆశ్రమాలు ఉన్నాయి. కాశిరెడ్డి అనే ఆయన మంచి యోగిగా ప్రసిద్ధుడు. దాతల నుంచి చందాలు పోగుచేసి పాడుబడిన దేవాలయాలను బాగు చేయడమే పనిగా పెట్టుకొని చాలా దేవాలయాలను బాగు చేయించాడు. ఆయన చనిపోయి చాలా కాలమయింది. అతని మీద భక్తి ఉన్న వాళ్ళు తమ సొంత డబ్బు కొంత,

కొంత చందాలు సేకరించి కాశిరెడ్డి నాయన ఆశ్రమం అనే పేరుతో ఆశ్రమాలు కడుతున్నారు. ఈ ఆశ్రమాల్లో ప్రధానంగా అన్నదానం చేస్తున్నారు. మన ఊరికి దగ్గరగా ఉన్న కలుగొట్ల అనే ఊరు నంద్యాల కోయిలకుంట్ల మార్గంలో ఉంది. ఆవూరి దగ్గర కాశినాయన ఆశ్రమం చాలా పెద్దది కట్టారు. ఆ ఆశ్రమంలో ప్రతిరోజు మధ్యాహ్నం రాత్రి  అన్నదానం చేస్తున్నారు. మధ్యాహ్నం పూట రాత్రిపూట ఆ మార్గంలో వెళ్లే ఆటోలు లారీలు వ్యాన్ లు ఆపి అక్కడ భోజనం చేసి వెళ్లిపోతుంటారు

గతంలో మన ఊర్లో వీధులన్నీ మట్టితో ఉండేవి. వర్షం వస్తే బురద, వీదుల్లోకి రావడానికి చాలా కష్టంగా ఉండేది. కానీ ఇప్పుడు మన ఊర్లో వీధులన్నీ సిమెంట్ రోడ్లతో ఉన్నాయి. ఎంత వర్షం పడిన పెద్దగా ఇబ్బంది లేకుండా ఉంది. మన ఊరికి చుట్టు పక్కల ఉన్న ఊర్లకు వెళ్లే రోడ్లు కూడా తారు రోడ్లు వేశారు. అయితే అవి ఇప్పుడు కొంత వరకు దెబ్బతిన్నాయి. అయినా సరే ఇబ్బంది లేకుండా ప్రజలు ఆటోల్లో మోటర్ బైకులు మీద ఆయా వూర్లకు వెళ్తున్నారు.

గతంలో రైతులందరి ఇళ్ళల్లో పాడిబర్రెలు చాలా ఉండేవి. పాడి ఉన్న ఇళ్ళల్లో స్త్రీలు తెల్లవారు జామునే లేచి మజ్జిగ చిలకడం, బర్రెలకు మేత వేయడం బర్రెల పాలు పితకడం మొదలైన పనులతో తెల్లవారుజామున  తీరిక లేకుండా ఉండేవారు. ప్రస్తుతం చాల తక్కువ మంది రైతులు మాత్రమే బర్రెలను పెంచుతున్నారు. పాడి లేని వాళ్ళందరూ పాల కేంద్రం నుంచి పాలు కొనుక్కుంటున్నారు. బర్రెలను పెంచడం, వాటి పేడ రొచ్చు తీసివేయడం వాటి ఆలనా పాలనా చూడడం చాలా కష్టంగా ప్రజలు భావిస్తున్నారు. అందువల్ల చాలా మంది రైతులు పాడి చేయడం లేదు.

గతంలో రైతులందరికీ కల్లాలు ఉండేవి. ఆ కల్లాల్లో పశువుల మేతకు జొన్నసొప్ప, వరిగడ్డి, వేరుసెనగ ఆకులను వాములుగా వేసే వాళ్ళు. ఆ కల్లాల్లోనే దిబ్బలు ఉండేవి. పశువుల పేడా రొచ్చు దిబ్బల్లో వేసే వాళ్ళు. అది బాగా కుల్లిపోయి సహజమైన ఎరువుగా మారేది. అది పొలాల్లో చల్లితే పొలానికి మంచి బలంగా ఉండేది. పంటలు బాగా పండేవి. ప్రస్తుతం పశువులను పెంచడం బాగా తగ్గిపోయింది. దిబ్బలు లేవు. చేలకు ఎరువు లేదు. పశువులు లేకపోవడం వల్ల రైతులు కళ్ళాల్లో వాములు వేయడం లేదు.  కొందరు రైతులు కల్లాల్లో ఇల్లు కట్టుకుంటున్నారు

మన చిన్నప్పుడు మన ఊర్లో ఫ్యాక్షన్ తగాదా బాగా ఉండేది. ఈ తగాదా లో వున్నవాళ్లు తమ ఇళ్లల్లో ఈటెలు వేటకొడవళ్లు బాంబులు ఉంచుకునేవారు. అంతేకాకుండా వీరు ఇంట్లో నుంచి బయటకు వచ్చి ఊర్లో తిరిగేటప్పుడు వేటకొడవలి గానీ ఈటె గానీ పట్టుకొని తిరిగేవారు. ప్రస్తుతం మన ఊర్లో ఫ్యాక్షన్ లేదు. అందువల్ల మన ఊర్లో ఎవరూ గూడా వేటకొడవళ్ళు బాంబులు ఈటెలు తమ ఇళ్లల్లో ఉంచుకోవడం లేదు.

గతంలో మన ఊర్లో కాఫీ టీ హోటల్ లు ఉండేవి కాదు. ఈనాడు కాఫీ టీ హోటల్ లే కాదు ఇడ్లీ, పూరి, ఉగ్గానిబజ్జి, దోసె మొదలైన టిఫిన్‌లతో పాటు భోజన హోటళ్ళు కూడా వున్నాయి. సాయంకాలం పూట చాట్, పానీపూరి, నూడిల్స్ మొదలైనవి కూడా లభిస్తున్నాయి. ఇలాంటివి పెట్టే బండ్లు మన ఊర్లో ఐదారు చోట్ల ఉన్నాయి.

గతంలో మన ఊర్లో మంగలి షాపులు ఉండేవి కావు. ఇప్పుడు మసీదు దగ్గర రెండు షాపులు, దొర్నిపాడుకు వెళ్లే మార్గంలో రెండు మూడు షాపులు ఉన్నాయి.

మన ఊర్లో ముస్లింల జనాభా ఎక్కువగానే ఉంది. ముల్లపేట తెలుగుపేట గాజులపేట లో వీరు ఎక్కువగా ఉన్నారు. వీరిలో ముల్లపేటలో ఉన్న ముస్లింలు మొదటి నుంచి ముస్లింల సంప్రదాయ దుస్తులు ధరించి తల మీద టోపీ పెట్టుకొని గడ్డం పెంచి రోజుకు ఐదు సార్లు మసీదు కు వెళ్లి నమాజు చేసే వాళ్ళు. ముల్లపేటలో ఉన్న ముస్లింల స్త్రీలు వ్యవసాయ పనులకు వెళ్ళేవారు కాదు. ఘోషా పాటించేవారు. బయటికి వస్తే బురఖా ధరించేవారు. గతంలో తెలుగుపేట గాజులపేటలో ఉన్న ముస్లింలు గడ్డం పెంచడం మసీదుకు వెళ్లి నమాజు చేయడం మొదలైనవి చాలా తక్కువ మంది చేసేవాళ్ళు. ప్రస్తుతం తెలుగు పేటలో గాజుల పేటలో ఉన్న ముస్లింలు కూడా చాలామంది గడ్డాలు పెంచి మసీదుకు వెళ్లి నమాజు చేస్తున్నారు. అయితే తెలుగు పేటలో గాజుల పేటలో ఉన్న ముస్లింల స్త్రీల విషయంలో పెద్దగా మార్పు లేదు. మొదటినుంచి ఈ స్త్రీలు శ్రమజీవులు, తమ సొంత పొలాల్లో పని చేయడం ఇతరుల పొలాల్లోకి కూలి పనులకు వెళ్లడం మొదలైనవి మొదటినుంచి చేస్తున్నారు, ఇప్పుడు కూడా చేస్తున్నారు.

మసీదు దగ్గర ఇద్దరు ముగ్గురు వ్యక్తులు పొట్టుజొల్లలను, పట్టలను అద్దెకు ఇచ్చే వ్యాపారం చేస్తున్నారు. పొట్టుజొల్ల చాలా పెద్దగంప సైజులో ఉంటుంది. గంపలు చేయడానికి ఉపయోగించే సన్నని వెదురు బద్దలతో దీన్ని చేస్తారు. లోపల వెడల్పు రెండు అడుగులుంటుంది. ఎత్తు మూడున్నర నాలుగు అడుగులుంటుంది. దీన్ని "గూడ" అని గూడా అంటారు. జొన్న పంట వేసిన వాళ్ళు కంకులు కోయడానికి ఈ పొట్టుజొల్లలను ప్రధానంగా ఉపయోగిస్తుంటారు. ఎకరా పంట కోయడానికి ఐదు లేక ఆరు గూడల అవసరముంటుంది. ఒక్కొక్క జొల్లకు అద్దె రోజుకు యాభై రూపాయలు. ఫిబ్రవరి మార్చి నెలల్లో వీటిని ఎక్కువగా ఉపయోగిస్తుంటారు. పట్ట ఒక్కొక్కటి 20 అడుగులు వెడల్పు 20 అడుగుల పొడవు ఉంటుంది. యూరియా అమ్మోనియా సల్ఫేట్ మొదలైన రసాయనిక ఎరువుల ఖాళీ ప్లాస్టిక్ సంచులను ఒకదానికొకటి కలిపి కుడతారు. గతంలో రైతులు చేలల్లో తాత్కాలికంగా కల్లాలను ఏర్పాటు చేసి వాటిలో అన్ని రకాల ధాన్యాలను పోసేవాళ్లు. తాత్కాలికంగా కల్లాలను

చేయడం కష్టంతో కూడిన పని. ఇప్పుడు ఎవరూ కల్లాలు చేయడం లేదు. ఈ పట్టలను తీసుకుని వెళ్లి వాటిమీద వడ్లు జొన్నలు శనగలు కందులు మినుములు మొదలైన అన్ని రకాల ధాన్యాలను పట్టల మీద పోసి ఆ తర్వాత బస్తాల్లో నింపి ఇంటికి తెచ్చుకుంటున్నారు. ఈ పద్ధతి చాలా సౌకర్యంగా ఉంది. ఒక పట్టాకు రోజుకు అద్దె 20 రూపాయలు.

క్రిమి సంహారక మందులను పంటల మీద స్ప్రే చేసే స్ప్రేయర్లను కూడా అద్దెకు ఇస్తున్నారు. ఇవి రెండు రకాలు, బ్యాటరీ స్ప్రేయర్లు, పవర్ స్ప్రేయర్లు, బ్యాటరీ స్ప్రేయర్ లు కరెంటు ద్వారా రీఛార్జి చేసి ఉపయోగిస్తారు. పవర్ స్ప్రేయర్ లు పెట్రోల్ ద్వారా పని చేస్తాయి. మన చిన్నప్పుడు ఇలాంటి స్ప్రేయర్లు ఉండేవి కాదు. పాత వాటితో స్ప్రే చేయాలంటే స్ప్రేయర్ ను వీపుకు కట్టుకొని ఎడమ చేత దాని హ్యాండిల్ ను కిందికి పైకి కొడుతూ కుడిచేతస్ప్రే చేయాలి. ఇది చాలా కష్టమైన పని. ఇప్పటి స్ప్రేయర్లలో అసలు హ్యాండిలే వుండదు. వీటితో స్ప్రే చేయడం చాలా సులభం. ఇలాంటి వాటిని కూడా ఈనాడు అద్దెకు ఇస్తున్నారు. రోజుకు ఒక్కొక్కస్ప్రేయర్ కు 50 రూపాయలు అద్దె. గతంలో ఇలా స్ప్రేయర్లను అద్దెకు ఇవ్వడం జరిగేది కాదు. కాలానుగుణంగా అనేక మార్పులు వస్తున్నాయి.

మన ఊర్లో ప్రతి బుధవారం సంత జరుగుతూవుంది. సంతలో కూరగాయలు, అనేక రకాల పండ్లు, ఇంటికి అవసరమైన కిరాణా వస్తువులు మొదలుకొని అన్ని సామాన్లు దొరుకుతున్నాయి. అంతేకాదు ప్రతిరోజు మన ఊర్లోకి అరటిపళ్ళు జామ పళ్ళు ద్రాక్ష పళ్ళు మొదలైన చాలా రకాల పళ్లను చిన్న చిన్న వ్యాన్ లలో ఆటోల్లో తెచ్చి అమ్ముతున్నారు. వేరుశనగ పప్పులు వేయించిన శనగపప్పులు అమ్మేవాళ్ళు మోటర్ సైకిల్ల మీద వచ్చి అమ్ముతున్నారు. గ్యాస్ స్టవ్ లు రిపేర్ చేసే వాళ్ళు మోటార్ సైకిల్ల మీద గ్యాస్ స్టవ్ రిపేర్ చేస్తామని చెబుతూ ఊరంతా తిరుగుతూ వాటిని బాగు చేస్తున్నారు. గతంలో ఇలాంటి సౌకర్యాలు గ్రామాల్లో ఉండేవి కావు. ఇప్పుడు ప్రతి గ్రామంలోనూ ఇలాంటి సౌకర్యాలు ఉన్నాయి. గతంలో మన ఊరి వాళ్ళు సంతకు మన ఊరికి దగ్గరగా ఉన్న ఆళ్ళగడ్డకు వెళ్లేవారు. ప్రస్తుతం ఎవరూ ఆళ్ళగడ్డకు వెళ్లడం లేదు.

పట్టణాల్లోనూ నగరాల్లోనూ ఉన్న అన్ని సౌకర్యాలు నేడు మన గ్రామంలో అందుబాటులో ఉన్నాయి. ఏ.సీ లు ఫ్రిజ్ లు కూలర్లు మన ఊర్లో చాలా మంది వాడుతున్నారు. కుర్చీల్లో కూర్చుని డైనింగ్ టేబుల్ మీద భోజనాలు చేస్తున్నారు. ఎలక్ట్రికల్ ఫ్యాన్ లు సరే సరి. ఎలక్ట్రికల్ పనులు చేసేవాళ్ళు ప్లంబింగ్ పనులు చేసేవాళ్ళు మోటర్ బైకులు ట్రాక్టర్లు రిపేర్ చేసే వాళ్ళు టైర్లకు పంక్చర్లు వేసే

వాళ్ళు మన ఊర్లోనే ఉన్నారు. మోటారు బైకులు స్కూటర్లు సర్వీస్ చేసే వాళ్లు కూడా మన ఊర్లోనే ఉన్నారు. మన చిన్నతనంలో ఇలాంటి వారు మన ఊర్లో ఉండేవారు కాదు. మోటర్ బైకులు స్కూటర్లు మోపెడ్ లు ట్రాక్టర్లు కార్లు మొదలైన వాహనాలను ప్రస్తుతం చాలామంది వాడుతూ వుండడం చేత ఇలాంటి వాళ్లందరికీ మంచి ఉపాధి లభిస్తూ వుంది.

గతంలో మన ఊర్లో ఇల్లు అన్నీ మిద్దెలుగా ఉండేవి. గేదెలు ఎద్దులు ఆవులు ఇంట్లో కట్టేసుకోవడానికి వీలుగా మిద్దెలు కట్టుకునేవారు. ప్రస్తుతం ఇళ్ళను ఎవరూ అలా కట్టుకోవడం లేదు. పట్టణాల్లో నగరాల్లో మాదిరిగా అటాచ్‌డ్ బాత్ రూమ్ లతో పడక గదులు, వంటగది, భోజనం గది, హాలు ఉండేటట్లుగా ఆధునిక పద్ధతుల్లో స్లాబ్ లు వేసి డాబా ఇళ్ళు కట్టుకుంటున్నారు. కొంతమంది నగరాల్లో మాదిరిగా వివిధ జాతులకు చెందిన పెంపుడు కుక్కలను పెంచుకుంటున్నారు. శనగలు మిరపకాయలు లాంటి వ్యవసాయ ఉత్పత్తులను ఇళ్ళల్లో పెట్టకుండా కోల్డ్ స్టోరేజ్ గోడౌన్లలో ఉంచుతున్నారు. ఈ గోడౌన్ లను నడుపుతున్న వారు మంచి లాభాలు ఆర్జిస్తున్నారు. వారి వ్యాపారం బాగా సాగుతూ వుంది.

మన చిన్నప్పటికీ ఇప్పటికీ మాల మాదిగల జీవితాల్లో చాలా మార్పు వచ్చింది. మన చిన్నప్పుడు చాలామంది మాల మాదిగలు రైతుల ఇళ్లలో జీతగాళ్లుగా ఉండే వాళ్ళు. మిగిలిన వాళ్ళు జీతగాళ్ళుగా లేకపోయినప్పటికీ రైతులను ఆశ్రయించి జీవించేవాళ్ళు. ఆ సమయంలో వాళ్ళ జీవితం చాలా దయనీయంగా ఉండేది. ప్రస్తుతం వారి జీవితంలో చాలా మార్పు వచ్చింది. ప్రస్తుతం వాళ్ళు ఎవరూ జీతగాళ్లుగా ఉండడం లేదు. ప్రభుత్వం ప్రవేశపెట్టిన పథకాలు వారు బాగా ఉపయోగించుకుని తమ జీవితాలను మార్చుకున్నారు. వాళ్లు మంచి డాబా ఇల్లు కట్టుకున్నారు. వాళ్ళ వీధులు మునిపటి లాగా దుర్గంధంగా వుండడం లేదు. వాళ్ళ వీధులు కూడా సిమెంట్ రోడ్లతో మురికి కాలువలతో శుభ్రంగా ఉంటున్నాయి. ఇది చాలా సంతోషించదగ్గ పరిణామం

గతంలో మన ఊర్లో వాళ్లు తమ మగపిల్లలకు శ్రీనివాసులు గోవిందుడు రాముడు చెన్నయ్య మునయ్య సుబ్బారెడ్డి నాగిరెడ్డి మొదలైన పేర్లు పెట్టుకునే వారు. ఆడపిల్లల పేర్లు ఎక్కువగా లక్ష్మీదేవితో కలిసి ఉండేవి. నాగలక్ష్మి, రామలక్ష్మమ్మ, జయలక్ష్మమ్మ, లక్ష్మీదేవమ్మ ఇలాగ ఉండేవి. కానీ ఇప్పుడు ఎవరూ ఇలాంటి పాతపేర్లు పెట్టుకోవడం లేదు. శిశువు పుట్టగానే పంచాంగం తెలిసిన బ్రాహ్మణుని దగ్గరికి వెళ్లి శిశువు పుట్టిన సమయం చెప్పి ఏ అక్షరంతో పేరు మొదలు కావాలో తెలుసుకుని ఆధునికమైన కొత్త కొత్త పేర్లు పెట్టుకుంటున్నారు. ప్రస్తుతం రోహిత్, శశాంక్, ధీరజ్, జగత్

లాంటి పేర్లు మగ పిల్లలకు రోషిత, శాన్విక, హృత్విక, స్పందన, పూజిత మొదలైన ఆధునికమైన పేర్లు ఆడ పిల్లలకు పెట్టుకుంటున్నారు. మన ఊర్లో షిరిడి సాయి బాబా భక్తులు కూడా ఎక్కువగానే ఉన్నారు. వాళ్లు తమ సంతానం పేర్ల ముందు సాయి అనే పదాన్ని చేర్చుతున్నారు. ఉదాహరణకు సాయి రోషిత, సాయి శశాంక్ ఇలాంటివి.

గతంలో నీళ్లు గిలకల బావి నుంచి చేత్తాడు ద్వారా చేదుకొని ఇంటికి మోసుకొని తెచ్చుకునే వాళ్ళం. ఇది చాలా కష్టంతో కూడుకున్న పని. గతంలో రైతులకు గేదెలు ఎద్దులు ఉండేవి. వాటన్నింటికి చాలా నీళ్ళు కావలసి వచ్చేది. అన్ని నీళ్లు తీసుకొని రావడం చాలా కష్టంగా ఉండేది. ప్రస్తుతం మన ఊరికి రక్షిత మంచినీటి పథకం ద్వారా ఇంటింటికి కుళాయిలు వేసి నీటిని సరఫరా చేస్తున్నారు. ఇది ప్రజలకు చాలా సౌకర్యంగా సుఖంగా ఉంది. కొంతమంది నగరాల్లో లాగా ఇంటి పైన నీళ్ల ట్యాంక్ పెట్టుకొని నీటిని మోటార్ ద్వారా ట్యాంకులోకి ఎక్కించి మరింత సుఖంగా సౌకర్యంగా పైపులద్వారా నీటిని వాడుకుంటున్నారు. గత కాలంలోని మంచినీటి బావులు, ఊరబావుల నుంచి ఎవరూ నీళ్ళు తోడకపోవడం చేత ఆ బావులు పాడుపడిపోయాయి. మన ఊర్లోని ఒక వ్యక్తి ఆర్.వో పద్ధతి ద్వారా తాగునీటిని శుద్ధి చేసి తన వాహనం ద్వారా ఇంటింటికి ఫిల్టర్ వాటర్ ను డబ్బులకు సరఫరా చేస్తున్నాడు.

గతంలో పొయ్యి మీద వంట చెరుకుతో వంట చేసేవారు. దీనివల్ల ఇల్లంతా పొగ చూరి పోయేది. ఆడవాళ్లకు వంట చేయడం చాలా కష్టంగా ఉండేది. నోటితో గానీ, గొట్టంతో గానీ పొయ్యిలో అగ్గిని ఊపాలి. వంట పూర్తిగా అయిపోయే వరకు వారు పొయ్యి దగ్గరే ఉండాలి. ఎండాకాలం స్త్రీలకు పొయ్యి దగ్గర వేడి నరకంగా ఉండేది. అలాగే వర్షాకాలం కట్టెలు తడిసిపోయి పొయ్యిలో మంట వచ్చేది కాదు. ప్రస్తుతం మన ఊర్లో ప్రజలందరూ ఎల్పీజీ కనెక్షన్ తీసుకున్నారు. గ్యాస్ స్టవ్ లతో వంట చేసుకుంటున్నారు. ఇది స్త్రీలకు చాలా సౌకర్యంగా సుఖంగా ఉంది. ప్రతి రోజు ఆళ్లగడ్డ నుంచి కోవెలకుంట్ల నుంచి గ్యాస్ సిలిండర్ లు వ్యాన్ లలో వస్తున్నాయి. మనం ముందుగా గ్యాస్ సిలిండర్ బుక్ చేసుకుంటే మన ఇంటి దగ్గరికి వచ్చి గ్యాస్ సిలిండరు ఇచ్చిపోతున్నారు. ఈ పద్ధతి చాలా సౌకర్యంగా ఉంది.

క్రిష్ణ తమ ఊర్లో వచ్చిన మార్పులను గురించి వివరంగా జయదేవ్ కు చెప్పాడు. అదంతా విన్న తర్వాత “నువ్వు చెప్పిన దాన్ని బట్టి చూస్తే మన ఊర్లో వచ్చిన మార్పులన్నీ మంచివే అనిపిస్తూ వుంది. ఇంత బాగా అభివృద్ధి సాధించిన మన ఊరును చూస్తే నాకు చాలా సంతోషంగా ఉంది” అని జయదేవ్ అన్నాడు.

దానికి క్రిష్ణ జయదేవ్ తో చెప్పాడు.

నాణానికి రెండు వైపులు ఉన్నట్లుగానే అభివృద్ధికి అవతలివైపు కొంత చెడు కూడా ఉంది. ఊర్లో రైతులు పాడి పంట మానివేసి అంటే వ్యవసాయం చేయడం పశువులను పెంచడం మానివేసి తమ పొలాన్ని కౌలుకిచ్చి ఇంట్లో సుఖంగా సోమరిగా ఉంటున్నారు. నడవడం మానివేసి బైక్ లలో తిరగటం వల్ల వాళ్లకు ఊబకాయంతో పాటు షుగరు బీ.పీ మొదలైన జబ్బులు చిన్న వయసులోనే వస్తున్నాయి. కొంతమందికి గుండెజబ్బులు కూడా వస్తున్నాయి. ఇలాంటి వాళ్ళందరూ డాక్టర్ల చుట్టూ తిరుగుతూ అన్నంతో పాటు మందులు కూడా తింటున్నారు.

పట్టణాలు నగరాల్లో లాగా ప్లాస్టిక్ వస్తువులు వాడకం పెరిగిపోయింది. ప్లాస్టిక్ కుర్చీలు టేబుళ్ళు బిందెలు సీసాలు ఊర్లో అందరూ వాడుతున్నారు. హోటల్ లలో ప్లాస్టిక్ గ్లాసులు కప్పులు ప్లేట్లు పాలిథిన్ కవర్లు మొదలైనవి ఎక్కువగా వాడుతూ ఎక్కడ పడితే అక్కడ పారేస్తున్నారు. ఈ కారణం చేత ఊర్లో ఎక్కడ చూసినా ప్లాస్టిక్ మయంగా ఉంది. పారిశుద్ధ్య కార్మికులు వీటిని తగలబెడుతున్నారు. దానివల్ల కాలుష్యం పెరిగిపోతూ వుంది.

చాలా మంది యువకులు తాగుడుకు గుట్కా, ఖైని లాంటి వాటికి బానిస అవుతున్నారు. ఈ కారణం చేత వాళ్ల కుటుంబాల్లో అనేక రకాల సమస్యలు తగవులు వస్తున్నాయి.

మనుషులు పూర్తిగా డబ్బు మనుషులైపోయారు. ప్రేమలు అభిమానాలు ఆప్యాయతలు మనుషుల్లో కనిపించడం లేదు. వృద్ధులైన తల్లిదండ్రులను, నానమ్మ అబ్బలను పట్టించుకోక పోగా వాళ్ళు తొందరగా చావడం లేదని హింసిస్తున్నారు. ఇలాంటి వృద్ధులు చాలా అవస్థలు పడుతున్నారు, తమకు ఇంకా చావు రానందుకు బాధపడుతున్నారు. పట్టణాలు నగరాల్లో మాదిరిగా ఇలాంటి వాళ్లకు వృద్ధాశ్రమాలు పల్లెటూర్లలో లేవు. తప్పనిసరి అయి కొడుకుల దగ్గర మనుమల దగ్గర ఉంటూ నానా అవస్థలు పడుతున్నారు అనిక్రిష్ణ జయదేవ్ తో చెప్పాడు. అతను చెప్పింది విన్న తర్వాత జయదేవ్ విచారంతో పెద్ద నిట్టూర్పు వదిలాడు. ఎందుకంటే వృద్ధులను పట్టించుకోకుండా ఉండడం నిర్లక్ష్యం చేయడం అన్నిచోట్లా ఉన్నది. నగరాల్లో కూడా ఇలాంటి సమస్యలు ఉన్నాయి. ఏమైనా ప్రపంచం తో పాటు తన ఊరు కూడా అభివృద్ధి చెందినందుకు జయదేవ్ చాలా సంతోషించాడు.

* * *

# అమ్మమ్మ గారి ఊరు

"నా మనవరాలు పెళ్లి, నువ్వు తప్పకుండా రావాల సామి, నువ్వు ఇటిక్యాల వదిలిపెట్టి 50 సంవత్సరాలు పైగా అయింది. ఇంతవరకు ఒక్కసారి కూడా రాలేదు, ఇటిక్యాల చాలా మారిపోయింది, మన చిన్నప్పుడున్న ఇటిక్యాలకు ఇప్పటి ఇటిక్యాలకు పొంతనే లేదు. నా మనవరాలు పెళ్లికి వచ్చినట్టుగా ఉంటుంది, నువ్వు పుట్టి పెరిగిన ఇటిక్యాలను చాలా కాలం తర్వాత చూసినట్లుగా ఉంటుంది, తప్పకుండా రా సామి".

అని జయదేవ్ చిన్ననాటి మిత్రుడు దేసన్న ఫోన్ లో తన మనవరాలి పెళ్ళికి ఇటిక్యాలకు రమ్మని జయదేవ్ ను ఆహ్వానించాడు.

దేసన్న ఆహ్వానాన్ని అందుకని సుమారు 55 సంవత్సరాల తర్వాత ఆచార్య జయదేవ్ ఇటిక్యాల గ్రామానికి వెళ్లాడు. ప్రస్తుతం ఆ గ్రామం నంద్యాల జిల్లా కొలిమిగుండ్ల మండలంలో ఉంది. వ్యక్తి జీవితంలో 55 సంవత్సరాలు చాలా ఎక్కువే. అది జయదేవ్ అమ్మమ్మ గారి ఊరు. ఆయన పుట్టింది, పెరిగి పదకొండు సంవత్సరాల వయస్సు వచ్చే వరకు ఉన్నది, ఐదవ తరగతి వరకు చదువుకున్నది ఆ ఊర్లోనే.

జయదేవ్ తాను వస్తున్నట్టుగా దేసన్నకు ముందుగా వర్తమానం పంపించాడు. దేసన్న జయదేవును ఆహ్వానించడానికి ఇటిక్యాల బస్టాండ్ దగ్గరకి వచ్చాడు. ఇటిక్యాల గ్రామం బస్సులు నడిచే రోడ్డుకు సుమారు కిలోమీటరు పైగా దూరంలో ఉంది. జయదేవ్ ఆ వూరి దగ్గర బస్సు దిగగానే ఆశ్చర్యపోయాడు. ఎందుకంటే రోడ్డు దగ్గర చాలా ఇళ్ళు ఉన్నాయి. ఆ ఇళ్ళను గురించి దేసన్న జయదేవుకు వివరించాడు.

"ఊర్లో ఉన్న చాలామంది అక్కడ ఇళ్ళు వదిలేసి రోడ్డు దగ్గరికి వచ్చి ఇళ్ళు కట్టుకున్నారు. మా గ్రామస్తుల పొలాలన్నీ ఒక సిమెంట్ ఫ్యాక్టరీ వాళ్ళు సుమారు

పది సంవత్సరాల కిందట తీసుకొని పొలాల యజమానులకు డబ్బు ఇచ్చారు, ఊర్లో వ్యవసాయం చేయడానికి ఒక్క ఎకరం పొలం కూడా లేదు, మొత్తం పొలమంతా సిమెంట్ ఫ్యాక్టరీ వాళ్ళు తీసుకున్నారు, బ్రతుకుతెరువు లేని ఆ వూర్లో ఉండలేక చాలా మంది రైతులు ఊరు వదిలేసి చుట్టుపక్కల ఉన్న పట్టణ ప్రాంతాలకు గ్రామాలకు వెళ్లిపోయారు. సిమెంట్ ఫ్యాక్టరీ మావూరికి దగ్గరగా ఉన్న కొలిమిగుండ్ల దగ్గర కడుతున్నారు. ఇంకా సిమెంట్ ఉత్పత్తి ప్రారంభం కాలేదు.” అని దేసన్న చెప్పాడు.

జయదేవ్ దేసన్నతో కలిసి ఆ రోడ్డు దగ్గర నుంచి నడుచుకుంటూ ఊర్లోకి బయలుదేరాడు. అదంతా సిమెంట్ రోడ్డు. ఆయన చిన్నతనంలో అదంతా మట్టిరోడ్డు. రాళ్ళతో చాలా ఎగుడుదిగుడుగా ఉండేది. ప్రస్తుతం సిమెంట్ రోడ్డు చాలా బాగుంది. ఆ సమీపంలోనే బడి కనబడింది. అది ఆవూరి ప్రాథమిక పాఠశాల. ఆయన చదువుకున్నప్పుడు ఆ బడి ఆ వూరుకు ప్రారంభంలో ఉన్న పెద్ద చావడిలో ఉండేది. అక్కడి నుంచి ఆ బడిని రోడ్డు దగ్గరకు మార్చారట. మంచి భవనాలతో విశాలమైన ఆవరణతో బడి చాలా బాగుంది.

కొంచెం దూరం వెళ్ళగానే ఒక పెద్ద వాటర్ ట్యాంక్ కనిపించింది. దాన్ని గురించి దేసన్న జయదేవ్ కు చెప్పాడు.

“రక్షిత మంచినీటి పథకం కింద ప్రభుత్వం వారు అక్కడ ఒక పెద్ద బోరుబావి వేసి అందులోని నీటిని మోటార్ ద్వారా నీటిటాంకులోకి ఎక్కించి ఇటిక్యాల గ్రామానికి పైపుల ద్వారా నీటిని సరఫరా చేస్తున్నారు. అక్కడే మినరల్ వాటర్ ప్లాంట్ కూడా ఉంది. ఆ ప్లాంట్ ను స్థానిక ఎం. పీ. గారు తన ఎంపీ నిధులతో కట్టించారు. ఆవూరు వాళ్ళే గాకుండా చుట్టుపక్కల ఊళ్ళలో మినరల్ వాటర్ కావలసిన వాళ్ళు అక్కడికి వచ్చి నీళ్లు పట్టుకుని వెళ్తారు”.

జయదేవ్ ఎం.పీ. గారు చేసిన పనికి చాలా సంతోషించాడు.

ఇంకా ముందుకి వెళ్ళగా దారిలో దస్తగిరి స్వామి దర్గా కనిపించింది, జయదేవ్ చిన్నప్పటి నుంచి ఆదర్గా ఉంది. ఆ ఊర్లో ముస్లింలు ఎవరూ లేరు. దూదేకుల వాళ్ల కుటుంబం ఒకటి వుండేది. ఆ కుటుంబం వాళ్ళు దానికి పూజారులుగా ఉండేవారు. ప్రతి గురువారం ఊర్లోని హిందువులు దస్తగిరి స్వామికి బెల్లం గానీ చక్కెర గానీ చదివింపులు చేసేవారు. ఇలా చదివించడాన్ని ఉర్దూలో ఫాతెహా అంటారు. ఏదైనా శుభకార్యం చేయడానికి ముందు గురువారం దస్తగిరి స్వామికి తప్పనిసరిగా బెల్లం గానీ చక్కెర గానీ చదివించేవారు. జయదేవ్ కుటుంబం గూడా ఆయన చిన్నప్పుడు చాలా సార్లు బెల్లం చదివించింది. ఆయన చాలా సార్లు బెల్లం చదివించినప్పుడు

దస్తగిరి స్వామి దర్గాకు వెళ్లాడు. గురువారం సాయంత్రం ఆరున్నర ఏడు గంటల సమయంలో బెల్లం చదివించేవాళ్ళు స్నానం చేసి బెల్లం తీసుకొని దస్తగిరి స్వామి దర్గా దగ్గరికి వెళ్తారు. అక్కడ పూజారి ప్రార్థన చేసి బెల్లం మీద చేయి వేసి కొంత బెల్లం తీసుకుంటాడు. ఆ తర్వాత మిగిలిన బెల్లాన్ని బెల్లం తీసుకెళ్లిన వాళ్ళు ఇంటికి వస్తూ దారిలో ఎదురైన వాళ్లకు ఊర్లో వాళ్లకు కొంచెం కొంచెం ప్రసాదంగా పెడతారు. దీన్నే బెల్లం పంచడం అని గూడా అంటారు. అలాగే చక్కెర కూడా. దర్గా అప్పటికంటే ఇంకా బాగా అందంగా కొత్తగా రంగులు వేసి ఉంది. దానికి పూజారులుగా ఉన్న దూదేకుల కుటుంబం ప్రస్తుతం ఐదు కుటుంబాలు అయిందని దేసన్న చెప్పాడు.

దస్తగిరి స్వామి దర్గా పక్కనే ఒక దిగుడు బావి ఉంది. బావిలోకి దిగడానికి మెట్లు ఉన్న బావిని దిగుడుబావి అంటారు. మెట్లకు ఎదురుగా బావి పైన రెండు మూడు అడుగుల ఎత్తులో "ఉద్ది" అనేదాన్ని కడతారు. అది చాలా పెద్ద బావి. జయదేవ్ చిన్నతనంలో ఆవూర్లోని పిల్లలు ఆ బావిలోనే ఈత కొట్టడం నేర్చుకునే వాళ్ళు. ఈత నేర్చుకునే వాళ్ళు నడుముకు మునగబెండ్లు కట్టుకుంటారు. రెండడుగుల పొడవున్న బాగా ఎండిన మునగచెట్టు కొయ్యలను చిన్న మోపు లాగా కట్టి దాన్ని ఈత నేర్చుకునే వాళ్ళు నడుము దగ్గర కట్టుకుంటారు. దాన్ని మునగ బెండ్లు అంటారు. అవి మనిషిని నీళ్లలో మునిగిపోకుండా తేల్చుతాయి. జయదేవ్ ఆ బావిలోనే ఈత నేర్చుకున్నాడు. ఎండాకాలంలో తప్పనిసరిగా ఆ బావిలో పిల్లలు ఎక్కువమంది ఈదులాడేవాళ్ళు. కొంతమంది పెద్ద వాళ్ళు కూడా ఈతకు వచ్చేవాళ్ళు. బావిలో ఇంచుమించు 15 అడుగుల కింద నూతిలో నీళ్ళుండేవి. ఈత బాగా వచ్చిన పిల్లలు నిక్కర్లు వేసుకొని పైనుంచి బావిలోకి దూకేవాళ్ళు. కొంతమంది ఉద్ది పైనుంచి బావిలోకి తలకిందులుగా దూకే వాళ్ళు. కొంత సేపు ఈదులాడిన తర్వాత బావి పైన పరిచిన నాపరాళ్ళ మీద పిల్లలు ఎండలో పడుకునేవారు. అలా కాసేపు పడుకొని ఎండ ఒంటి మీద చుర్రుమనగానే మళ్లీ బావిలోకి దిగి ఈదులాడేవారు. బావి దగ్గర ఈదులాడే సమయంలో పిల్లలు చేసే ఈపనులన్నీ చిన్నతనంలో జయదేవ్ కూడా చేశాడు. జయదేవ్ ఆ బావి దగ్గరకి వెళ్లి చూశాడు. అది చాలా వరకు పాడుబడిపోయింది. అందులో నీళ్లు మురికిగా ఉన్నాయి. ఆ బావిలో ఎవరు ఈతమ కొట్టడం లేదని దేసన్న చెప్పాడు. అందువల్ల అవి దుర్వాసన వస్తున్నాయి.

అక్కడికి సుమారు రెండు ఫర్లాంగుల దూరంలో జయదేవ్ చిన్నప్పుడు చదువుకున్న బడి చావిడి ఉంది. జయదేవ్ దాని దగ్గరికి వెళ్లాడు. ప్రస్తుతం అది పూర్తిగా పాడుపడిపోయి వుంది. ఆచావిడి చాలా పెద్దది, ఎదురెదురుగా రెండు పెద్ద గదులు ఉన్నాయి. ఆ రెండు పెద్ద గదులను కలుపుతూ పై కప్పు ఉంది. జయదేవ్ఆ

రెండు గదుల్లోనూ కలయదిరుగుతూ అక్కడ చదువుకున్న కాలం నాటి జ్ఞాపకాలతో కాసేపు ఉండిపోయాడు. ఆయన అక్కడ ఒకటవ తరగతి నుంచి ఐదవ తరగతి వరకు చదువుకున్నాడు. ఆ రెండు గదుల్లోనూ కింద ఇసుక ఉండేది. ఆ ఇసుకలో విద్యార్థులకు ఓనమాలు, ఏ బి సి డి లు నేర్పించేవారు. ఆ బడిలో బలరామరాజు గారు అని ఒక మంచి ఉపాధ్యాయుడు ఉండేవారు. ఆయన అంకితభావంతో పాఠాలు చెప్పేవారు. ఆయనతో పాటు మరొక  ఉపాధ్యాయుడు కూడా ఉండేవారు. బలరామరాజుగారు తమ సర్వీస్ మొత్తం ఆ ఊర్లోనే చేశారు. అది ఆయనకు సొంత ఊరు లాగా అయిపోయింది. ఆయనకు సంతానం చాలా ఎక్కువ. ఆయనకే కాదు అప్పట్లో చాలా మంది కనీసం ఏడు ఎనిమిది మందిని కనేవారు. ఆయన హాజరు వేసేటప్పుడు అందరినీ పేరు పెట్టి పిలిచేవారు. ఎవరైనా బడికి రాకపోతే రాని ఆ కుర్రవాని ఇంటికి ఆక్లాసు పిల్లలను  పంపించి ఆ కుర్రవాడిని బలవంతంగా లాక్కొని వచ్చేట్టు చేసేవారు. ఎవరినీ వదిలేవారు కాదు. తప్పనిసరిగా విద్యార్థులందరూ బడికి వచ్చేలాగా గట్టిగా ప్రయత్నించేవారు. క్రమశిక్షణ విషయంలో అతను చాలా నిక్కచ్చిగా ఉండేవారు. చదువు విషయంలో కూడా అంతే నిక్కచ్చిగా ఉండేవారు. చదువు బాగా చెప్పేవారు. హోం వర్క్ చేసుకురాకపోయినా, అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పకపోయినా ఆయన బెత్తంతో బాగా దండించే వారు. సాయంత్రం బడి వదిలే ముందు అన్ని తరగతుల పిల్లలను నిలబెట్టి ఒకటి నుంచి 20 వరకు ఎక్కాలు, వారాల పేర్లు, తెలుగులో నెలల పేర్లు, సంవత్సరాల పేర్లు అందరిచేత పలికించేవారు. దాని వల్ల అవన్నీ అందరికీ కంఠోపాఠమయ్యేవి. ఆ మహానుభావుని దయ వల్లనే జయదేవ్ లాంటి వాళ్ళు బాగా చదువుకో గలిగారు. జయదేవ్ ఒకసారి ఆయన్ను గుర్తు చేసుకున్నాడు.

ఆ బడి చావడికి కొంచెం ముందుగా ఎడంవైపు ఒక గిలకల బావి ఉంది. ఇటిక్యాల గ్రామంలోని ప్రజలందరూ ఆ బావికి వచ్చి నీళ్లు తీసుకొని వెళ్ళేవారు. గ్రామం మొత్తానికి అదొక్కటే బావి. వేరే బావి లేదు. ఆ బావిలో నీళ్లు చాలా లోపల ఉండేవి. అంత లోపల నుంచి కడవతో నీళ్లు ఒక్కరు తోడడం చాలా కష్టం. అందుకని ఇద్దరు కలిసి బావిలో వేసిన కడవను చేత్తాడు ద్వారా పైకి లాగే వారు. ఇద్దరు కలిసి కడవను లాగేటప్పుడు ఒకరి తర్వాత ఒకరు తాడును లాగి వదిలిపెట్టేవారు. ఒకరు వదలగానే మరొకరు తాడును పట్టుకుని లాగేవారు. కొత్త వాళ్లకు ఇది చిత్రంగానూ చూడముచ్చటగా ఉండేది. ప్రజలందరూ మట్టి కడవలను ఉపయోగించేవారు. ఇంట్లో మంచి నీళ్ల బాన పొంత కూడా మట్టివే  వుండేవి. వంట పాత్రలు కూడా చాలా వరకు కూడా మట్టివే ఉండేవి. అప్పట్లో తెల్లవారుజామున 5 గంటల నుంచి ఊర్లోని

ప్రజలు నీళ్ళ కోసం వచ్చి నీళ్ళు చేదేవారు. నీళ్లు చేదేటప్పుడు గిలకలు చెవులకింపుగా లయబద్ధంగా మోగుతూ ఉండేవి. ఇంచుమించు తొమ్మిది గంటల వరకు విరామం లేకుండా గిలకలు మోగుతూ ఉండేవి.

గిలకల బావి నుంచి నీళ్లు చేదుకొని రావడం కష్టంతో కూడిన పని. అనారోగ్యంతో వున్నవారు, చేతుల నొప్పి కాళ్ళ నొప్పి నడుము నొప్పి ఉన్న వాళ్లు బావి నుంచి నీళ్లు తెచ్చుకోలేరు. పశువులు ఎక్కువగా ఉన్నవారు చాలా నీటిని తెచ్చుకోవాలి. ఎక్కువ నీటిని తెచ్చుకోవడానికి వాళ్లు చాలా కష్టపడాలి. ప్రస్తుతం ప్రభుత్వం వారు నీళ్ళ ట్యాంకు నుంచి నీటి గొట్టాల ద్వారా ఇంటింటికి కుళాయిలు వేసి నీటిని సరఫరా చేస్తున్నారు. ఇది ప్రజలకు చాలా సౌకర్యంగా సుఖంగా ఉంది. జయదేవ్ బావి దగ్గరకు వెళ్లి చూశాడు. బావి బాగానే ఉంది. నీళ్లున్నాయి కానీ అవి మురికిగా ఉన్నాయి. ప్రతి ఇంటికి కులాయి ఉండటం చేత నీళ్ల కోసం ఎవరూ బావికి పోవడం లేదని దేసన్న చెప్పాడు. నీళ్లు వాడకపోవడం చేత బావిలో నీళ్ళు దుర్వాసన వస్తున్నాయి

చావడి దాటగానే అగడ్త కనిపిస్తుంది. దాని ద్వారానే బండ్లు ఊర్లోకి వెళ్తాయి. మనుషులు నడవడానికి వేరే మార్గం ఉంది, కానీ అది చాలా ఇరుకైన దారి. ఎద్దులబండ్లు కార్లు మొదలైనవి ఆ దారిలో వెళ్ళలేవు. అలాంటివన్నీ ఈ అగడ్త ద్వారానే వెళ్లాలి. జయదేవ్ చిన్నతనంలో అది రాళ్లతో కూడిన మట్టి రోడ్డు. ప్రస్తుతం అది సిమెంట్ రోడ్డు, దాని పక్కన చిన్న కాలువ లాంటిది ఉంది. ఆ కాలువ పక్కన కోటగోడ ఉంది. ఆ గోడ శిథిలావస్థలో ఉంది. ఒకప్పుడు అది కోటగా ఉండి ఏదైనా పాలెగానికి నివాసంగా ఉండి ఉండవచ్చునని ఆయన భావించాడు. ప్రస్తుతం కోట లేదు. అగడ్త పక్కన ఒక గోడ మాత్రమే ఉంది. దాన్ని కోటగోడఅని పిలుస్తుంటారు. ఆ కోటను ఎవరు కట్టించారు? దానికి సంబంధించిన సమాచారం ఎవరికీ ఏమీ తెలియదు. కోటకు ముందు భాగంలో రామాలయం ఉంది. ఆ రామాలయం జయదేవ్ చిన్నప్పటి నుంచి ఉంది.

జయదేవ్ ఆ అగడ్తను దాటి ఊర్లోకి వెళ్ళాడు. చాలా ఇళ్ళు పాడుపడిపోయి వున్నాయి. ఆ ఇళ్ళ యజమాలందరూ అక్కడున్న ఇళ్లను వదిలి వేసి రోడ్డు మీదకు గానీ లేక అక్కడికి దగ్గరలో ఉన్న పట్టణానికి గానీ వలస పోయారని దేసన్న చెప్పాడు. జయదేవ్ వాటిని దాటుకుంటూ గతంలో ఆయన కుటుంబం నివాసమున్న ఇంటి దగ్గరికి వెళ్లాడు. ఆ ఇంటిని చూసి ఆయన ఆశ్చర్యపోయాడు. ఆ ఇల్లు పూర్తిగా పాడుబడిపోయి ఉంది. అది చాలా పెద్ద ఇల్లు. ఆ ఊర్లోని పెద్ద ఇళ్ళల్లో అది ఒకటి.

అది పూర్తిగా రాయలసీమ పద్ధతిలో కట్టిన ఇల్లు. రాయలసీమలో ఇళ్లను మిద్దెలు అంటారు. మిద్దెల గోడలు రాళ్ళతో కడతారు. మధ్యలో స్తంభాలను నిలబెట్టి వాటి మీద దూలాలు వేస్తారు. దూలాల మీద దంతెలు పరుస్తారు. దంతెల మీద వెదుర బద్దలతో అల్లిన తడికలను వేసి ఆతడికల మీద నాపరాళ్ళు పరుస్తారు. ఆ నాపరాళ్ళ మీద ముందు బంక మట్టి వేసి దానిపైన చవిటి పొడిమట్టిని వేస్తారు. ఈ పొడి మన్ను బాగా అతుక్కొని వర్షాలకు మిద్దె కారకుండా చేస్తుంది. ఈ చవిటి మన్ను వర్షాలకు కొట్టుకొని పోతూ వుంటుంది. అందువల్ల రెండు సంవత్సరాలకు ఒకసారి కొత్త చవిటి మన్ను మిద్దె పైన పోయవలసి ఉంటుంది. అలా పోయకపోతే మిద్దె వర్షాలకు కారుతుంది. ఇది రాయలసీమ మిద్దెలకు సంబంధించిన బాహ్యరూపం.

ఇంటి లోపల ఎలా ఉంటుందంటే తలవాకిలి కంటే ముందు అటువైపు ఇటువైపు పెద్ద అరుగులు ఉంటాయి. అవి సుమారు మూడు అడుగుల ఎత్తులో ఉంటాయి. దాన్ని సోఫా అంటారు. తర్వాత తలవాకిలి ఉంటుంది. వాకిలి దాటి లోపలికి వెళ్లగానే కుడివైపు ఎడమవైపు పశువులు అంటే ఎద్దులు బర్రెలు ఆవులు మొదలైన వాటిని కట్టేసుకోవడానికి వీలుగా గాడిపాళ్ళు వుంటాయి. గాడిపాళ్ళ పైన పశువులకు మేత పెట్టడానికి మచ్చు వుంటుంది. దాని మీద పశువులకు అవసరమైన జొన్నచొప్ప, వరిగడ్డి మొదలైనవి పెట్టి అందులో నుంచి లాగి పశువులను కట్టేసిన గాడిపాళ్ళల్లోకి మేతను వేస్తూ ఉంటారు. గాడిపాళ్ళు తర్వాత కొంత ఖాళీ స్థలముంటుంది. దాని తర్వాత మూడు అడుగుల ఎత్తులో గోడ ఉంటుంది. గోడ అవతల ఎడమవైపు వంటగది, కుడివైపు ఒక గది ఉంటాయి. కుడివైపున ఉన్న ఈ గదిని కొట్టిడిల్లుఅంటారు. ఆ కొట్టిడింట్లో బీరువా(ఇనప్పెట్టె), విలువైన సామానులు, వంటకు అవసరమైన వస్తువులు మొదలైనవి పెట్టుకుంటారు. అంటే అది నేటి స్టోర్ రూమ్ లాంటిది. కొందరు వంటగదిని కొంచెం ఎత్తులో కట్టుకుంటారు.

రాయలసీమ ప్రాంతంలో ప్రతి ఇంట్లోనూ పశువులను కట్టేసుకోవడానికి వీలుగా గాడిపాళ్ళు తప్పనిసరిగా ఉంటాయి. పశువులను కోస్తా జిల్లాల్లో మాదిరిగా వేరుగా కొట్టాల్లో కట్టివేయరు. ఇలా ఇంట్లోనే పశువులను కట్టేసుకోవడానికి ఒక కారణముంది. ఒకప్పుడు తెలంగాణా ప్రాంతం నుంచి థగ్గులు అనే పేరు గల దొంగలు వచ్చి పశు వులను తోలుకొని వెళ్లిపోయేవారట.వారి నుంచి పశువులను రక్షించుకోవడానికి ఆ ప్రాంతం వాళ్ళు ఇంట్లోనే పశువులను కట్టేసుకుంటున్నారు. అలా కట్టేసుకోవడం ఒక ఆచారంగా మారిపోయింది. మన దేశాన్ని ఆంగ్లేయులు పరిపాలించే కాలంలో వారు థగ్గులను పూర్తిగా అణచి వేశారు. థగ్గుల బాధ లేకపోయినప్పటికీ రాయలసీమలో ఇల్లు అలాగే కట్టుకునే వారు. అవసరం తీరిపోయినంత తొందరగా ఆచారం మారదు గదా.

జయదేవ్ నివసించిన ఇల్లు అదే పద్ధతిలోనే ఉంది. తలవాకిలి చాలా ఎత్తుగా వెడల్పుగా ఉంది. ఆ వాకిలి తలుపులు కోట తలుపులు మాదిరిగా పెద్దగా ఉండేవి. లోపల తలుపులకు గడియతోపాటు గడెమాను కూడా ఉంది. ఆ ఇల్లు అంటే ఆయనకు చాలా ఇష్టం. ఆయన బాల్యంలో ఎక్కువగా బయట సోఫాలో మంటినూనె బుడ్డి వెలుతురులో చదువుకునే వాడు. విశాలమైన సోఫాల్లో చుట్టుపక్కల పిల్లలతో కలిసి ఆడుకునే వాడు. వేసవికాలంలో ఆసోఫాల్లోనే మంచాల మీద పడుకునే వాళ్ళు. ఆయన ఆరవ తరగతి సుమారు నాలుగు కిలోమీటర్ల దూరంలో వున్న కొలిమిగుండ్లలో చదువుతున్నప్పుడు జయదేవ్ నాన్న వాళ్లు ఆస్తుల పంచుకొని వేరు బోయారు. జయదేవ్ అమ్మ నాన్న అక్కచెల్లెళ్ళు అందరూ ప్రస్తుతం వారి స్వగ్రామమైన చాకరాజువేములకు వెళ్లిపోయారు. అప్పుడు ఆయన ఆరవ తరగతి మధ్యలో ఉన్నాడు. మధ్యలో టీ.సి. తీసుకుని వేరే బడికి వెళ్ళడం ఇష్టం లేక ఆరు నెలల పాటు ఆయన ఒక్కడే ఆ ఇంట్లో ఉండి స్వయంగా వంట చేసుకుని ఆరవ తరగతి చదువుతున్న కొలిమిగుండ్లకు నడుచుకుంటూ వెళ్లి ఆరవ తరగతి పాస్ అయ్యాడు. ఆ తర్వాత టీ.సి. తీసుకొని వారి ఊరికి దగ్గర్లో ఉన్న దొర్నిపాడు ప్రభుత్వ పాఠశాలలో ఏడవ తరగతిలో చేరాడు.

ఆ తర్వాత రెండుమూడేళ్లకు జయదేవ్ తండ్రి ఆ ఇంటిని వేరే వాళ్లకు అమ్మాడు. వాళ్లు కొంతకాలం ఆ ఇంట్లో ఉండి ఆ వూరు వదిలి పెట్టి దగ్గరలో ఉన్న తాడిపత్రి అనే పట్నానికి వెళ్లిపోయారు. ఆ ఇంట్లో ఎవరూ లేక పోవడం చేత ఇల్లు పాడైపోతుందని భావించి ఇంటి పైన ఉన్న మట్టిని తొలగించి అందులో ఉన్న స్తంభాలు దూలాలు దంతెలు మొదలైన కలపను తొలగించి అమ్మేశారని దేసన్న చెప్పాడు. ప్రస్తుతం ఒట్టి మొండి గోడలు మాత్రమే ఉన్నాయి. గతంలో తాను నివసించిన తనకిష్టమైన ఇల్లు అలా ఉండటం చూసి ఆయన చాలా బాధపడ్డాడు.

జయదేవ్ ఇల్లు ఉన్న ఆ వీధిలో ఎక్కువ మంది గొల్ల కులస్తులుండేవారు. ఆ వీధి ఉదయం సాయంత్రం గొర్రెలు మేకల అరుపులతో చాలా హడావుడిగా ఉండేది. ఆయన ఆ వీధి నంతటిని కలియతిరిగారు. చాలా ఇళ్ళు పాడు బడిపోయి ఉన్నాయి. కొందరు వున్నా వాళ్ళు గొర్రెలను మేకలను పెంచడం లేదు. ఆ తర్వాత అతను ఆ ఊరు మొత్తం తిరిగారు. ఊర్లో చాలా ఇళ్ళు పాడుబడి ఉన్నాయి. ఊరు చాలా వరకు నిర్మానుష్యంగా వుంది. ఇంచుమించు ఊరు సగానికి పైగా ఖాళీగా ఉంది. ఈ ఇళ్ళవాళ్ళందరూ వేరే ఊరికి వెళ్లడం గాని, లేక రోడ్డు మీద ఇల్లు కట్టుకోవడం గానీ చేశారట. అక్కడ ఉన్న వాళ్ళందరూ వయస్సులో పెద్దవాళ్లు. వాళ్ళందరూ తాము మొదటి నుంచి ఉంటున్న ఇళ్ళను వదిలి వెళ్ళలేక అలాగే కాలం వెళ్ళబుచ్చుతున్నారు.

జయదేవ్ చివరగా మాల, మాదిగ కులస్తులున్న ఇళ్ళ వైపు వెళ్ళాడు. ఇటిక్యాల నుంచి కొలిమిగుండ్ల హైస్కూల్ కు వెళ్లడానికి అడ్డదారి ఉండేది. ఆ దారి మాల మాదిగల ఇళ్ళ పక్కనుంచి వెళ్ళేది. జయదేవ్ చిన్నతనంలో అక్కడ ఉన్న మాల మాదిగలు ఇల్లు ప్రస్తుతం పూర్తిగా పాడు పడిపోయి వున్నాయి. అక్కడ వాళ్ళు ఎవరూ లేరు. వాళ్ళందరూ రోడ్డు దగ్గరికి వెళ్లిపోయారట. ప్రభుత్వం వాళ్లకు రోడ్డు దగ్గర ఇల్లు కట్టించి వాళ్ళు పని చేసుకోవడానికి వీలుగా నాపరాళ్ళుపాలిష్ పెట్టే యంత్రాలను వాళ్లకు ఇచ్చారట. వాళ్ళందరూ నాపరాళ్ళు పాలిష్ చేసుకుంటూ వాటిని ఇతర ప్రాంతాలకు ఎగుమతి చేస్తూ జీవిస్తున్నారని దేసన్న చెప్పాడు. ప్రభుత్వం వారు వాళ్లకు ఆ విధమైన సహాయం చేసి వాళ్ళ జీవితంలో మార్పు తెచ్చినందుకు జయదేవ్ చాలా సంతోషించాడు.

జయదేవ్ చిన్నప్పుడు కొలిమిగుండ్లకు వెళ్లడానికి ఉన్న అడ్డదారి ఇప్పుడు లేదు. ఆ దారిని ఎవరూ వాడకపోవడం చేత ఆ దారి కంపచెట్ల తో మూసుకుపోయింది. ఆ కంప చెట్ల పక్కన కొన్ని తోటలున్నాయి. జయదేవ్ చిన్నతనంలో తోటలు లేవు. ఇటిక్యాల విద్యార్థులే గాకుండా ఇటిక్యాల కంటె ఇంకా దూరాన ఉన్న చింతరాపల్లె, కోర్నెపల్లె మొదలైన ఊర్ల నుంచి వచ్చే విద్యార్థులు గూడా ఆ దారిలోనే కొలిమిగుండ్ల హైస్కూల్ కు వెళ్ళేవారు. అది రాళ్లతో గుట్టల మీద ఉన్న కాలిబాట. ఆ బాట పక్కన అనేక చిన్న చిన్న చెట్లు ఉండేవి. వాటిలో రేగుచెట్లు బలుసుచెట్లు మొదలైన పండ్లచెట్లు కూడా ఉండేవి. విద్యార్థులు దారిలో ఉన్న ఆ పళ్ళు కోసుకుంటూ తినుకుంటూ వెళ్లేవారు. కొంత దూరం వెళ్ళిన తరువాత ఆ కాలిబాట రోడ్డు మీదకు వెళ్తుంది. అప్పుడు ఆర్టీసీ బస్సులు లేవు. కొన్ని ప్రైవేటు బస్సులు తిరుగుతూ ఉండేవి. విద్యార్థులు చేయి ఎత్తితే కొన్ని ప్రైవేటు బస్సుల వాళ్ళు ఆపి వాళ్లను కొలిమిగుండ్ల దాకా ఉచితంగా తీసుకుని వెళ్ళేవారు. అలాగే స్కూల్ నుంచి వచ్చేటప్పుడు కూడా కొన్ని బస్సులవారు ఉచితంగా బడి పిల్లలను ఇటిక్యాల రోడ్డు దగ్గర దింపేవారు. కొన్ని బస్సుల వారు ఆపకుండా వెళ్లేవారు. అలాంటి వారిని విద్యార్థులు గట్టిగా తిట్టేవారు.

ఇటిక్యాల నుంచి కొలిమిగుండ్లకు నడుచుకుంటూ వెళ్లడం చాలా సరదాగా వుండేది. పిల్లలు రాళ్లు తీసుకొని రోడ్డు మీద విసురుకుంటూ నడుచుకుంటూ వెళ్లేవారు. రాళ్లు ఎవరు ఎక్కువ దూరం విసురుతారని పందెం వేసుకునేవారు. నడుచుకుంటూ రాళ్లు విసురుకుంటూ వెళ్ళటం మంచి వ్యాయామంగా కూడా ఉండేది. ఆ విషయాలన్నీ తలుచుకొని జయదేవ్ సంతోషించాడు

జయదేవ్ చిన్నప్పుడు ఆ ఊర్లో ఫ్యాక్షన్ తగాదా ఉండేది. ఆ ఊర్లోనేగాదు దాదాపు ఆ చుట్టు పక్కల అన్ని వూర్లలోనూ ఫ్యాక్షన్ తగాదాలు ఉండేవి. ఊర్లో

నాయకులు రెండు వర్గాలుగా విడిపోయి కొట్లాడుకునేవారు. ప్రత్యర్థులు దొరికితే చంపేవాళ్ళు. మిద్దెలు ఎక్కి వడిసెల్లతో పరస్పరం రాళ్లు విసురుకునేవారు. అలా రాళ్లు విసురుకునేటప్పుడు ఊర్లో వాళ్లు ఎవరూ ఇళ్ల నుంచి బయటకు వచ్చే వారు కాదు. వస్తే వడిసెల నుంచి వచ్చే రాళ్ళు తగిలి పెద్దగా గాయపడే వాళ్ళు, కొంతమంది చనిపోయేవాళ్ళు కూడా. అందువల్ల ఎవరూ ఆ సమయంలో ఇళ్ల నుంచి బయటకు వచ్చే వాళ్ళు కాదు. ప్రస్తుతం ఫ్యాక్షన్ తగాదాలు లేవని దేసన్న చెప్పాడు. అది మంచి పరిణామమే అని జయదేవ్ సంతోషించాడు.

ఆ రోజు రాత్రి దేసన్న మనవరాలు పెళ్లి. పెళ్లి అయిపోయిన మరుసటి రోజు జయదేవ్ మళ్లీ ఒకసారి ఇటిక్యాల గ్రామమంతా తిరిగి చూశాడు. తాను పుట్టి పెరిగిన ఇటిక్యాల గ్రామం సగానికి పైగా పాడుబడి పోయినందుకు ఆయన చాలా బాధపడ్డాడు. కాలం చాలా గొప్పది, అది కాలక్రమంలో అనేక మార్పులను తెస్తుంది. కాలానికి అందరూ తల వంచవలసిందే అనుకుంటూ జయదేవ్ అక్కడ నుంచి తన స్వగ్రామానికి బయలుదేరాడు.

* * *

# జయదేవ్ కథలు



## ఆచార్య
## మర్రెబోయిన జయదేవ్
ఎం.ఏ., పిహెచ్.డి., డి.లిట్.

తాను విన్న కన్న సంఘటనలను తన స్వానుభవాలను ఇలా కథల రూపంలో జయదేవ్ గారు మలిచారు. ఇది కొంతవరకు కొత్త పద్ధతి. మొదటి 13 కథల్లో ప్రధానంగా మధ్యతరగతి బతుకుల చిత్రణ కనిపిస్తుంది. చివరి ఏడు కథలు జయదేవ్ గారి అనుభవాలకు సంబంధించిన ఆత్మాశ్రయకథలు.

ప్రొ. తంగెడ కిషన్ రావు, ఉపాధ్యక్షులు,
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

మధ్యతరగతి మనుషుల ఆశలు ఆవేశాలు ఆక్రోశాలు బాధలు గాథలు బలాలు బలహీనతలు అవమానాలు అక్రమ సంబంధాలు ప్రేమలు పెళ్లిళ్లు అన్నీ ఈ కథల నిండా పరుచుకొని ఉన్నాయి. రచనాపరంగా చెప్పాల్సి వస్తే ఏ భేషజాలు పాండిత్య ప్రకర్షణలు శైలీ విన్యాసాల జోరు హెూరు దరిచేరని అతి సహజమైన పద్ధతిలో రాయబడిన కథలివి. ఈ కథల్లో కనిపించే ప్రతి పాత్ర మనతోపాటు జీవిస్తూ మనం పీల్చేగాలి పీల్చుతూ వదులుతూ మన చుట్టూత కనిపించే వ్యక్తుల లాగే కనిపిస్తుంది.

- వి.ఆర్. రాసాని

ఓ మానవతావాది ఉత్తమ పరిశోధకుడు కథలు రాస్తే అందులో కనబడే ఇంటలెక్చువల్ పోజ్ ఈ కథల్లో దర్శనమిస్తుంది. రాయలసీమ ముద్రతో వెలువడుతున్న ఈ 20 కథల సంపుటి ఆచార్య జయదేవ్ గారిని మంచి కథా రచయితగా నిలబెడుతుందనడంలోఎలాంటి సందేహం లేదు. మంచి పరిశోధనలే కాక మా మంచి కథలందిస్తున్న జయదేవ్ గారికి అభినందనలు.

- కాలువ మల్లయ్య